వేదుల శకుంతల

# స్పందన

(మొదటి భాగం)



జయంతి పబ్లికేషన్స్

దిల్‌సుఖ్ నగర్, హైదరాబాద్ - 60

# SPANDANA

by

VEDULA SHAKUNTALA

First Edition

18 AUGUST, 2001

Title Graphic

Indrajit

Cover Design

Sharat Siddoju

Price : Rs. 100 /-

For Copies

VISALANDHRA BOOK HOUSE, Hyderabad.

and all its branches.

and

VEDULA SHAKUNTALA

Flat No. 141, Block No. 11,

Aravind Avenue, Janapriya Apartments,

Ramantapur, Hyderabad.

Ph : 7035338

Type setting, Printed and Published by

**JAYANTHI PUBLICATIONS**

-9-90, P&T Colony, Dilsukh Nagar, Hyd - 60.

Ph : (040) [redacted] 40424246

# అంకితం



'కృష్ణా పత్రిక' సంపాదకులు

కీ:శే: ముట్నూరి కృష్ణారావు గార్కి

నిండు మనస్సుతో...

-వేదుల శకుంతల

# రెండు మాటలు

శ్రీమతి వేదుల శకుంతలను గూర్చి నేనైై కొత్తగా పరిచయం చేయవలసిన అవసరం లేదు.

ఆమె ఇంతవరకే ప్రథిత యశస్క. చేయి తిరిగిన ఈ రచయిత్రి తెలుగునాట వెలసిన రచయితలందరికీ చిరపరిచిత. నలభై సంవత్సరాలుగా సాహిత్య క్షేత్రంలో కృషి చేస్తూ ఎన్నో కథలూ, నవలలు పంటగా పండించిన ఉత్తమ కృషీవలి. ఆ పంట ఫలితంగానే ఎన్నెన్నో పురస్కారాలు ఈమెను వరించి వచ్చాయి. సోదరభాష అయిన కన్నడంలో ఈమె రచనలు అనూదితం కావడం ఈమె సాహితీ సుందరి శిగలో మరో సిరిమల్లె చెండు సింగారించినట్లుగా భాసిస్తూ ఉంది.

ఇంత ప్రసిద్ధి సంతరించుకున్న ఈ, మా శకుంతల సంసార లంపటంలేని సంఘమిత్ర కాదు. 'స్త్రీవాద రచయిత్రి' అంతకన్నా కాదు. అన్యోన్యమైన దాంపత్యసుఖంతో కడుపు పండగా కళకళలాడే సంసారసాగరాన్ని ఈదుతున్న మధ్యతరగతి కుటుంబినీ.

ఎంత సంప్రదాయం, ఎన్ని కట్టుబాట్లున్నా తన శక్తులనన్నిటినీ ఇంటి చాకిరికీ, పొయ్యి రాజబెట్టేందుకు మాత్రమే సీమితం చేసుకోక ఉవిదలు నేర్వగరాని నేర్పు కలదే ?! అంటూ లోకాన్ని ప్రశ్నించినట్లుగా 'కృష్ణాపత్రిక' లో చేరి తగిన సేవలు అందించిన రచయిత్రి, విరామంలేని కృషితో దినానికొక కొత్త పేరుతో రచనలు చేసి తనకొక ప్రత్యేకమైన గుర్తింపును దక్కించుకున్న ధన్యాత్మ... శ్రీమతి శకుంతల.

ఇంతవరకె ముద్రితమైన ఈమె నవలా, కథలల్లో కనిపించె పాత్ర పోషణం, సంభాషణా చాతురి, ఆయా పాత్రల మనో విశ్లేషణం, ఆసక్తికరమైన కథాకథన పద్ధతి, సరళ సుందరమైన శైలి రమ్యతలను గూర్చి ఇంతవరకే ఎందరో ప్రముఖులు అభిప్రాయాలను వెల్లడించినారు. చర్విత చర్వణంగా నేనా పనికి పూనుకోక, నా పరిధిని 'స్పందన' మట్టుకే సీమితం చేసుకుంటూ రెండు మాటలు చెప్పదలుచుకున్నాను.

'కృష్ణాపత్రిక' లో దినదినం కనిపించిన శీర్షికల సంకలనమే ఈ 'స్పందన.'

స్పందనం అంటే... కదలిక, స్ఫురణం, స్ఫూర్తి అనే అర్థాలున్నవి. ఈ పదాలన్నిటికీ సారాంశంగా అర్థాన్ని గ్రహిస్తే ఏదో సంచలనం, మనస్సుకు తోచడం, ఇంకా ఆలోచిస్తే... నిద్రాణమైన బుద్ధిని జాగృతం చేయడం, మేల్కొలపడం అనే అర్థాలు స్ఫురిస్తాయి. అందుకే శకుంతలగారు తాను వ్రాసిన శీర్షికలను సాముదాయికంగా కట్టకట్టి ఏకవచనంలో 'స్పందన' అన్నారు. ఏదో ఎర్షితల్లి అనుకున్నాను... కాదు, గట్టి గింజనే! కాకపోతే- తన శీర్షికలకు చమత్కారంగా ఇంత లోతైన అర్థాన్ని ఇవ్వగలుగుతుందా?

'స్పందన' లో దాదాపు యాభై శీర్షికల్లో జీవితానికి సంబంధించిన విషయాలెన్నో ఒకటీ ఒకటున్నర పేజీకి మించని వ్యాసరూపంలో చర్చింపబడ్డాయి. పట్టి చూస్తె విషయం చిన్నదె కాని- వాని ఎత్తికోలు, పెంపుదల, ముగింపులు చూస్తే విచిత్రంగా వుంటుంది.

ఈ విషయాలన్నీ ఏదో అలవోకగా పత్రికకోసం వ్రాసినట్లుగా కనిపించదు. ఏదో ఉదాత్తమైన ఆశయంతో ఎవరెవరినో ఉద్దేశించి వ్రాసినట్లుగా వుంటుంది ఒకొకచోట ఏదో లోనాభి రామాయణంగా సాగుతుంట.

'అలవిగాని చోట' అనే శీర్షిక- "సాధ్యపడని చోట ఒదిగి ఉండటం బుద్ధిమంతుల లక్షణం!" అంటూ మొదలుపెట్టి గబగబా ఆఫీసులు, కుటుంబాలు, పెళ్లిళ్లు, అతిథులు, భారత కథల చుట్టూ తిరిగి వేమన పద్యంతో అంతమౌతుంది. ఇదీ చమత్కారం.

స్పందన వ్యాసాల్లో ఈ రచయిత్రి చెప్పే మాటలు నిజంగా మనస్సుకు ఎక్కడో తగులుతాయి. కొన్నిచోట్ల తానే ఒక తీర్పుకర్తగా పరిష్కారం చూపినట్లుండి, మరో చోట ఉపాధ్యాయినిగా ఉపదేశిస్తుంది. ఇంకో చోట "మీరే ఆలోచించండి మంచి చెడ్డ..." అంటూ పాఠకులకే వదిలేస్తుంది. అన్నిటికన్న మిన్నగా 'సత్యం, శివం, సుందరం' అనే భారతీయ ధర్మస్వరూపాన్ని కుదురుగా జడలా అల్లి చివరకు సారాన్నిజడ కుచ్చుల్లా తీరుస్తుంది. సామాన్యంగా చూస్తే "ఏదో రాసిందిలేదో..పేజీలు నింపడానికి!" అని అనిపించేంత మామూలు భాషలో ఏ ఆడంబరాలు, అలంకారాలు, గ్రంథగ్రంథాలూ లేకుండా రచన సాగిపోతుంది.

నిజం ఆలోచిస్తే... నాకెందుకో హితోపదేశం గుర్తుకువస్తుంది. చొరతనంతో, కలిమితో, మూర్ఖులైన రాజకుమారులను విజ్ఞానవంతులుగా చేసేందుకు విష్ణుశర్మ చేసిన ప్రయత్నంలో కనిపించే జాణతనం ఈ శీర్షికల్లో కనిపిస్తుంది.

అంతేకాదు.., Moral Class-Book అనే గ్రంథం (W+R Chambers limited, Edinburgh-1906) లో కనిపించే Conduct towards Animals 'presence of mind' వంటి వ్యాసాలను పోలిన నీతి స్వరూపం ఈ 'స్పందన' వ్యాసాల్లో గోచరిస్తుంది.

ఉదాహరణకు- "కాలం విలువ గ్రహించిన పెద్దలు ఇవాళ చేయవలసిన పని ఇవాళే చేయి. రేపటికి వాయిదా వేయకు" అంటారు. ఇక్కడ నిజానికి- చెబుతున్న పెద్దమనిషి శ్రీమతి శకుంతలగారే! ఇట్లే "అన్నిటికన్నా జీవితం విలువైనది" అంటూ చెప్పి "త్యాగులు, ధర్మపరులు, భక్తులు, జ్ఞానులు, వీరాధిపతులైన మహనీయుల వల్లనే విలువలు కాపాడబడుతాయి" అంటారు.

ఇట్లే 'నాగరికత' అన్న శీర్షికలో...

"ఈనాడు మృగాలకన్నా పై తరగతికి చేరిన మానవుడు నాగరికత ముసుగులో మళ్లీ దిగజారి మృగానికన్నా క్రిందికి పడిపోతున్నాడు" అంటూ "అలనాడు అజ్ఞానంతో ఆకులూ అలములూ కట్టుకుంటే ఈనాడు జ్ఞానం కలిగి అర్ధనగ్నంగా తయారౌతున్నారు" అంటూ ఈనాటి యువతరం నారి అభిరుచులను ఈసడించుకొన్నారు. అంతేకాదు.., సవరించుకొమ్మంటారు.

ఈ విధంగానే 'కృత్రిమం' అనేవ్యాసంలో . . .

"వాస్తవానికి దూరంగా బ్రతుకుతున్న మనం చీకట్లో నడుస్తున్న వాళ్ళతో సమానం. ఎంత త్వరగా వెలుగువైపు రాగల్గితే అంత మంచిది"...అంటూ ఊర్కోక, "అందుకు ప్రయత్నించాలి" అంటూ హెచ్చరిస్తారు.

ఈ విధంగా ఈ వ్యాసాల్లో ఆరోగ్య సూత్రాలను గూర్చి, పురుషార్థాలను గూర్చి, మూర్ఖత్వాన్ని గూర్చి, సార్థకతను గూర్చి, సూచనలు, అస్పృశ్యత, అకించన్యం, వారధి, స్వకర్మాచరణ... వంటి అనేక విషయాలను గూర్చి ఎంతో సమర్థతతో వ్రాసి పాఠకులకు ఆనందాన్నీ, నీతినీ అందించగలిగారు రచయిత్రి.

ఈ చిన్న పుస్తకంలో సోదరి శకుంతల ఆచార, ఆరోగ్య, ఆధ్యాత్మిక సంపదకు లంకె కలిపి త్రివేణీ సంగమంగా భాసింపచేశారు.

ఈనాడు కొత్త మోజుతో పాతను రోతగా తీసి పారవేస్తున్న యువతరం సంప్రదాయానికీ, సదాచారాలకూ దూరమౌతూ త్రిశంకు స్వర్గం వైపు పరుగు తీస్తుంటే ఆవేదనతో ఈ తరం పూర్తిగా పురుగాడి చెడిపోకుండా సంస్కార స్వరూపాన్నీ, నిజమైన నాగరికతా లక్షణాన్ని తెలిపేందుకు చేసిన ప్రయత్నంగా గోచరిస్తుంది.

ఈ 'స్పందన' వ్యాస సంపుటి కేవలం నీతి బోధకు ఉపయోగించే పిట్ట కథలు మాత్రమే కాక, కనువిప్పు కలిగించే దివ్యౌషధంగా కూడా ఉపకరిస్తుంది. అంతేకాదు.., మన తెలుగు సాహిత్య క్షేత్రంలో ప్రౌఢమైన చిన్నయసూరి రచనలను జీర్ణించుకోలేని సుకుమార బుద్ధులైన ఆబాల గోపాలానికి ఈ రచనలు రుచిస్తాయి కూడ.

నిజానికి... కొత్త పోకడలు వెదికే వారికి ఈ రచన మరో కొత్త దారి చూపుతూ మలుపు తిప్పుతుంది. అందరూ చదువతగ్గ పుస్తకం. చదివి చూడండి... అందుకు మీరే ప్రమాణం.

**- డా : శ్రీమతి పి. యశోదారెడ్డి**

కవయిత్రి, రచయిత్రి

# మానసిక స్పందన

మనిషి మనిషిగా ఎదగడమంటే శరీరం పెరగడమే కాదు, మనిషిలోని విజ్ఞానం పెరగాలి.

అందుకే మానవ మనుగడకు విజ్ఞానపు వెలుగుకోణం... సాహిత్యం. 'సాహితం సాహిత్యం' అన్నారు పెద్దలు. మనిషికి మానసికఆరోగ్యాన్ని కలిగించేది సాహిత్యం. అందుకే అన్ని కళల కంటె సాహిత్యానికి పెద్ద పీట వేశారు. చదివి ఆనందింపచేసేదే కాదు, ఆలోచింపచేసి మనసులో మరో కొత్తవెలుగు తళుక్కుమనిపించేది సాహిత్యం.

సాహిత్యం ఓ తరంలో ఉద్భవించినా అది తరతరాలకు ప్రాతినిధ్యం వహిస్తూనే ఉంటుంది. సాహిత్యంలో దాగిఉన్న సూక్ష్మాతిసూక్ష్మమైన ఓ విజ్ఞానపు తరంగం తరతరాలకు అందిస్తూనే ఉంటుంది, మనిషి జీవితాంతం వెంటాడుతూనే ఉంటుంది. అందుకే సాహిత్యానికి అంత విలువ ఉంది. మానవుని జీవితంలో ఓ భాగమై సహజ సిద్ధమైన కథాంశం చుట్టూ విషయ ప్రస్తావనతో ఇక్షురసంలా విజ్ఞానాన్ని అందించేవి మహాగ్రంథాలు. రామాయణ, మహా భారతాది గ్రంథాలు ఆ జాతికి చెందినవే. వేద వేదాంగాలలోని విషయ విపులీకరణకు అవి నిదర్శనాలు.

ఏ కథాంశం లేకుండానే మానవ జీవితానికి సంబంధించిన అనేక సంఘటనలతో మానసిక విజ్ఞానాన్ని అందించే అనేక విషయాలు ఎంతో ప్రాధాన్యతను సంతరించుకున్నాయి. మనిషిలో ఆలోచనా స్పందన లేనప్పుడు మనిషి చీకటిలో బతుకుతున్నట్టే. మనిషిలో ఏ ప్రావీణ్యం పెరగాలన్నా సాహిత్యమే ఉదాహరణ అవుతుంది. మనిషి మహోన్నతంగా పెరగడానికి పునాది సాహిత్యమే. ఈ అంశాలు ఛాదస్తాలు కావు. బూజు పట్టిన సంప్రదాయాలు కావు. ఎప్పటికప్పుడు జీవితంలో కొత్త కోణం తెరచి చూపించేవే!

మనిషి ఏ పని చేయాలన్నా ఆలోచిస్తాడు. ఎత్తులు వేస్తాడు. విషయ పరిజ్ఞానం సరిగా లేనప్పుడు చిత్తైపోతాడు. అందుకే విషయ పరిజ్ఞానం చాలా అవసరం. దానికి పఠనా శక్తి చాలా అవసరం. కొందరు ఇప్పటికీ "ఏం చదివితే విజ్ఞానం పెరుగుతుంది?" అని అడుగుతూ ఉంటారు. "జీవితానుభవం పాఠాలు నేర్పుతుంది" అని కొందరంటారు. కాని, ఆ నేర్పేది జీవితాంతంలో కదా! అంతకుముందే అనుభవం కావాలి... అంటే మన అనుభవాలే కాదు, ఇతరుల అనుభవాలు కూడా చదివి తెలుసుకుంటే అవి మన అనుభవాలు అవుతాయి. అయినా... జీవిత సత్యాలను ఎంత అనుభవమున్నా అందరూ అర్థంచేసుకోలేరు. ఆ జీవిత సత్యాలను గ్రంథరూపంలో అందించిన వారినుంచి గ్రహించాలి. అవి మన జీవితానికి విజ్ఞానపు నిలువుటద్దంలా నిలుస్తాయి.

ఆ కోవకు చెందిన సాహిత్యమే శ్రీమతి వేదుల శకుంతలగారు అందించిన ఈ 'స్పందన' గ్రంథం.

శ్రీమతి వేదుల శకుంతలగారు 1964 నుంచి కలం పట్టిన సాహితీవేత్త. 20కి పైగా నవలలు, 100 కథలు రచించిన సాహితీమూర్తి. 'మనీలా' రేడియో ప్రసారానికి మన 'ఆకాశవాణి' ప్రసారాలకు నాటకాలు, నాటికలు, వ్యాసాలు రచించారు. అనేక పత్రికల్లో వారి కథలు ప్రచురించబడ్డాయి.

శకుంతల గారి రచనల్లో 'గుప్పెడు మనసు' మొదలైన కథలు బహుమతులతోపాటు సాహితీప్రియుల మన్ననలు అందుకున్నాయి.

'పునాదిరాళ్ళు, ఆడ్జ్టాల్ ఆడది, ఆర్తి' మొదలైన నవలలు సాహితీ జగత్తులో చిరస్థాయిగా నిలిచిపోయే రచనలు.

పుంఖానుపుంఖంగా సాహిత్యం వెలువడుతున్నా ప్రజాదరణ పొందిన రచయితలు కొందరే! ఆ కొందరిలో శ్రీమతి శకుంతల ఒకరు అనడం అతిశయోక్తి కాదు. ఆవిడ గలగలాపారే సెలయేరు కాదు. నిర్మలంగా సాగిపోయే నదీప్రవాహం వంటిది. లోతైన మనస్సులో ఆణిముత్యాలవంటి ఆలోచనలున్నాయి. ఆ ఆలోచనా స్వరూపమే శకుంతలగారి ఈ 'స్పందన' గ్రంథం.

'కృష్ణా పత్రిక'లో ధారావాహికంగా వెలువడిన 350 వ్యాసాల సమాహారంలో 100 వ్యాసాల కూర్పే ఈ 'స్పందన.' అదే పత్రికలో 'కృష్ణా తరంగిణి' పేరుతో ఈవిడ రాసిన మరో 300 వ్యాసాలు త్వరలోనే గ్రంథరూపంలో వెలువడనున్నాయి. ఆ వ్యాసాలన్నీ సాహితీప్రియుల మనసులను దోచుకున్నవే! శ్రీమతి వేదుల శకుంతలగారి ఈ 'స్పందన' ఆవిడ హృదయస్పందనే కాదు, సాహితీ లోకానికే ఓ మానసిక స్పందన.

ఈ గ్రంథంలో కథలు లేవు. ఇది వ్యాసమూ కాదు. కేవలం ఓ శతకంలా రకరకాల విషయ విపులీకరణతో కూడిన వ్యాసాలు. అవి జీవిత సత్యాలను విపులీకరించే విషయ వర్ణనలు. మానసిక విజ్ఞానానికి దోహదకారులు.

'అలవికాని చోట' అనే విషయాన్ని వివరిస్తూ ఆవిడ-

"తన ఉనికికీ, తన మాటకీ విలువ లేనిచోట ఎవరైనా ప్రత్యేకత చూపిస్తానంటే సాగదు. అందుచేత ఎవరైనా వీలుగాని చోట అధికారం చేసినా, దర్పం చూపినా చెల్లదు. కనుక మనకి సాధ్యపడని చోట ఒదిగి వుండటం బుద్ధిమంతుల లక్షణం!" అని వివరించారు. నిజమే! అనుభవంలో ఆవిడ చెప్పిన మాటలు పాఠకలోకం పాఠం నేర్చుకున్నట్లే. "కొండ అద్దమందు కొంచమై ఉండదా- విశ్వదాభిరామ వినురవేమా!" అని వేమన పద్యం ఇక్కడ ప్రస్తావించడం కొసమెరుపే!

'మూర్ఖత్వమంటే -' అనే విషయం వివరిస్తూ...

"ఈ మూర్ఖత్వం చాలామందికి ఉంది. వాళ్ళు చెప్పిందే ఎదుటివాళ్ళు నమ్మాలి.., వినాలి! అంతేకాని, ఒకవేళ మనకి తెలియదేమో.., తెల్సుకుందాం- అనుకోరు!" అని చెప్పటమే కాదు, మూర్ఖత్వ నిర్వచనం ఒక్కసారి చూడండి! "అజ్ఞానం, అహంకారం కలిసి చిక్కబడితే అది మూర్ఖత్వంగా రూపు దాలుస్తుంది!" ఇంతకంటే స్పష్టంగా, క్లుప్తంగా మూర్ఖత్వాన్ని గురించి మరెవ్వరూ చెప్పలేరేమో! 'తివిరి ఇసుమున తైలంబు తీయవచ్చు!...మూర్ఖుల మనస్సు రంజింపరాదు' అన్న విషయం ఈవిడ ఒక్క వాక్యంలో తేల్చి చెప్పారు.

అలాగే 'అపాత్రదానం, కంగారంటే, సుపుత్రులనగా, బోధ- బాధ, మోతాదంటే, విలువలు, సంగతులు, చర్విత చర్వణం, వారధి, క్షమంటే ..' మొదలైన ఎన్నో విషయాల మీద ఆవిడ వివరణ తెలియజేశారు.

'అస్పృశ్యత' గురించి ఈవిడ చెబుతూ...

"ఒక్కోసారి హఠాత్తుగా అసంకల్పిత చర్యగా దూరం జరుగుతాం. అంటే మనం నిల్చున్న ప్రదేశమో, పదార్థమో తాకరానిదై వుంటుందన్నమాట. ఇలా తాకటానికి పనికిరాని దానికి 'అస్పృశ్యత'

అంటాం! శుభ్రత లేనిచోట అనారోగ్యానికి మూలహేతువు గనుక అటువంటి ప్రదేశం నుండి దూరంగా జరగడం ఆరోగ్యప్రదం. అలాగే చెడిపోయిన వస్తువు- పండ్లుగానీ, పానీయాలుగానీ, తినుబండారాలుగానీ ముట్టుకున్నా, తిన్నా అనారోగ్య కారణమే గనుక స్పృశించకూడదు. ఇంతకుమించి అస్పృశ్యత అన్నది మరెక్కడా వుండకూడదు. ఏదైనా అంటువ్యాధి సంబంధమైతే తప్ప మనుష్యుల దగ్గర అస్పృశ్యత అన్న పదం మానవతకే మచ్చ!" అని వివరించారు.

అన్ని విషయాలతోపాటు శకుంతలగారు అస్పృశ్యతను గురించి స్పష్టంగా వివరించడం ఆమె లోకజ్ఞతకు నిదర్శనం.

డా: అంబేద్కర్, బాబూ జగ్జీవన్ రాం... మొదలైన మహానుభావులు, మహాకవి జాషువా వంటి కవులు అస్పృశ్యతా నివారణకై ప్రబోధం కలిగించారు. అయినా జాడ్యంలా అది కొనసాగుతూనే వుంది. శ్రీరామచంద్రుడు శబరి ఎంగిలి ఫలాలను తిని ఆదరించడం సమాజంలో అట్టడుగు ప్రజానీకం మనలో ఒకరని తెలియచెప్పడమే కదా! మానవునిలోని మూర్ఖత్వాన్ని తొలగించి వెలుగుబాట వైపు పయనించడానికి ఇటువంటి విషయ పఠనం చాలా అవసరం

ఏ సాహిత్యానికైనా చదివించే శక్తి, ఆలోచింపచేసే శక్తి చాలా అవసరం. ప్రజల కర్థమయ్యే భాష, పండిత పామరులను ఆకర్షించే విషయ విపులీకరణ చాలా అవసరం. ఈ గుణాలన్నీ శ్రీమతి శకుంతలగారి 'స్పందన' వ్యాసాలకు పుష్కలంగా ఉన్నాయి. పైగా... చాట భారతమంత వివరణ కాకుండా అన్ని వ్యాసాలు అచ్చులో 2 పేజీలు మాత్రమే వచ్చేటట్లుగా రాయడం ఆవిడ రచనలో ఓ ప్రత్యేక గుణం.

ఈ 'స్పందన' ఒక నీతిశాస్త్రం కాదు.., ధర్మశాస్త్రం కాదు , జీవితపు విలువలను తెలియజెప్పే ఒక జీవిత విజ్ఞానశాస్త్రం. మనిషి సక్రమ మార్గంలో నడవడానికి ఎదురయ్యే ఒడిదొడుకులను ఎదుర్కొని సుఖసంతోషాలతో శాంతియుతంగా జీవితగమ్యం చేరడానికి పనికివచ్చే గ్రంథమిది. మానవ మనుగడలో తరతరాలుగా జీవనదిలా సాగుతున్న మానవ జీవితసత్యాలను ఆణిముత్యాల్లా ఏర్చి కూర్చిన విలువైన గ్రంథం ఈ 'స్పందన' . . . నిజంగా మానసికస్పందనే!

ఇటువంటి రచన చేసిన శకుంతలగారి సాహితీ జీవితం ధన్యం.

ఈ 'స్పందన'ని పుస్తక రూపంలోకి తీసుకొచ్చిన 'జయంతి పబ్లికేషన్స్' వారికి ధన్యవాదాలు.

జైహింద్..!

**- డా: శ్రీమతి వాసా ప్రభావతి**

కవయిత్రి, రచయిత్రి

# వేదుల వాక్యం

'చదువు రాని వాళ్ళు సూక్తుల గ్రంథాన్ని ఒకసారి చదివించుకుని వింటే చాలు'
- విన్‌స్టల్ చర్చిల్.

తల పండిన ఓ రాజకీయవేత్త అన్నమాట అది.

ఒక సూక్తి, ఒక మంచిమాట ఎంత ప్రభావాన్ని కలిగించగలదో, మనిషిని విజ్ఞానవేత్తగా మలచగలదో, సంస్కారిగా నిలబెట్టగలదో వివరించే కథలు మనకున్నాయి. 'సహసా విదధీతన క్రియాం'... 'తొందరపడి ఏ పనీ చేయరాదు' అన్న మహాకవి భారవి తాటాకు శ్లోకం ఒక జీవితాన్ని, సంసారాన్ని నిలబెట్టిన కథ మనకు తెలుసు. నిజానికి మంచిమాటలు చెప్పడం చాలాకష్టం. ఎందుకంటే అవతలి వారు- మరొకరు తమకు 'ఏదో ఉద్బోధ చేస్తున్నారు' అనుకున్న మరుక్షణం బిర్రబిగుసు కుంటారు. ప్రభు సమ్మితాలు, మిత్ర సమ్మితాలు, కాంతా సమ్మితాలు... అనే వాటిల్లో శాసించే మాటలు, హితవు చెప్పే మాటలు, అనునయించే మాటలు వున్నప్పుడు కాంతా సమ్మితమైన వాక్యానికి వున్న ప్రభావగుణం మరీ గొప్పది.

'పురుషులకంటే స్త్రీలు విజ్ఞానవంతులు. ఎందువల్లనంటే స్త్రీలకు తెలిసినది తక్కువైనప్పటికీ అర్థం చేసుకునే శక్తి ఎక్కువ' అని ఒక జేమ్స్ స్టీఫెన్స్ అన్నా.., 'ఆడవారిని మించిన పుస్తకాలు, కళలు, అకాడమీలు లేవు. ఆడవారి హృదయాన్ని చదవగలిగితే అన్ని పుస్తకాలు చదివినట్లే. అన్ని కళలూ సాధించినట్లే' అని షేక్స్‌పియర్ అన్నా... తరచి చూస్తే అందులో అతిశయోక్తి ఏమీ లేదనిపిస్తుంది.

'స్పందన' పేరుతో శ్రీమతి వేదుల శకుంతలగారు కూర్చిన ఈ వ్యాస సంపుటి కూడా ఇందుకు దాఖలా. 'ఇతరులకి విసుగు కల్గించనివీ, మనతోపాటు పదిమందికి మేలు జరిగేవీ, చర్విత చరణమైనా అవి నిత్యనూతనాలై వర్ధిల్లుతాయి' అంటారు శకుంతల గారు. ఈ 'స్పందన' రచనలు అన్నీ శకుంతలగారి ఉదాత్త భావబలిమికీ, అనుభవ సంపత్తికీ, అర్థవంతమైన విషయాలను ంతాసమ్మితంగా, ప్రయోజనదాయకంగా చేయగల అభివ్యక్తికీ దృష్టాంతాలు.

అభిప్రాయాలు కలిగేశక్తి అందరికీ వుండవచ్చు. కానీ, ఆలోచించగలిగే శక్తి కొద్ది మందికే ంటుంది. తమ ఆలోచనలను అక్షరబద్ధం చేసి పరితను కూడా ఆ అనుభవ ప్రపంచం లోకి తీసుకువెళ్లి ఆ భావాలను దర్శింపచేసి స్పందింప చేసే లక్షణం శకుంతలగారికి వుంది.

"ఈనాడు సగటుమనిషి సహజత్వం తానే కోల్పోయి కృత్రిమ జీవనానికి అలవాటు పడిపోతున్నాడు. ఇంటా-బయటా, మనసులో కూడా ఈ కృత్రిమం నిండిపోయి వాతావరణం యావత్తు కృత్రిమమే అయిపోతున్న రోజులివి." (కృత్రిమం)...

"ఒక సద్గ్రంథం తరతరాల ఆస్తి. మంచి పుస్తకాల ఆవశ్యకత ఈనాటి ప్రజలకి ఎంతయినా వుంది. అవి గుర్తించికొంటే ఎన్నో సత్ఫలితాలు సాధించవచ్చును. అంతేకానీ- ఖరీదైన సబ్బులూ, సుగంధ ద్రవ్యాలూ బోలెడన్ని కొని చర్మసౌందర్యమే ఆవశ్యకమనుకునే వారిని చూసి జాలిపడాలి. ఆత్మసౌందర్యం ఇనుమడిస్తేనే తనకేగాక, తన చుట్టూ సమాజంలో పరిమళాలు వెల్లివిరుస్తాయి." (ఆవశ్యకత)

అదిగో- ఆ పరిమళాలు వెల్లివిరియచేయగల రచనలే ఈ 'స్పందన' అంశాలన్నీ.

అత్యల్పమనుకునే విషయాలనుంచికూడా అనల్పమైన ఆలోచనలు ప్రేరేపించే తీరు, సొరు ఈ రచనలది. ఇందులో స్పృశించని అంశం లేదేమో! ఏ అంశాన్ని గురించి చెప్పినా- ఏదో పైపైన తడమటం కాకుండా, నిజాయితీగా దాని గురించి గాఢంగా ఆలోచించి, అనుభూతమైన అంశాలనే అభివ్యక్తం చేసారు. చెప్పదలుచుకున్న విషయాలను అయోమయం, పులుముడు లేకుండా నిష్కర్షగా చెప్పారు

ఇవి చదువుతుంటే 'ఈ సంగతులన్నీ నాకు తెలిసినవే' అని పాఠకుడు అనుకున్నా- తనకు తెలిసిన సంగతులనే కొత్త పరిమళాలతో- తాను పట్టించుకోని, తనలోకి అనుభవసారంగా ఇంకించుకోని జడతను ఛేదించుకుని- గ్రహించి, ఆనందించేలా చేసారు రచయిత్రి.

ఈ పుస్తకం ఎప్పుడు, ఏ పేజీ తిప్పి, ఏ పేరా చదివినా ఒక సూక్తిమంతమైన, స్ఫూర్తిమంతమైన ఆలోచనకు స్పందన కలుగుతుంది కనుక 'స్పందన' అన్నపేరు సార్థకమే.

ఇవన్నీ 'వేద వాక్కులు' కాకపోవచ్చు. కానీ 'వేదుల వాక్కులు' వేదుల శకుంతలగారు ఒక వేదనతో జీవితం గురించీ, విలువల గురించీ, మానవ సంబంధాల గురించీ, సువ్యవస్థ గురించీ కలవరించి, పలవరించే- హృదయం వికసించిన బుద్ధిజీవిగా చెప్పిన మాటలు ఇవన్నీ. 'మనస్సు సక్రమంగా ఆలోచిస్తేనే మనిషి సక్రమంగా ప్రవర్తిస్తాడు. సక్రమ మార్గం వల్ల సమాజ శ్రేయస్సు పటిష్టంగా వుంటుంది' అని విశ్వసించినవారు కనుకనే రుగ్మతలు పోగొట్టుకునే 'క్యాప్సూల్స్'గా, 'మాత్రలు'గా, 'భావ గుళికలు'గా ఈ రచనలను రూపొందించారు.

ఆరోగ్యదాయకమైన మనుషుల కోసం, మనసుల కోసం, రేపటి మంచిరోజుల కోసం ఈ తరానికి 'ప్రిస్క్రయిబ్' చేయదగిన ఆలోచనా ఔషధం ఈ గ్రంథం. ముందుచూపు నిచ్చే ఈ 'స్పందనే' మంచి మందు. మున్ముందు ఈ రకం 'ఔషధ' ఉత్పత్తి వేదుల శకుంతలగారు మరింతగా చేయగలరని ఆకాంక్ష.

**ఆకాశవాణి** **- సుధామ**

**5.12.2001**

# పబ్లిషర్స్ నోట్

**క**ళాభిమానులు, సాహిత్యాభిలాషులైన మీకందరికీ శుభ స్వాగతం. ఈ 'స్పందన' లోకి ప్రవేశించే ముందు స్వాగతగీతంలా ఓ చిన్నమాట.

ఎలక్ట్రానిక్ మీడియా విజృంభణతో 'సాహిత్యానికి కాలం చెల్లిపోయిం'దని అందరూ నిర్ధారించేసిన ఈ రోజుల్లో 'ఉత్తమ సాహిత్యమెప్పుడూ అజ్ఞాతంగా ఉండిపోదనీ, మంచి రచనలకి పాఠకుల ఆదరణ ఎప్పుడూ ఉంటుం'దన్న ఆత్మవిశ్వాసంతో ప్రచురణ రంగంలోకి ప్రవేశించి దిగ్విజయంగా ముందుకు సాగుతున్న మా **'జయంతి పబ్లికేషన్స్'** ద్వారా విడుదలవుతున్న మరో సాహితీ ముత్యమే ఈ **'స్పందన'** వ్యాస సంపుటి.

'ముంజేతి కంకణానికి అద్దమేల...? జగమెరిగిన బ్రాహ్మణుడికి జంధ్యమేల...?' అన్నట్టుగా ఈ 'స్పందన' రచయిత్రి వేదుల శకుంతల గారి గురించి ప్రత్యేకంగా వివరించ నక్కరలేదు. 1964 లో రచనా వ్యాసంగానికి శ్రీకారం చుట్టి నాలుగు దశాబ్దాలుగా నిర్విరామంగా రచనలు చేస్తూ ఆ తరం, ఈ తరం పాఠకులకీ, సాహిత్యాభిలాషులకీ చిర పరిచితులైన రచయిత్రి వేదుల శకుంతల! ప్రింట్ మీడియా మొదలు ఎలక్ట్రానిక్ మీడియా దాకా కథ, నవల, నాటకం, వ్యాసం మొదలైన విభిన్న ప్రక్రియల్లో తనదంటూ ఓ ప్రత్యేకమైన శైలినీ, గుర్తింపునూ, గౌరవాలనూ పొందిన రచయిత్రి... శ్రీమతి వేదుల శకుంతల గారు.

ఇక ఈ 'స్పందన' వ్యాస పరంపర... వేదుల శకుంతల గారి కలం ద్వారా ప్రముఖ దినపత్రిక 'కృష్ణా పత్రిక' లో 'స్పందన' శీర్షికతో సంవత్సరకాలంపాటు ధారావాహికంగా ప్రచురితమై అటు పాఠకులు, సాహితీప్రియులచే విశేషంగా ఆదరించబడి, ఇటు రచయిత(త్రు)లు, విమర్శకులచే ప్రశంసించబడిన 350 వ్యాసాలలో 'మొదటి భాగం'గా వెలువడుతున్న 100 వ్యాసాల కూర్పు.

'రాశి' కన్నా 'వాసి'కే ఎక్కువ ప్రాముఖ్యాన్నిస్తూ సాహిత్యంలో అణిముత్యాలనదగ్గ రచనల్ని పాఠకులకి అందించాలన్న సదాశయంతో కొనసాగుతున్న మా 'జయంతి పబ్లికేషన్స్' సగర్వంగా సమర్పిస్తోన్న రచన... ఈ 'స్పందన.' గత ఆగస్టు నెలలో మా సంస్థద్వారా విడుదలయిన వేదుల శకుంతలగారి 'ఆర్తి' నవల పట్ల పాఠకులు చూపించిన ఆదరణ, ప్రోత్సాహాలే ఈ 'స్పందన' ముద్రణకు స్ఫూర్తి. మా ఈ ప్రయత్నాన్ని కూడా పాఠకులు ఆదరిస్తారని మా ప్రగాఢ విశ్వాసం.

చివరిగా.. వేదుల శకుంతల గారి ఈ 'స్పందన' ప్రచురణ గురించి తెలుపగానే 'చాలా మంచి ప్రయత్నం...' అంటూ ప్రశంసించడమేకాక, తమ అమూల్యమైన అభిప్రాయాలను అందించిన డా: శ్రీమతి పి. యశోదారెడ్డి గారికి, డా॥ శ్రీమతి వాసా ప్రభావతి గారికి, శ్రీ సుధామ గారికి మనః పూర్వక ధన్యవాదాలు.

అలాగే... పుస్తకం శీర్షికను అందంగా గీసిన చిత్రకారుడు శ్రీ ఇంద్రజిత్ గారికి, పుస్తకానికి డిజిటల్ వర్క్‌తో కవర్ డిజైన్ చేసిన శ్రీ శరత్ సిద్దోజు గారికి కృతజ్ఞతలు

మీ అభిమానం, ఆదరణలతో మరిన్ని సాహితీ సుమాలు వసంతంలా మిమ్మల్ని అలరించడానికి మా సంస్థ నుండి వెలువడగలవని తెలియజేస్తూ...

ఈ పుస్తకంపై మీ అమూల్యమైన అభిప్రాయాలు తెలుపగలరని ఆశిస్తూ...

... ఎస్వీ కృష్ణజయంతి

**జయంతి పబ్లికేషన్స్**

# 'స్పందన' కి ముందు వెనుకలు!

"కృష్ణాపత్రికలో మహిళాపేజీ నిర్వాహకురాలిగ మీరు పనిచేయాల్సి వుంటుంది" - అని ఆ పత్రికా సంపాదకులు శ్రీ పిరాట్ల వెంకటేశ్వర్లుగారు చెప్పారు. అంతకుముందే మిత్రురాలు డా. వాసా ప్రభావతి నాకు ఫోను చేసి "కృష్ణాపత్రికలో పనిచేయటానికి అభ్యంతరం ఏమీలేదు కదా? నేను వెంకటేశ్వర్లుగారికి మీ పేరు సూచించాను" - అని చెప్పారు. ఇది నేను ఊహించనిది. అనుకోని గురుతరమైన బాధ్యత! ఆశించని అవకాశం! అయినా అంగీకరించాను. ఎందుకంటే కృష్ణాపత్రికయందూ, ముట్నూరి కృష్ణారావుగారి పట్ల గౌరవాభిమానాలతో ఈ అవకాశం సద్వినియోగం చేసుకోవాలనుకున్నాను

ఇదంతా స్పందనకి వెనుక కథ!

ఆ తర్వాత- 'కృష్ణా తరంగిణి' అనే శీర్షికని నిర్వహిస్తున్న తరుణంలో 'స్పందన' ప్రస్తావన వచ్చింది "పాఠకుల అభిప్రాయాలు, సూచనలు, విమర్శనలు... ఇవన్నీ 'స్పందన' పేరుతో ముందుగా మీరు వ్రాయండి(ఇతరులనుండి అడిగి సేకరించి). ఆ తర్వాత పాఠకులనుండి ఉత్తరాలు వస్తాయి"... అని వెంకటేశ్వర్లుగారు చెప్పారు. ఆ పని ప్రారంభించేముందు నేను- ఉత్తరాల బదులుగా చిన్న చిన్న హితోక్తులు..., లేదా బోధలు. . వ్యాసరూపంలో వ్రాసేను. ఆ రచనలపై పాఠకుల స్పందన విశేషంగా వచ్చింది. ఇది ఒక విచిత్ర సంకల్పం! ముట్నూరి వారి ఆత్మ ప్రేరణ కావచ్చును!! ఆ విధంగా పాఠకుల ఉత్తరాల కొరకు కేటాయించిన స్పందన కాలమ్... 'స్పందన' అనే నా రచనలతో రూపకల్పన జరిగి విశిష్టస్థానం సంతరించుకుంది. ఇది నిజంగా యాదృచ్ఛికమే అయినా... నాలో నిద్రాణమైన శక్తిని మేలుకొలిపి, గుప్తంగా గుండె పొరల్లో అణిగివున్న ఆధ్యాత్మికతని స్పందింపజేసి... 'స్పందన' రూపంలో వెలువడింది.

ఇందుకు పిరాట్ల వెంకటేశ్వర్లుగారికి, వాసా ప్రభావతిగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతలు! అందించిన శీర్షికని అందుకుని నిజంగానే స్పందించిన పాఠకులకి నమస్సులు!

పుస్తక రూపంలో ఈ సంపుటిని ఆవిష్కరించిన సందర్భంలో నా ఈ స్పందన వ్యాసాలని సమీక్షించి, ప్రశంసించి... సభాముఖంగా నన్ను ఆశీర్వదించిన జ్ఞానపీఠ అవార్డు గ్రహీత, పద్మశ్రీ డా. సి. నారాయణరెడ్డిగార్కి వినమ్రతతో వందనాలు సమర్పిస్తున్నాను. ఆనాటి సభలో తమ అభిప్రాయాలను వెల్లడించిన అభిమానులందరికీ ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను.

ఇక ఈ వ్యాస సంపుటికి తమ అమూల్య అభిప్రాయాలు వ్రాసి ఇచ్చిన గౌరవనీయులు విదుషీమణి, వినమ్రశీలి డా. శ్రీమతి పి. యశోదారెడ్డిగారికి నా హృదయపూర్వక కృతజ్ఞతాంజలి సమర్పించుకుంటున్నాను. అలాగే డా: వాసా ప్రభావతి నాకు మిత్రురాలు, సన్నిహితురాలు. వారు ఈ వ్యాససంపుటికి వ్రాసి ఇచ్చిన ముందుమాటకి కృతజ్ఞతలు. ఇక సుధామగారు చక్కని పలుకులు వ్రాసేరు . వారికి నా కృతజ్ఞతలు సమర్పిస్తున్నాను.

చివరిగా.. ఈ వ్యాసాలు పుస్తకరూపం దాల్చటానికి అవసరమైన ప్రచురణ బాధ్యతలన్నింటిని తానే స్వీకరించి సహకరించిన ప్రముఖ రచయిత శ్రీ యస్వీకృష్ణగారికి, పుస్తకాన్ని అందంగా ముద్రించిన 'జయంతి పబ్లికేషన్స్' వారికి నా హృదయపూర్వక ధన్యవాదాలు తెలుపుకుంటున్నాను.

ఈ వ్యాస సంపుటిని ఆదరించిన ప్రతివారికి నా ఆనందాన్ని పంచుతూ అందరికీ ఈ వ్యాస పరంపర ఉపయుక్తమవాలని కోరుకుంటున్నాను.

సృజించిన సాహిత్యం సార్థకమవాలన్నదే నా ఆశయం!

**- వేదుల శకుంతల**

# స్పందన క్రమం

# 1

# స్పందన!

'స్పందన' అంటే ఏమిటీ?

ఒక అనూహ్యమైన మానసిక కదలిక !

ఈ కదలిక 'అనూహ్యమైంది' అని చెప్పుకోవాలి! అయితే, ఆ కదలిక అనే మంచి మార్గం వైపు- అంటే... అంతకుముందు మానసికంగా వున్న స్థానం కదిలి మరొక మెట్టు పైకి వెళ్ళగల్గి మానవత్వం నింపుకోగల్గేదిగా వుండాలి!

సాధారణంగా హృదయం ఆర్ద్రమై మనస్సు చెమ్మగిల్లగల్గితేనే 'స్పందించటం' అని భావిస్తూ వుంటాం. కానీ, నిజానికి 'స్పందన' అనేది మన భావ ప్రమాణానికి అతీతమైన నూతన విషయం విన్నప్పుడు - 'ఓహో!' అనుకోగల్గి మనం కొత్త పులకింత గానీ, నవ్య భావోద్వేగం కానీ పొందగల్గితే ఆ స్థితిని కూడా 'స్పందించటం' అనుకోవచ్చును.

ఒక చిన్నపిల్ల దారితప్పి తల్లికోసం దీనంగా ఏడుస్తూ వుంటే మనం ఆర్ద్రతతో కదలిపోతాం. అదే ఒక వయస్సు వచ్చిన ఆడపిల్ల దారి తెలియక బెదురు చూపులతో రోడ్డుమీద నించుని వుంటే ఎంతమంది ఆర్ద్రత నింపుకోగలరు? నింపుకోరు. పైగా... కొంటెగా చూస్తారు! ఏమిటి కారణం? చిన్నపిల్ల యందు ఇంకా అవాంఛనీయమైన కోరిక జనించదు గనుక (ఈనాడు అదీ జరుగుతోంది.

అది వేరే విషయం) ఆ పిల్లని రక్షించాలనే ఉద్దేశం కల్గుతుంది. అంటే తనలో స్వార్థం వుండదు గనుక! అదే -వయస్సులో వున్న ఆడపిల్లని చూస్తే స్వార్థం బుసకొట్టి ఆర్ద్రతని మింగేస్తుంది.

కనుక మనిషికి స్వార్థం, ఆశ, సుఖలాలస ఉన్నంతవరకు ఎలాంటి హృదయవిదారకమైన దృశ్యాలకీ చలించడు! కళ్ళముందు ఎలాంటి సంఘటనలు జరుగుతున్నా స్పందించడు.

కనుకనే నిత్యం మనం ఎన్నో దారుణాలు చూస్తున్నా, వింటున్నా చలించి మారలేకపోతున్నాం.

పర్సు పోగొట్టుకున్న ప్రయాణీకుడు, తిండిలేక పస్తులతో బాధపడే దరిద్రుడు, తను ఎన్ని బాధలు పడుతున్నా ఇతరుల అవసరాలు తీర్చే సహనవంతుడు... ఎందరెందర్నో మనం చూస్తున్నా- స్పందించలేం !

కానీ - ఈ సత్యాలన్నీ విప్పి చెప్పినప్పుడు అద్దంలో ప్రతిబింబం చూసుకున్నంత అనుభూతి కల్గి - 'నిజమే సుమా... మనం వున్న స్థితి ఇది కాదా?' అని ఒక భావ వీచిక మనల్ని చుట్టివేస్తుంది! అది స్పందనే !!

యావత్ సృష్టిలో అనేక విషయాలు నిబిడీకృతమై వుంటాయి. అన్నీ మనకి తెలియవు. అసలు ఎవరికీ తెలియవు. కొన్ని తెలుసన్నవాళ్ళు ఇతరులకి తెలియచేస్తే, 'అరే! ఈ సంగతి నాకింతవరకు తెలియదే!' అన్న ఒక స్పందన మనలో కల్గుతుంది.

ప్రకృతిని చూసి స్పందించి కవిత్వం రాసే కవీ- సమాజ స్థితికి చలించి రాసే రచయితా - సంఘసేవ చేసే మదర్ థెరెసా - కొల్లాయి గట్టిన గాంధీ - వీళ్ళంతా స్పందించిన వాళ్ళే ! స్పందన అనేది ఒక మంచి మార్పును తెచ్చేదిగా - తనను తాను తెలుసుకుని ప్రక్షాళనం చేసుకునేదిగా వుండాలి!

అనేక దుర్మార్గాలు చేసే కిరాతకుడు ఒకానొక మహాముని యొక్క వాక్యాలు విని యదార్థం తెలుసుకుని స్పందించి మారినాడు... వాల్మీకి అయినాడు.

అందుచేత - తాత్కాలికమైన మార్పు, క్షణం సేపు చలించే స్థితీ... స్పందన అనుకోకుండా, ఒక శాశ్వతమైన శుభపరిణామాన్ని తేగలదే - నిజమైన స్పందన !!





# నమస్కారం!

రెండు చేతులూ జోడించి పైకి హృదయం దగ్గర కానీ, నుదుట కానీ, తలపైన కానీ పెట్టి, చిరునవ్వుతో . . . అరమోడ్పు కన్నులతో చేసే చర్యనే 'నమస్కారం' అంటారు! సాష్టాంగ నమస్కారం, నేల మీద పడుకుని పాదాలకి చేయడం! మనిషి నిత్యం అనేక విషయాలలో నమస్కారం చేయాల్సి వస్తుంటుంది. ఇష్టం ఉన్నా, లేకున్నా చేసే నమస్కారాలు కొన్నైతే, మనస్ఫూర్తిగా చేసే నమస్కారాలు కొన్ని !!

రెండు చేతులూ జోడించటమంటే అర్థం . . . కుడి చెయ్యి రజోగుణ ప్రధానమై, ఎడమచేయి తమోగుణ ప్రధానమై - ఆ రెండూ కలిసిపోతే 'సత్వగుణం' అంటే - సాత్వికమై, మనిషి సాత్వికుడై ఎదుటి వాడిని గౌరవించే విధానం - ఈ నమస్కారంలోని అంతరార్థం!! అది హృదయ ఫలకం మీద చేతులు ఆనించినప్పుడు సాటి వ్యక్తిలోని భగవత్ స్వరూపానికి తలవంచుతున్నానని అర్థం! అందుకే - మనం ఎవరికి నమస్కరించినా చేతులు హృదయందాకా వచ్చి ఆగుతాయి!

రెండు చేతులూ నుదుట తాకి గానీ, దూరంగా కానీ పెట్టి నమస్కారం చేస్తే- గురువులైన వారికీ, పూజింపబడే వారికీ, తల్లిదండ్రులకీ, పెద్దలకీ చేసినట్టు భావించాలి. గురువు పరబ్రహ్మతో సమానం. మన శరీర భాగంలో - నుదుట భ్రూమధ్యమమందు చూపు నిలిపి, ధ్యానం చేస్తే జ్యోతిస్స్వరూపం కనిపిస్తుంది. ఆ జ్యోతే పరబ్రహ్మ. ఆ పరబ్రహ్మని గురువు ద్వారా మంత్రోపదేశం

కానీ, విద్యగానీ, కళగానీ - ఏ సరస్వతీ స్వరూపమైన విద్యని గ్రహించినా అది గురువు నుంచి పొంది జ్ఞానాన్ని సంతరించుకున్నాము కనుక, ఆ గురువు ద్వారా పరబ్రహ్మని చూస్తూ - నమస్కరిస్తున్నాను - అని భావం!

అదే - రెండు చేతులూ పైకి ఎత్తి నమస్కరిస్తే - అంతటా నిండివున్న ఆ అనంత స్వరూపుడూ, సచ్చిదానందుడూ అయిన ఆ భగవంతునికి నమస్కరిస్తున్నానని భాష్యం! భగవంతుడు సర్వత్రా వ్యాపించి వుంటాడు గనుక - ఈ శరీర అవధుల్ని దాటుకుని, పైకి ఊర్ధ్వముఖంగా చేతులు జోడించి నమస్కరించట మవుతుంది!! ప్రతి మంత్రంలో - అష్టోత్తరాల్లో 'నమః' అని స్మరిస్తూ వుంటాం!!

చాలామంది 'నమస్కారం చెయ్యటం నాకిష్టం లే'దంటారు. అంటే - వారిలో సాత్త్విక భావన తక్కువ. రజోగుణం ఎక్కువ వుంటుంది. తానే గొప్ప అని, ఎవరికీ తలవంచననీ వారి అహంకారం. మరికొందరు నోటితో మాత్రం 'నమస్కారం' అనేస్తారు. అంటే... అసంకల్పితమైన, అలవాటైన పద్ధతి తప్ప దానిలో విశేషించి గుణం కనిపించదు.

బాల్యం నుంచే పిల్లలకీ, గురువులకీ, తల్లిదండ్రులకీ, పెద్దలకీ నమస్కరించే విధానం తెలియజేస్తే ఇక హృదయాల్లో జీవితార్థాలు దాచుకోగల్గుతారు. సాష్టాంగ దణ్ణం పెట్టడంలో తనను తాను అన్నివిధాల 'మీ పూజ్యభావానికి అంకితం చేస్తూ నమస్కరిస్తున్నా'నని నిగూఢార్థం!!

బాబాలకీ, దేవాలయాల్లో, పరమ పవిత్రమైన పుణ్యక్షేత్రాలలో భక్తిభావంతో చేసే నమస్కారమే ఈ సాష్టాంగం దణ్ణప్రణామం! అదే కొందరు వాంఛితార్థఫలం కోసం నమస్కారం చేస్తూ గుడిచుట్టూ సాష్టాంగాలు పడుతారు. అంటే - తనకు తానుగా ఏమీ మిగలకుండా 'నీ శరణే స్వామి... కోరుతున్నా'నని వెల్లడించుకోవటం !! ఇందులో వాంఛ లేకపోతే నిజంగా ఆ మనిషి ధన్యుడే. ఏమైనా... ఉదాత్తమైన నమస్కారం-అనేది మానవుడు నిత్యజీవితంలో అర్థవంతంగా చేయగల్గినప్పుడు, తమో రజో గుణాలని సాత్వికంలో ఐక్యం చేసి వినమ్రుడై మానవతా విలువల్నించి భగవత్ అంశకి చేరుకుంటాడు.





# ఆశీర్వాదం!

తన కన్నా చిన్నవారికి మంచి కోరుతూ . . . ఆ మనోగత అభిప్రాయాల్ని వెల్లడించే విధానమే ఆశీర్వాదం! హృదయాంతరాళాలలో నుంచి పరులకి శుభం కోరుతూ వెలువడే వాక్కులు, ఆశీస్సులు, ఆ చర్యని 'ఆశీర్వాదం' అంటారు.

మానవజన్మ మిగిలిన మూగజీవులన్నిటి కన్నా ఉత్తమోత్తమమైనది. తాను పవిత్రంగా బ్రతుకుతూ, మిగిలిన మానవజాతి శ్రేయస్సు కోరుతూ జన్మ సఫలం చేసుకోవాలన్నదే మానవ ధర్మం.

రెండు చేతులూ జోడించి నమస్కారం చేసినప్పుడు ఆ మనిషి ఎదుటివాళ్ళని గౌరవించి, విధేయత ప్రకటించినట్టు కదా? అప్పుడు ఆ నమస్కారం అందుకున్న పెద్దమనిషి తన గౌరవాన్ని నిలుపుకుంటూ ఆశీస్సులు అందిస్తాడు. 'ఆయురారోగ్య ఐశ్వర్యాభివృద్ధిరస్తు' అనో, 'విద్యా ప్రాప్తిరస్తు' అనో, 'సుపుత్ర ప్రాప్తిరస్తు' అంటూ... ఇంకా కొందరు 'ఇష్ట కామ్యఫల సిద్ధిరస్తు' అని దీవిస్తారు. అంటే - మనం ఏం కోరుకుంటామో 'అవన్నీ నీకు సిద్ధించుగాక' అని ఆశీర్వదిస్తారు.

ఈవిధంగా ఆశీర్వాదంలోని అంతరార్థం పరోపకారమై, శ్రేయోభిలాషతో ప్రకటించే దివ్యవాక్కులై మనల్ని ఆనంద పరుస్తాయి. ఇక్కడ మరొక విషయం గమనించాలి. ఎవ్వరైతే నమస్కరిస్తారో వారినే ఆశీర్వదిస్తారు. అంతేగానీ - ఊరికే కనిపించిన ప్రతివారికీ ఆశీస్సులు అందించరు. అంటే- ఎవరు వినమ్రుడై రెండు చేతులూ జోడించిగానీ, తలవంచి గానీ, పాదాలకి గానీ నమస్కరిస్తారో వారు

మననుంచి ఆశీస్సులు కోరుతున్నట్టు అర్థం. అప్పుడు నమస్కారం అందుకున్న వ్యక్తి శుభాశీస్సులు ఇస్తాడు. ఏమీ పలకకపోయినా చేయి ఎత్తి ఊపుతాడు.

చేయి పైకి ఎత్తి అరచేయి ముందుకీ, వెనక్కీ ఊపటంలో అర్థం... దీవించినట్టే!

ఎవరైనా మనకి కానుకగా గానీ, సత్కారం కానీ చేసినప్పుడు మనం వెంటనే 'థాంక్స్' అన్న ఇంగ్లీషు పదం ఉపయోగిస్తాం. అంటే- మన సంతోషం ప్రకటించి వాళ్ళకి కృతజ్ఞత తెలుపుకుంటాం. అలాగే- నమస్కారం చేసినవాళ్ళకి ఆశీస్సులు అందించటం మనదేశ మర్యాద? జాతి సంస్కృతి... ధర్మశాస్త్ర సమ్మతం! ఇక్కడ మనం గమనించవలసిన ఇంకొక సంగతి కూడా వుంది. ఆశీర్వాదం అనేది ఎప్పుడూ చిన్నలకే ఇవ్వాలి. ఇస్తారు. అలాగే - నమస్కారం పెద్దలకే చేయాలి. చేస్తారు. ఈ రెంటి ప్రక్రియలలోని పవిత్రభావం ఏమంటే... భగవంతుడు సృష్టి యావత్తుకు ఎలా అధిపతియై పాలిస్తూ వుంటాడో, శరణు అన్నవాడిని ఎలా రక్షిస్తాడో- అలాగే నమస్కరించిన వాడిని ఆశీర్వదించాలనేది ధర్మం.

చిన్నపిల్లలకి బిస్కెట్టు ప్యాకెట్ ఇస్తే 'థాంక్స్' అంటారు. తల్లులు కూడా ఈ రోజుల్లో అధునాతన పద్ధతుల్లో పిల్లలచేత ఈ 'థాంక్స్'లు చెప్పిస్తున్నారు. అలాగే -పిల్లలు ఏదైనా పెద్దలకి ఇచ్చినా, పెద్దవాళ్ళు కూడా పిల్లలకి 'థాంక్స్'లు చెప్తున్నారు. కానీ- ఇందులో పిల్లలకి ఆశీర్వాదం బదులు అపశ్రుతి అందిస్తున్నాం. ఆశీర్వదించాలి తప్ప కృతజ్ఞత తెలియచేయటం అంత సముచితం కాదు.

వివాహాది శుభ కార్యాలలో వధూవరులు పెద్దలందరికీ నమస్కారం చేసి ఆశీస్సులందు కుంటారు. దేవాలయాల్లో అర్చన చేసేక శటగోపం పెట్టడం ఆశీర్వాదమే. వ్రతాలు, పూజా కార్యక్రమాల్లో ఆశీర్వాదం పొందుతారు. సభా, సత్కారాలలో, అభినందన కార్యక్రమంలో ఆశీర్వాదమే వుంటుంది. ఆర్తులు, దీనులు బాబాల దగ్గర ఆశీస్సులు పొందడానికి వెళ్తూ వుంటారు.

పవిత్రమైన ఆశీర్వాద భావాన్ని మనం తెలుసుకుని సద్వినియోగం చేసుకుందాం.





# మృత్యుంజయుడు !

పుట్టుక - చావు ప్రతిప్రాణికి తప్పవు. 'పుట్టుట గిట్టుట కొరకే' అని అంటారు. అయినా సరే ప్రతివాడు 'చావు' అనే మాటకి భయపడి దూరంగా వుండాలనుకుంటాడు. ఇది పశు పక్ష్యాదులలో సైతం మనం గమనిస్తాం. ప్రతివాళ్ళకి 'మరణం' అంటే భయం. ఈ భయం వల్లనే ఆరోగ్యం కోసం, ఆయుష్షు కోసం అనుక్షణం మనిషి ప్రాకులాడుతూ వుంటాడు.

ఆనందం ఎంత ఉన్నతమో - వేదన అంత పతం. ఒక్కొక్కరు నిత్యం తమ ఆయురారోగ్యా కోసం వేదన పడుతూ ఏ చిన్నపాటి తేడా కనిపించినా కంగారుపడి డాక్టర్ల దగ్గరికి పరుగులెత్తుతాడు. అనుదినం తమ ఆరోగ్యం కొరకు మందులు, టానిక్కులు పుచ్చుకునే వారున్నారు. జాతకాలు, జ్యోతిషం చెప్పించుకునేవారున్నారు.

ఆరోగ్యం కాపాడుకోవటం వేరు. ఆయుష్షు పెరగాలనుకోవటం వేరు. ఎవరు, ఎంతకాలం నిర్ణయమో - అంతకుమించి క్షణం కూడా మనలేరన్న సత్యం తెలుసుకోవాలి.

ధర్మరాజు యక్షుడికి చెప్తాడు- 'తన కళ్ళముందు ప్రతివాడూ పోతున్నా తను మాత్రం శాశ్వతంగా వుంటాననుకుంటాడు మానవుడు. ఇదే ఈ ప్రపంచంలో చాలా వింత' అని.

ఈ 'వుంటాను' అనుకోవటం నిజానికి ఆత్మస్థైర్యం కాదూ, మాయా కాదు. అదే భయం వల్ల తనని తను మభ్యపెట్టుకుంటాడు. అంతేకాని- 'చావ'నని ధైర్యం కాదు. ఏదైనా భయం కల్గించే విషయం

వుంటే మనం దానినుండి తప్పించుకుందుకు చూస్తాం కదా? అలాంటిదే మరణ భయం. అందుకే - మనిషి 'అబ్బే నేను చచ్చిపోను'. అనే పిరికితనాన్ని దాచుకునే నటన.

కానీ - చావంటే భయం లేని వారున్నారు. వారు సామాన్యుల నుంచి భిన్నంగా వుంటారు. కర్తవ్యపాలన, మనోధైర్యం, ఆత్మత్యాగం గల మహామహులు వారు. వీర జవానులు, స్వాతంత్ర్య సమరయోధులు, జ్ఞానులు, వేదాంతులు, భక్తులు ఇలాంటివారే.

ఇలా మృత్యుభయం లేనివారే మృత్యుంజయులు.

అంతేగానీ - మృత్యువు లేనివారని అర్థంగాదు. మృత్యువు అనగా శరీరాన్ని త్యజించటం. ప్రతివాడికి మరణం తర్వాతనే అనుభవం అది. కానీ, జీవించి వుండగానే ఈ శారీరక వ్యామోహాన్ని త్యజించి కర్తవ్యపాలనే లక్ష్యం గల్గినవాడు, మృత్యు భయం లేనివాడు... మృత్యుంజయుడు!

లోకాలన్నిటిని భస్మం చేయగల గరళాన్ని కంఠంలోనే అదిమిపట్టి మృత్యువును ఎదిరించినవాడు గనుక ఆ శివుణ్ణి 'మృత్యుంజయు'డంటారు. ఈ సంసార సాగరంలో అనునిత్యం చింతలతో, దిగుళ్ళతో సతమతమవటమే నిజమైన మృత్యువు. ప్రతిరోజు ఎన్నో బాధలతో చస్తూ, బ్రతకటమే అసలైన మృత్యువు. ఇటువంటి సంసారచక్రం నుంచి తరింపచేయగల శివుడు మృత్యుంజయుడనీ, అతన్ని తెలుసుకోగల్గిన జ్ఞాని మృత్యుంజయుడనీ గ్రహించగల్గాలి. చీకటి, అజ్ఞానం, సంసార వ్యామోహం... ఇవన్నీ మృత్యువుకి ప్రతిరూపాలు. వెలుగు, జ్ఞానం, వ్యామోహం లేకుండుట... ఇవి విజయానికి చిహ్నాం!

ఎంతో తపస్సు చేసి వరాలు పొందినవారు వున్నారు. ఆయురారోగ్యాలతో పుత్ర పౌత్రాభి వృద్ధిగా వర్ధిల్లిన వారూ వున్నారు. ధృవుడు, మార్కండేయుడు మొదలైనవారు తపస్సు చేసి శివుణ్ణి మెప్పించేరని మనకి పురాణ గాథలు వున్నాయి. ఆ తపస్సంపన్నులు మరి ఇప్పుడు వున్నారా? ... మహా రాజ్యాలేలిన చక్రవర్తులు ఇప్పుడు వున్నారా? అవతారపురుషుడైన విష్ణువు సైతం తనువు చాలించలేదా? అందుకే ఈ శరీరం అశాశ్వతం.

జన్మించిన ప్రతిప్రాణి మరణించి తీరుతుంది గనుక ఈ పరమసత్యాన్ని అతి తేలిగ్గా తీసుకున్న ధీరుడే మృత్యుంజయుడు.





# భగవద్గీతంటే ?

భగవంతునిచే గానం చేయబడినదని అర్థం. అదే భగవద్గీత. భగవంతుడు తనను చేరుటకు మార్గాలు, లోకంలో జీవుడి సుఖకరమైన మనుగడకూ, లోక కళ్యాణానికై తానిచ్చిన సందేశం 'గీత'గా మనం ఆరాధిస్తున్నాం. భగవంతుడు వ్యక్తావ్యక్త స్వరూపుడు.మనం ప్రతినిత్యం చూస్తున్న ఈ సర్వ ప్రకృతీ, చైతన్య భరితమైన ఈ జగత్తంతా వ్యక్తము. మనం చూడలేనిదీ, ఊహించలేనిదీ అవ్యక్తము.

సామాన్య మానవులు దృష్టికి కనిపిస్తున్నది మాత్రమే నమ్మి, కనిపించని దానిని 'అసలు లేదు పో'మ్మని వాదిస్తారు. అలా వాదించేవారికి భగవద్గీత ఒక దివ్య సందేశం లాంటిది. గీతయొక్క ప్రతి అధ్యాయం చివర "భగవద్గీతాను ఉపనిషత్సు బ్రహ్మవిద్యాయాం, యోగశాస్త్రే, శ్రీ కృష్ణార్జున సంవాదే' అన్న పంక్తులు వుంటాయి.

అంటే - 'గీత'లో ఉపనిషత్తులు, బ్రహ్మవిద్య, యోగశాస్త్రం యొక్క అర్థాలన్నీ మిళితమై వుంటాయి. ఒక కృష్ణార్జున సంవాదం అంటే - బాహ్యానికి కృష్ణుడు, అర్జునుల సంవాదమని స్ఫురించినా అంతరార్థం ఓ భగవంతుడు, జీవుడి వాదన అని తెలుసుకోవాలి.

పంచమ వేదమనదగిన మహాభారతంలో అర్జునుడు తనకి గల్గిన అనేక సందేహాలని కృష్ణుడిని అడుగుతాడు. ఆ సందేహాలన్నీ ప్రతి నరునికి కల్గేవే. వాటికి నివృత్తి విధానమే కృష్ణుని నోటినుండి వెలువడిన సమాధానాలు. కృష్ణుడంటే భగవానుడే. భగవంతుని నోటినుండి వచ్చింది గనుక 'భగవద్గీత' అయింది.

మహాభారతం వ్రాసిన వ్యాస మహర్షి నాల్గు వేదాలలోని సారాన్ని, ఉపనిషత్తులలోని పరమార్థాన్ని కలిపి భారతం మధ్యలో కృష్ణార్జున సంవాద రూపంలో 'భగవద్గీత'ని సృష్టించేరు. అందుకే వ్యాసమహర్షిని వేదవ్యాసుడని అంటారు.

నరుడైనవాడు నారాయణాంశ చేతనే జన్మిస్తాడు. కనుక ఈ జగత్తులో నరుడు ఎలా తన జీవితాన్ని చరితార్థం చేసుకుని, తిరిగి నారాయణాంశలో లయమవాలో తెలుసుకునే ప్రశ్నలే అర్జునుడిచేత అడిగిస్తారు వ్యాసమహర్షి. వాటి సమాధానాలన్నీ కృష్ణపరమాత్మ చేత చెప్పిస్తారు. ఇది వ్యాసభగవానుని విశిష్టత. లోకకళ్యాణార్థం వ్రాసిన విశిష్టగ్రంథం మహాభారతం అయితే, అందులోని గీతార్థసారమే మానవ జీవితాల విశ్లేషణ! మనుషుల తత్త్వాలు, ఆహారాది నిత్య కృత్యాలు, మానసిక ప్రలోభాలు, తరతమ భేదాలు, అహంకారాది దర్పాలు, యుక్తాయుక్త విచక్షణ, ఆత్మ విమర్శ, యోగవిద్య, సమాజ పరిశీలన, సర్వసమైక్యతా దృష్టి.. చివరగా తనని తాను తెలుసుకుని ఆత్మార్పణ (భగవంతునిలో ఐక్యత) చేసుకోవటం గీతలోని సారం. నిఘంటువులు, డైరీలు గీతలోనే వున్నాయి. కొన్ని వందల పరిశోధనాత్మక గ్రంథాలన్నీ గీతకి సాటిరావు. గీత - అనాది గ్రంథం, నిత్య నూతనం కూడా. మనిషి జీవితంలోని ప్రతిక్షణం, ప్రతి కదలికకి అర్థం గీతలో చూడగలం. గణిత శాస్త్రంలోని ఫార్ములాలు, తెలుగు సాహిత్యంలోని వ్యాకరణం, చరిత్రలోని స్మృతులు, విజ్ఞాన శాస్త్రంలోని మేధస్సు, నాట్యార్థం, గానసారం, లలితకళల పరమార్థం, రాజకీయ పరిజ్ఞానం... ఇత్యాదివన్నీ ఒక 'గీత' క్షుణ్ణంగా విపులీకరిస్తుంది. అయితే - అది చదివి అర్థం చేసుకునే వారికే!! ఉత్తమోత్తమమై, సకల మానవ శ్రేయస్సుకు దోహదం చేసే గీతను భారతంలో పొందుపరచి మనకందించిన వేదవ్యాస మహర్షి మానవకోటికి గురువు, పూజనీయుడు.

ప్రతి ఇంటా ఉండదగిన, పఠించదగిన పవిత్రమైన గ్రంథం... భగవద్గీత.

న్యాయస్థానంలో ప్రమాణం చేయించేటప్పుడు గీతని తాకించటంలోని అర్థం- సకల మానవుల మీద ఒట్టు వేసినట్టు! అందరి జీవితాలకి ప్రత్యక్ష సాక్ష్యమే గీతలోని వివరణ! అందుకే- అది ప్రమాణ గ్రంథమైంది!





# బాల్యం !

ఈ జగత్తులో ఊపిరి తీసుకున్న మొదటి క్షణంలోనే ప్రారంభమయేది 'బాల్యం'. ప్రతి జీవికి పుట్టగానే ఈ సృష్టియావత్తు కొత్తదే! ఈ ప్రపంచ యాత్రలో తొలి మజిలీ బాల్యం దగ్గర మొదలవుతుంది! విశాల విశ్వంలో జీవితపాఠాలు నేర్చుకునే ముందు అక్షరాభ్యాసం లాంటిది ఈ బాల్యదశ !

బాల్యావస్థ అతి పవిత్రమైనది, నిర్మలమైనది, నిష్కల్మషమైనది. లోకంలోని కుళ్ళు, కుచోద్యాలు స్వార్థాలు, మోసాలు, తరతమ భేదాలు ఏమీలేని తెల్లకాగితం లాంటిది బాల్యం!! అందుకే 'బాలలు - బ్రహ్మ స్వరూపులు' అంటారు.

కానీ - అటువంటి బాల్యావస్థని పెద్దలు తమ నీడలో పెంచుతూ, తమ గాలి నింపి, స్వచ్ఛమైన వాళ్ళ మనస్సుల్ని మురికి చేస్తున్నారు!

నిజంగా - బాల్యావస్థలో గనుక సక్రమమైన రీతిలో, క్రమశిక్షణతో పెంచి, పెద్ద చేస్తే - దేశం ఎప్పుడో బాగుండేది!! లేతమొక్కకి స్వచ్ఛమైన వెలుతురు, గాలి, నీరు, ఎరువు వేసి శ్రద్ధ తీసుకుంటే - ఎలా ఏపుగా పెరిగి ఫలరసాలు అందిస్తుందో, బాల్యంలోని వారిని కూడా అలాగే నీతి, నిజాయితీ, సుగుణాలతో బుద్ధులు గరిపి పెంచితే సమాజంలో శాంతి, సుఖాలు వర్ధిల్లుతాయి!

ధనికుల పిల్లలు దర్పం, డాబు, గర్వం, పెంకితనం నేర్చుకుని బాల్యావస్థని చిందరవందరగా తయారు చేసుకుందుకు వాళ్ళ డబ్బే కారణం. శ్రామికులు తమ పిల్లల్ని అతి శ్రద్ధ చూపించే వీలుండక - పొలాల గట్లలో, మురికి గుంటల పక్కన పడుకోబెట్టుకుని గాలికీ, ధూళికీ పెరగనిస్తే పెద్దయ్యాక

మోటుగా, మొండిగా తయారవుతారు. ఇక - మధ్యస్థులు అటు గొప్పా, ముద్దూ, గారం, ఇటు తిట్లూ, నిరసన - రెండు రకాల పద్ధతుల్లో పెంచాల్సి వస్తుంది. కారణం- ఉండీ, లేని డబ్బు వలన! చాలీ చాలని జీతాలతో తమ సరదాలన్నీ పిల్లల ద్వారా తీర్చుకోవాలన్న ఉబలాటం! వీటివలన వారి పిల్లల బాల్యం సరియైన దారెటో తెలియక, తికమకగా తయారవుతుంది.

ఇలా బాల్యావస్థ వర్గభేదాలవల్ల రకరకాలుగా సాగి, పెద్దవారు అయితే, జీవితమంతా ఒడిదుడుకులుగానే సాగాల్సి వుంటుంది.

ఈ బాల్యావస్థ పసిగుడ్డు నుంచి కాకపోయినా కొంత నడక, మాటా వచ్చాక మొదలుకొని పదేళ్ళ ప్రాయం వరకు ఆ దశగానే చెప్పుకోవాలి. అంటే - జీవితానికి పునాది, ఈ దశలోనే వేయాలి. అటువంటి ప్రత్యేక స్థితిని, చాలామంది గ్రహించరు. ఎక్కువ శ్రద్ధ, జాగ్రత్త, క్రమశిక్షణ, ఆహారాది విషయాలలో, ఆరోగ్య సంరక్షణలో, బాల్యంలో తీసుకోవలసినవీ, చేయవలసిన ఏర్పాట్లూ ఎంతో కట్టుదిట్టంగా ఉండాలి.

కొందరిళ్ళలో వృద్ధులు, మధ్యవయస్కుల మధ్య, వాళ్ళింట్లోని పిల్లల బాల్యం, బంతిలా తిరుగుతుంది. అటు వృద్ధులు కొన్ని సూచిస్తూ, ఇటు మధ్య వయస్సు వారు కొన్ని సలహాలు, నియమాలు చెప్తుంటే పిల్లలు అయోమయంగా తయారవుతారు.

చదువు సంధ్యలలో, కళలలో, ఆటలలో, వ్యాయామ శిక్షణలో, పిల్లల అభిరుచి తెలుసుకుని, పెద్దలు పెంచగల్గితే, ఆ బాల్యం పున్నమి వెన్నెలలా నిండుగా ప్రకాశించి, పెద్దయ్యాక సమాజానికి పండువెన్నెల కాంతులు అందివ్వగల్గుతారు!

కొందరు దురదృష్టవంతులు 'నా' అనేవాళ్ళు లేక బాల్యాన్ని అతిగడ్డుగా సాగిస్తూ వుంటారు. అటువంటి వారికి ఆలనా పాలనా లేక పెద్దయ్యాక సంఘ విద్రోహకులుగా మారే ప్రమాదం వుంటుంది. ఈ బాల్యావస్థని నిర్లక్ష్యం చేసి ఆజమాయిషీ చేసేవారిలో కొందరు ఉపాధ్యాయులు కూడా వున్నారు!! అందరూ మంచి గురువులు కాలేరు!

ఇలా 'బాల్యం' అనే చక్కని కాగితం మీద పెద్దలందరూ పిచ్చిగీతలు గీయకుండా, మంచి అక్షరాలు వ్రాయగల్గితే ఆ బాల్యం వికసించి, ఆ అక్షరాలు ముత్యాలసరాలై, ప్రతి పౌరుడూ దేశమాతకి ముద్దుబిడ్డ కాగలడు!!





# వృద్ధాప్యం !

జీవితానికి తుది మజిలీ వృద్ధాప్యం! అచ్చు అయిన పుస్తకంలో ఆఖరి పేజీల్లాంటిది వృద్ధాప్యం. వయస్సు పొంగులకీ, కోరికలకీ, అనుభవాలకీ పదవీ విరమణ ప్రకటించి విశ్రాంతిగా కూర్చునే సమయం వృద్ధాప్యంలోనే వస్తుంది.

ప్రతి మనిషికి వృద్ధాప్యం అంటే భయం! జవసత్వాలుడిగి శారీరక బలహీనతతో కర్ర సాయమో, 'కుర్ర' సాయమో కోరే దశ ఈ వృద్ధాప్యంలోనే కల్గుతుంది. జలజల పారే సెలయేరు రాళ్ళు, రప్పలు, ఎగుడు దిగుళ్ళు దాటుకుని నిండుగా, గంభీరంగా పారే నదిలో కలిసినట్టు యువకత్వం నడివయస్సు దాటుకుని జీవితం వృద్ధాప్యం చేరుకుంటుంది.

డబ్బు వుండీ, మందీ మార్బలం, ఆత్మీయుల ప్రేమాభిమానాలు పొందగల్గినప్పుడు వృద్ధాప్యం అంత సుఖం మరొకటి వుండదు. కానీ, ధనం లేక, సేవ చేసేవాళ్ళు లేకపోతే కనీసం ఆప్యాయంగా పలకరించేవాళ్ళు లేకపోతే వృద్ధాప్యం అంత 'శాపం' మరొకటి లేదు.

మంచంలో పడుకున్న ముసలి తాతనో, బామ్మనో చూసి విసుక్కునే మనుమలు, కోడళ్ళు వృద్ధాప్యాన్ని మరింత గుమ్మరించి, ముసలాళ్ళని క్రుంగదీసే రకాలు. వాళ్ళకున్న నీర్సం కన్నా వీళ్ళ విసుగువల్ల ఆ వృద్ధులకి మరింత నిస్త్రాణ వస్తుంది. నిజానికి- వృద్ధాప్యం జబ్బు కాదు. అంటురోగం అసలే కాదు. మనిషికి కలిగే శారీరక అవస్థలలో అదొక దశ. బాల్యం, కౌమార్యం, యవ్వనం ఎంత సహజమో, వృద్ధాప్యం కూడా అంతే సహజమైన దశ.

కొంతమంది తాతగారి దగ్గర ఎన్నో కథలు, కబుర్లు, పాటలు, పద్యాలు నేర్చుకుని తాత ఒడిలో ఉయ్యాల లూగుతూ వుంటారు. అలాంటి ఇంట్లో 'వృద్ధాప్యం' ఒక వరం. వృద్ధ శరణాలయాలు చూస్తే మనసు ద్రవించిపోదూ? బోసి నవ్వులు, తప్పటడుగులు ఇంట్లో ప్రతిధ్వనిస్తున్నప్పుడు ముసలి దగ్గులు, కర్ర చప్పుళ్ళు వాటికి సమాన తాళమని మరిచి పోవాడదు. ముసలితనాన్ని విసుక్కున్నా ముసలివాళ్ళ అవసరం తప్పదు.

శుభకార్యాలలో, సభలు, సత్కారాలలో, రాజకీయాలలో, వ్యాపారాలలో, కోర్టు కేసుల్లో చాలామంది తలలు పండిన వృద్ధులే సాక్షాత్కరిస్తారు. వారి సలహాలు, సూచనలు తు.చ తప్పకుండా పాటిస్తారు జూనియర్స్.

పాత వస్తువులెంత విలువైనవో అనుభవజ్ఞులైన వృద్ధులూ అంతే విలువైనవారు! శరణాలయాలకి పంపే ఆలోచన. అయితే - వృద్ధులైన కొందరు ఎవరు కనిపిస్తే వారికి తన బాధ చెప్పుకొంటూ బజారులో షికారుకెళ్ళి చిన్నపిల్లల్లా ప్రవర్తిస్తుంటారు. చిరుతిళ్ళ మీద వ్యామోహ పడటం, ఇవన్నీ మిగతావారికి ఇబ్బంది కల్గించక మానవు. మనిషిలో బలం తగ్గిపోయినప్పుడు మానసిక బలహీనత కల్గి అది క్రమంగా మిగతా వారిపైన కోపంగా మారుతుంది. అందుకే చాలామంది వృద్ధులుకోపంగా తిడ్తూ వుంటారు.

ఒక్కటి నిజం. ప్రతి మనిషికి వృద్ధాప్యం తప్పదు... అకాలమరణం వస్తే తప్ప! అందుకే వృద్ధాప్యాన్ని ప్రేమించి, వృద్ధుల్ని గౌరవిస్తే మనిషి విలువ పెరుగుతుంది. మనీషి కాగల్గుతాడు !!





# వారసత్వం!

వచ్చేది ఒంటరిగా, పోయేది ఒంటరిగా, మధ్య నున్నది- అంతా నాటకం! ఈ పరమ సత్యం అందరికీ తెలుసు. అయినా -పుట్టింది మొదలు చివరిక్షణం వరకు పోరాటం తప్పదు ప్రతి మనిషికి !!

అన్నీ వదిలేసి వెళ్ళేవాడికి ఎందుకింత ఆరాటం, తాపత్రయం అని వేదాంతుల వాదం! జ్ఞానుల హితోపదేశం!

కానీ -మనిషిగా పుట్టిన ప్రతివాడూ జ్ఞాని కాలేడు. వేదాంతం వంట పట్టించుకోలేడు. అందుకే.. నిద్రలేచింది మొదలు ఒకటే ధ్యాస, పరుగులు జీవన భృతి కోసం! అంతటితో ఆగదు. తమకి తమ వంశపారంపార్యంగా రావలసిన ఆస్థికోసం తాము తమ పిల్లలకి దాచవలసిన ధనంకోసం తాపత్రయ పడతారు మనుష్యులు.

ఇలా జన్మించిన చోట తమకి రావలసిన భాగం -లేక ఆస్థి పొందే హక్కునే వారసత్వంగా పిలుస్తాం. ఈ 'వారసత్వం' ఒక్క ధనం కోసమే కాదు, ప్రతి విషయంలో -ఆచార వ్యవహారాలు, సభ్యత, సంస్కృతీ, అలవాట్లు, అభిరుచులు, నియమ నిష్టలు... ఇలా ప్రతిదీ ఆ కుటుంబంలో తాతల రక్తం నుంచి మనుమలు, ముని మనుమల వరకు సన్నటి నది పాయలా అంతర్లీనమవుతూ వస్తుంది. ఆధ్యాత్మికంగా కానీ, శాస్త్ర పరిజ్ఞానంలో గానీ ఈ విషయాన్ని అందరూ ఒప్పుకుంటారు!

అందుకే- వారసత్వం అంటే న్యాయశాస్త్రంలో చాలా విలువ! ఎవరైనా ఆస్థి హక్కుల కోసం పోరాడితే వారసత్వపు హక్కు ద్వారా సాధించుకోగలరు. ఆర్థిక లబ్దిని వదలి మిగతా చాలా విషయాల్లో

ఈ వారసత్వం చాలా ఆసక్తిని కల్గిస్తుంది. తాతగారికి ఒక అలవాటు వుంటే - అది మధ్యలో కొడుకును వదలి మనుమడికి రావచ్చును. మనస్తత్వంలో కూడా అంతే!!

తాతగారు జాలిగుణం కల్గి ధర్మపరుడై వుంటే మనవడు దానధర్మాలు చేస్తుంటాడు. ఒక్కోసారి తండ్రి దుర్మార్గుడూ, కఠినుడు అయితే - కొడుకూ అలాగే అడుగుజాడల్లో నడుస్తాడు! బామ్మ, పెద్దతండ్రి, పినతండ్రి, మేనత్త - ఇలా వంశంలో ఎవరి అలవాట్లైనా సరే -పిల్లలకి వస్తుంటాయి. ఒక్క తండ్రి వైపునే కాదు, తల్లివైపు వారి ద్వారా కూడా వస్తుంటాయి.

ఎన్ని గుణాలు, అలవాట్లు, తల్లీ తండ్రీ వైపు వంశం నుంచి సంక్రమిస్తాయో మనకి వైద్య శాస్త్రంలో విదితమే. దీనిని బట్టి జన్మకి కొంత కారణం వుంటుందనీ, అందువల్లనే ప్రతివాడూ తాను కోరుకున్నట్టు చేయలేడనీ, వెల్లడి అవుతుంది. ఎక్కడో, ఎప్పుడో, ముత్తాతలు ఊరి పెద్దలుగా అధికారిగా వుండి వుంటే, మూడోతరంలో వాడికి ఆ అధికారం గుణం సంక్రమించి రాజకీయాల్లోకి దిగవచ్చును. 'పండిత పుత్ర పరమశుంఠ' అన్న నానుడి వుండొచ్చును. కానీ - పండిత పుత్రుడు, పత్రికలు, అందరూ శుంఠలు కాలేదు. తండ్రిని మించిన జీనియస్ (మేధావులు) వున్నారు. ఇటు ఏడుతరాలు, అటు ఏడుతరాల్లో ఎవరికైనా, ఏ జబ్బులైనా వుంటే - ఈ తరంలో వాళ్ళకి సంక్రమించే అవకాశం వుందని డాక్టర్స్ కూడా చెప్తుంటారు.

కాబట్టి 'వారసత్వం' ప్రతిమనిషి జన్మకి 'నెగిటివ్' లాంటిది! మంచి అలవాట్లు, అభిరుచులు, విద్యాబుద్ధులు, సంస్కృతీ, ఇవన్నీ వంశపరంగా వస్తాయనేది ప్రతివారు నమ్మాల్సిందే!

కొంతమంది పనికిమాలినవి నేర్చుకుని ఇతరులని బాధించటానికే వాటిని ఉపయోగిస్తారు. ఇలాంటి ఆచారాలు, వ్యవహారికాలు - ఇది నిజానికి మన పెద్దలు ఏర్పాటు చేసుకున్నవే గానీ, రక్తంలో జీర్ణించిన గుణం కాదు. అవి నిర్మూలించి ముందుతరాల వారిని ఆదర్శప్రాయుల్ని చేయాలి! ఒకవేళ మంచివి వుంటే, వాటిని అభివృద్ధి చేయాలి.

'వారసత్వం' అనగానే చాలామంది ఆస్తుల కోసం కొట్లాడుకుని, కోర్టుల కెక్కుతారు. అదికాదు. మన వారసత్వపు, సౌగంధాన్ని పీల్చుకుని, సమాజంలో వెదజల్లడానికి ప్రయత్నించాలి!!





# సర్వజ్ఞులంటే ?

అన్నీ తెలిసిన వారని మనం వెంటనే సమాధానం చెప్తాం. కానీ - ఈ అన్నీ అనగా ఎన్ని?- అనే ప్రశ్న ముఖ్యమైనది.

ఈ చరాచర సృష్టిలో ఎన్నో విషయాలు, ధర్మాలు, నీతులు, సూత్రాలు, తాత్పర్యాలు, కళలు చాలా వున్నాయి. అన్నిటిని గురించి తెలుసుకోవటం చాలా కష్టం. జన్మ సరిపోదు. మానవ ఆయుఃపరిమాణం చాలదు.

అటువంటప్పుడు 'సర్వజ్ఞులు' అనే పదం నిజానికి మానవుడికి వర్తించదు. ఆ పదం ఒక అనిర్వచనీయమైన శక్తి సంపన్నుడగు భగవంతునికే సరిపోతుంది.

కొందరు ఏదైనా విద్యలో ప్రతిభ సంపాదిస్తే 'ఇక నా అంతటివారు లే'రనుకొని 'నేను సర్వజ్ఞ'డననీ అహంకార దర్పంతో విర్రవీగుతూ వుంటారు. చాలా పొరపాటు. అసలు సర్వజ్ఞత అంటే - అంతటా, అన్నీ తెలిసి వుండటమని భావం.

మానవుడైనవాడికి కొంత పరిమితి మాత్రమే వుంది. తన చుట్టూ తనకి లభ్యమైనదీ, చెయ్యదగ్గదీ మాత్రమే చేయగలడు. కానీ - మేధకి మించినది చేయలేడు. ఒక ప్రదేశంలో వుండి మరొక ప్రదేశంలోని సంగతులు చూడలేడు. ఒక సమయంలో ఒక విషయాన్నే గ్రహించ గలడు. కానీ, అనేకం తెలుసుకోలేడు. అవధానాలు చేసేవారు కూడా కొంత పరిమితిలో, తన పరిమితిలో తాను తెలుసుకున్న విద్యని, ప్రజ్ఞని చెప్పగలరు. కానీ పృచ్ఛకుడు పరిమితి దాటి ప్రశ్నిస్తే అవధానాలు చేయలేరు.

ఒక్కొక్కరు రెండు మూడు విద్యల్లో ఆరితేరి వుండవచ్చును. వారికున్న అభిలాషని బట్టి, అవకాశాన్ని బట్టి వారు నేర్చుకుంటారు. కాని - వారిని 'బహుముఖ ప్రజ్ఞావంతులు' అనవచ్చును తప్ప 'సర్వజ్ఞులు' అనడం సమంజసం కాదు.

వేదాంత రహస్యం తెలిసుండవచ్చును. ధర్మశాస్త్రం గ్రహించి వుండవచ్చును. జీవితంలో అనేక అనుభవాలు పొంది వుండవచ్చును. కానీ- ఎక్కడో, ఏదో తెలియని విషయం వుండే వుంటుంది. అదే సృష్టి రహస్యం. బ్రహ్మచారికి దాంపత్యాన్ని గురించి అనుభవం వుండదు. అలాగే - సంసారికి బ్రహ్మచర్యంలోని గొప్పతనం తెలియదు. ఇవి రెండూ వేరు వేరు మార్గాలు. ఇలాగే అనేక విషయాల్లో ఒకదానికొకటి విలోమంగా వుంటాయి. (వున్నాయి) అటువంటప్పుడు ఆ రెండూ తెలిసి వుండటం అసాధ్యం.

రామావతారంలో ఏకపత్నీ వ్రతుడైన రాముడు కృష్ణావతారంలో గోపీ మనోహరుడై రాసలీలను సల్పేడు. రెండూ వేరు వేరు మార్గాలు. ఒకే అవతారంలో సాధ్యం కానివి. కనుక భగవంతుడు సైతం రెండు ధర్మాలని రెండు రూపాల్లో తెలియపరిచేడు. ఇక మానవుడికి ఒకేజన్మలో సర్వం ఎలా సాధ్యం?

శంకరాచార్యులంతటివారు బ్రాహ్మణపత్ని వేసిన ఒక ప్రశ్నకి గడువుకోరి, పరకాయ ప్రవేశం ద్వారా రహస్యాన్ని తెలుసుకొని తిరిగి వచ్చి బదులు చెప్పేరు. కనుక మానవుడు తనకన్నీ తెలుసుననుకుని అహంకారం పెంచుకోవటం చాలా అజ్ఞానం.

ఏమీ తెలియనివాడు తనకన్నీ తెలుసుననుకుంటాడు. కొన్ని తెలుసుకున్నాక కొంత వినయం నేర్చుకుంటాడు. అన్నీ తెలుసుకున్నాక (అది సాధ్యం కాకపోయినా) 'ఇంకా ఎన్ని తెలుసుకోవాలో? నాకేపాటి తెలుసు'నని విధేయత నేర్చుకుంటాడు. 'నిండు కుండా - అన్నీ వేసిన విస్తరి' అనే సామెతల్లోని అర్థం అదే.

అసలు సర్వజ్ఞుడైనవాడు ప్రాపంచిక చింతలలో వుండడు. పరమాత్మ స్వరూపమే సర్వజ్ఞతకి మూలం అని తెలుసుకుని ఆ పరంజ్యోతిని కలుసుకునే తాదాత్మ్యంలో వుంటాడు.

సామాన్య మానవుడు తనంతటివాడు లేడనుకోవడం మాని, తనెంతటివాడు కావాలో అని యోచించి సాధన చేయాలి.






# అయోధ్య అంటే ?

యో ధులకైనా జయించే వీలులేనిది అయోధ్య!

నిజమే...! అయోధ్యానగరం దుర్భేద్యమైనదై దశరధ మహారాజు చేత పాలింపబడింది. అతడు సూర్యవంశపు రాజు. ఈ భూగోళం సూర్యునిచుట్టూ పన్నెండుసార్లు తిరుగుతుంది కదా? అదే సంవత్సరమవుతుంది. అలాగే -చంద్రుడు సూర్యునిచుట్టూ తిరుగుతున్నప్పుడు అతని తేజస్సు పదహారు కళలుగా విలసిల్లి పూర్ణిమ, అమావాస్యలుగా మారుతాయి.

అదే నిర్మాణ క్రమంలో మన శరీరమనే నగరం నిర్మితమైంది. మన శరీరంలోని ఒక్కొక్క భాగం ఒక్కొక్క రాజ్యం వంటిది. హృదయకోశం అన్నిటికీ మూలమై ముఖ్యపట్టణంగా వుటుంది. అది మనకి - అంటే... ప్రాణానికి ముప్పు కలిగించే దుష్టశక్తులకు లోబడకుండా ఎముకలతో తయారైన కవచంలో- అంటే... అస్థిపంజరంలో గుండె అనే గూడులో దాచబడి యోధులకు అనగా దుష్ట, రాక్షస శక్తులకి లొంగకుండా జాగ్రత్త నొంది వుంటుంది. అందుకే 'అయోధ్య' అంటే హృదయకోశం అని గూఢార్థం. ఆ హృదయంలోని చైతన్యం అనగా జీవుడు రాజు. ఆ రాజు సూర్యకిరణాల ద్వారా భువికి చేరిన అంశ. జీవులన్నీ సూర్యకిరణాల ద్వారా, చంద్రకిరణాల ద్వారా ఈ భూమండలం మీద జన్మిస్తాయి. కనుక తేజోవంతులైన వారు దేవతాంశతో సూర్యకిరణాల ద్వారా భూమి మీద జన్మించినప్పుడు సూర్యవంశపు వారవుతారు.

దశరధుడు సూర్యవంశపు రాజు. అతని కుమారుడైన రాముడు దేవుడే. అంటే... జీవునిలోని చైతన్యం అన్నమాట.

ఇక్కడ అయోధ్యా నగరం చుట్టూ పన్నెండు విభాగాలు చేయబడిందని చరిత్ర చెప్తోంది. అవే పన్నెండు నెలలు. అలాగే మాసానికి రెండు పక్షాలు అంటే పూర్ణిమ, అమావాస్య. ఆ లెక్కలో సంవత్సరానికి ఇరువది నాలు పక్షాలు వుంటాయి కదా?

ఆ ప్రకారంగానే వాల్మీకి, రామాయణంలో ఇరువది నాల్గువేల శ్లోకాలని పొందు పరిచేడుట.

అయోధ్య నరగరానికి సప్తప్రాకారాలు వుండి ఏడవది ప్రహారీ గోడగా వుంటుంది. మన శరీరంలో కూడా పై నుంచి ఏడు పొరలు వుంటాయి. పై పొరనే మనం చర్మమని పిలుస్తాం.

దశరథ మహారాజు తన రాజ్యంలో చేసిన సభలు, సమాలోచనలన్నీ మన శరీరంలోని అంగాలు, గుణాలకి వర్తిస్తాయి. సుమంతుడైన మంత్రే మనలోని మంచిబుద్ధి.

ఈ విధంగా అయోధ్యా నగరాన్ని, దాన్ని పరిపాలించిన రాజునీ, అతని కుమారుడైన రాముణ్ణే మన శరీర నిర్మాణంలో ఆనాటి ఋషులే పోల్చినట్టు శాస్త్రాలు చెప్తున్నాయి.

కనుక - హృదయకోశంలాంటి అయోధ్యని, దానియందు చైతన్య రూపుడైన రాముణ్ణే మనం అతి పదిలంగా రక్షించుకోవలసిన అగత్యం ఎంతైనా వుంది. లోపల దుష్టశక్తుల నుంచే కాక, బయటి రాక్షస శక్తుల నుంచి కూడా ఈనాడు అయోధ్యని రక్షించుకుని అమృతమయుడైన ఆ రాముణ్ణే మందిరంలో సుస్థిరం చేసుకునేందుకు ప్రతి ఆధ్యాత్మిక సత్యం ఎరిగిన మానవుడూ వేగిర పడాలి!!

# 11

## కాశీ అంటే ?

పూర్వపు రోజుల్లో 'కాశీకి వెళ్లినవాడు కాటికి వెళ్ళినవాడు సమమే' అనే వారుట. అంటే... ప్రయాణ సౌకర్యాలు సరిగా లేక చాలా అవస్థలు పడుతూ వెళ్ళాల్సివుండేది. వాళ్ళు కాశీకి చేరేసరికి ప్రాణం కడగట్టుకుని పోయేది. అందుకనే ఆ వాక్యం వాడుకలోకి వచ్చింది.

ఇప్పుడు తల్చుకుంటే రోజుల్లో వెళ్ళిరాగల సదుపాయాలున్నాయి. అయితే... తల్చుకునేవాళ్ళూ, వెళ్ళివచ్చేవాళ్ళే తక్కువ అవుతున్నారు.

సృష్టి స్థితి లయ కారకులైన బ్రహ్మవిష్ణు మహేశ్వరులు త్రిమూర్తులుగా వుండి ఈ జగత్తు నడిపిస్తున్నారని అందరికీ తెలుసు.

పుట్టించేది బ్రహ్మ అనీ, నడిపించేది విష్ణువనీ, చివరికి లయం చేసేది శివుడనీ మనం నమ్ముతాం. అయితే... లయమవడమంటే మరణించటం కాదు.

మనలోని అరిషడ్వర్గాలు, కోరికలు నశించటమే లయ మవటం! శివుడు ఎప్పుడూ తపోముద్రలో వుండి భక్తులకొరకు మాత్రమే తపస్సునుంచి లేస్తాడు. శివతత్వం అంటే ఏమీ కోరక పోవటమే.

మనదేశంలో కాశీ - అన్నపూర్ణ, విశ్వేశ్వరులకి నిలయమైన పట్టణంగా వెలిసింది. ఎంతో మంది భగవత్ చింతనా పరులు కాశీ దర్శించి వస్తుంటారు అక్కడున్న త్రివేణీ సంగమంలో స్నానం చేసి, ముక్తి ఫలం పొందుతారు. కాశీ వెళ్ళిన వాళ్ళు తప్పకుండా ఏదో ఒక పండో, కాయో తమ కిష్టమైనవి వదలిరావాలని నియమం వుంది.

అంటే... జీవితాంతం అనుభవించిన అనుభూతుల్ని అక్కడ వదలమని తాత్పర్యం. అంతేగానీ, వదలమన్నారుగదా... అని తమకి ఇష్టం లేనిది వదిలేసి చక్కారావటంకాదు.

కాశీ వెళ్ళి వచ్చినా బుద్ధుల్లో మార్పులు రానివారు ఎంతోమంది వుంటారు. అలాంటివారు కాశీకి వెళ్ళినా, వైకుంఠానికి వెళ్ళినా ఫలం దక్కదు.

కాశీ అంటే 'శివత్వం' అని అర్థం.

అనగా... శివుడు ఏవిధంగా నిర్వికారుడు, నిరంజనుడు, నిరాకారుడు అయి కేవలం జ్యోతిరూపంగా తేజస్సు మాత్రం వెదజల్లుతూ వుంటాడో ఆవిధంగా మానవుడు తనలోని అహంకారం నశింపజేసుకుని, సత్యగుణ సంపన్నుడు, సకల శ్రేయోభిలాషుడు కావటమే శివత్వాన్ని చేరటం. అంటే... మనస్సు 'కాశీ' అవటం. అటువంటి మనిషి తాను ఉన్నచోటనే కాశీని సృష్టించగలడు. ఊర్ధ్వముఖమైన ఆతని ఆశయాలు... హిమాలయ పర్వతాలు! ఆనందమయమైన ఆతని హృదయం... ఎల్లవేళలా నర్తించే శివతాండవం! ఆతని ఆనందభాష్పాలే గంగాజలం! మనిషి ఈ స్థితి చేరుకుంటే అదే కాశీ.

ఉదయం మనం జీవితగమనానికి ఆయత్తమవుతాం.

అదే బ్రహ్మాన్ని ఆరాధించటం. మధ్యాహ్నం వరకు సంసార వ్యాపకాల్లో వుంటాం. అది విష్ణుని సేవించటం. తీరిక సమయంలో ఏ ఆలోచనలు పెట్టుకోకుండా విశ్రాంతి తీసుకుంటాం. ఇది శివారాధన. ఇలా ఏ మనిషి తనకి తాను ఆత్మానుభూతి పొందుతూ మనుగడ సాగిస్తాడో వాడు ముక్తుడు.

బ్రహ్మాస్వరూపముదయే మధ్యాహ్నేతు మహేశ్వర: సంధ్యాయేత్ సదావిష్ణు: అని సూర్య ,గవానుడికి నమస్కరించి అర్ఘ్యం ఇస్తారు.

ఇక్కడ మధ్యాహ్నం అనే అర్థం... పగటి కార్యక్రమాలు ముగిసిన విశ్రాంతివేళ అనే !! సంధ్యా ఏత్ సదా విష్ణు అంటే పగలు ముగిసిందని కాకుండా తిరిగి మర్నాటికి ఆయత్తమయే సూర్యుని క్రమానుసరణ గుర్తుకు తెచ్చుకోవటం! దానివల్ల విష్ణువులా మళ్ళీ మర్నాడు కార్యక్రమాలు జరిగించబోతారని స్తుతించటం.

అందుచేత శివుడి తత్వాన్ని చేరుకుని నిశ్చింతగా సదా ఆనందంగా వుండి కామోద్రేకాలు, కోరికలు, విద్వేషాలు, ఉద్రేకాలు అణగారిపోయిన దశకి మనిషి ఎదిగితే అదే కాశీ !!

అతనే శివుడు !!






# యజ్ఞమంటే ?

ఫలానా చోట యజ్ఞం చేస్తున్నారనీ, విశ్వశాంతి కోసం చేస్తున్నారనీ, యాగం చేస్తున్నారనీ, 'ఇష్టి' చేస్తున్నారనీ, పౌండరీకం చేస్తున్నారనీ చెప్పటం వింటూ వుంటాం, చూస్తాం.

హోమగుండం చుట్టూ బ్రాహ్మణులు కూర్చుని వేదమంత్రాలు చదువుతూ ఆజ్యం (నెయ్యి) ఆ గుండంలో పోస్తూ, చాలా నిష్టగా, నియమంగా చేస్తూంటారు.

అంటే ఏమిటీ?

ఈతి బాధలు- అనగా... ప్రకృతి నుండి మనకు జరిగే నష్టాలు రూపుమాపుకుందుకు యజ్ఞ గుండంలో నెయ్యి, నవధాన్యాలు, సమిధలు, చివరగా నవరత్నాలు, వెండి, బంగారం కూడా వేసి శాస్త్రార్థంతో, అగ్నికీ, పంచభూతాలకీ, దిక్పాలకులకీ, సర్వ అధిష్టాన దేవతలకు ఆనందం కల్గించి, వారు మనకందించే వర్ష, అన్నపానీయాది వరాలు పొందడం - యజ్ఞంలోని భావం!

అయితే- యజ్ఞంలో రెండు వున్నాయి. అంతర్యజ్ఞం, బాహ్య యజ్ఞం !

బాహ్యయజ్ఞం - క్రియారూపంలో ద్విజులు కలసి చేసేది ! అంతర్యజ్ఞం - ప్రతి మానవుడు తనకి తానుగా మదిలో చేసుకునేది!

ధ్యానం రూపంలో ఆ దైవం మనలో వుంటాడు. అతన్ని ఆరాధిస్తూ - బలిపీఠం లాంటి మన మనస్సుపైన మనలో వున్న అనేక కుసంస్కారపు బుద్ధులు - అంటే... జంతువుల లాంటివి బలి ఇవ్వటం

జరుగుతుంది (జరగాలి). జన్మజన్మల సంస్కారం వలన మానవుడిలో అనేక దుష్టగుణాలు దాగి వుంటాయి! అవన్నీ 'ధ్యానం' అనే భగవత్ ఆరాధనలో - అంటే... హోమగుండంలో ఆహుతి కావాలి. అప్పుడు మానవుడు ఆనంద రూపుడవుతాడు.

ఇది, కాళిదాసు విరచితమైన 'కర్పూరాది స్తవం' అనే స్తోత్రంలో వుంది.

ఇక బహిర్యాగంలో జంతువులన్నీ బలి ఇస్తారు. ఇలాంటివి క్షత్రియులు, ప్రజా పరిపాలకులు మాత్రమే చేయాలి. ఎందుకంటే - సకల ప్రజల క్షేమం కోరి చేస్తారు గనుక. ఒక ప్రాణి క్షేమం కోరి, మరొక ప్రాణిని బలి ఇవ్వటం జరుగుతుంది. దానివలన బలికాబడిన జంతువుకి కూడా స్వర్గ ప్రాప్తం కల్గుతుందని శాస్త్రం చెప్తుంది.

అయితే - మనిషి తన స్వార్థం కోసం, ఏదో ఒక పని జరగడం కోసం బలి ఇవ్వడం క్షమార్హం కాదు.

అంతర్యజ్ఞం వలన మనలోపల వున్న ప్రకృతి -అనగా... గుణాలు మన చెప్పుచేతల్లో వుండి, మనకి మోక్షసిద్ధిని కల్గిస్తాయి!

ఈ యజ్ఞాలు పూర్వకాలంలో జాతి, మత వివక్షత లేకుండా సర్వ మానవ శ్రేయస్సు కోరే చేసేవారు. కనుకనే యజ్ఞం సఫలమయ్యేది!

బహిర్యజ్ఞమైనా, అంతర్యజ్ఞమైనా అర్థం తెలుసుకోవటమే మానవధర్మం! దుష్ట జంతువుల వంటి గుణాలు, ధ్యానం అనే హోమంలో ఆహుతి చేసి ఆనందమయమైన సిద్ధి పొందటమే యజ్ఞం.

మానసికంగా గానీ, భౌతికంగా గానీ చాలా దీక్షతో యోగసాధన చేయాలి. చాలా కష్టమైన కార్యక్రమం కనుకనే 'అబ్బో! యజ్ఞం చేసినంత పనీ!' అని మనం ఏదైనా కష్టతరమైన పని చేయాల్సి వచ్చినపుడు ఆ పదం వాడుతాం.

శారీరక బలం కోసం చేసే వ్యాయామాలు యోగం కావు. అది బాహ్య పోషణకి, మనస్సు ఆనందానికి పనికి రావచ్చును. కానీ- ఆసనాల ద్వారా పరాకాష్టకి చేరి భగవంతుణ్ణి దర్శించటం ఎవరికో గానీ సాధ్యం కాదు. ముఖ్యమైన కామ,క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యాలు బలిచేయనిదే యోగం సిద్ధించదు. మనిషి భగవంతుని తెలుసుకోవటమే యజ్ఞం !!





# పురోగామి !

అలవాటుగా చేసే పనులు అనేకం! ఒకే పద్ధతిలో, ఒకే బాటలో, ప్రతిరోజు మనం చేసే కార్యక్రమాలు - యంత్రాల్లాగా, చక్రాల్లాగా తిరుగుతూనే వుంటాయి. దీన్ని (రొటీన్) రోజువారి కార్యక్రమాలు అంటాం! ఇందులో మార్పు వుండదు, చేర్పు వుండదు. అభివృద్ధి వుండదు. మూస పోసినట్లు, అచ్చులో పోసినట్లు ఒకేలా వుంటాయి!

వైవిధ్యం కనబడి - నిన్నటికన్నా నేడు మార్పు వచ్చి - రేపటిరోజు మరింత మెరుగు లేదా క్రొత్తదనం కనిపిస్తే - ఆ క్రొత్తదనం మేలు చేసేదైతే... అదే 'పురోగమనం' అవుతుంది!

ఆ పురోగమనం వైపు సాగిన మనిషి 'పురోగామి' అవుతాడు.

ప్రతిమనిషి ఏదో ఒక బాటలో ముందుకు సాగుతూ వున్నా - ఆ అడుగుల్లో అభివృద్ధి కనిపించనంత వరకు చైతన్య రహితంగానే వుంటుంది. ఈ 'బాట' - అంటే... రోడ్డు అని కాదు - జీవిత గమనపు బాట అని తెలుసుకోవాలి. సామాన్య పౌరుడి నుండి సామ్రాజ్యాధికారి వరకు ఏదో ఒక నిర్వహణా కార్యక్రమం చేస్తూనే వుంటాడు. కానీ - రోజూ వచ్చే నక్షత్రాల కన్న, దినదిన ప్రవర్ధమానమైన పూర్ణిమనాటి చంద్రుడు ఎంత వెలుగునిస్తాడు?!

మానవుడు అలా ఒక్కో మెట్టు అభివృద్ధివైపు సాగితే ఆ పురోగమనం లోక కళ్యాణానికి తోడ్పడుతుంది.

సంసారి గానీ, వ్యాపారి గానీ, రచయిత గానీ, రాజకీయ నాయకుడు గానీ, వైవిధ్యం లేని పద్ధతిలో నడిస్తే స్వజనం గానీ, సమాజం గానీ ఉత్సుకత చూపించరు.

గ్రామఫోను వచ్చిన కొత్తలో అందులో పాటవిని మైమరిచిన ప్రజలు వుండవచ్చును. అదే గ్రామఫోను రికార్డు కొన్ని వందల సార్లు వింటే?? వినలేరు! ముఖం మొత్తుతుంది. అదే టేప్ రికార్డర్‌లో క్యాసెట్లుగా రకరకాల మార్పులతో వస్తే - ఆ అభివృద్ధి జనాకర్షణీయంగానూ, లాభకారిగానూ రూపొందుతుంది!

వస్తు వాహనాదులైనా అంతే! ఒకనాటి పెంకుటిళ్ళూ, మట్టి ఇళ్ళూ, ఈనాడు మార్పు చెంది ఎంతో సదుపాయంగా, సుఖప్రదంగా మారాయి కదా? అలాగే - యంత్రాలు ఎంతో వీలుగా తయారు చేస్తున్నారు.

ఇక - కళారంగాల్లో కూడా ఒకనాటి నాటకరంగం ఈనాడు నూతన సదుపాయాలతో ప్రజారక్తిని చూరగొంటోంది. నాట్యమూ, సంగీతమూ కూడా కొత్త రాగాలతో, వాద్య సహకారంతో, ప్రజల మన్నన పొందటమే కాక, సంగీత సాహిత్యాల ద్వారా ప్రచారాలని కూడా చేయగల్గుతున్నారు.

సాహిత్యం విషయానికి వస్తే అనేక వైవిధ్యం గల ఇతివృత్తాలతో, కొత్త కొత్త ప్రక్రియలతో - పాఠక సమూహం మధ్యకి చొచ్చుకు పోతోంది. పూర్వపు కావ్యాలనీ, పురాణేతిహాసాలనీ, నూతన సంవిధానంతో, రూపకాలుగా, సంగీత నాటికలుగా మలచి, మలుపు త్రిప్పుతున్నారు. ఈ విధంగా ప్రతి రంగంలో ఓ అడుగు ముందుకు వేసి - పురోగమనం సాగిస్తూ, రాతియుగపు మానవుడు రాకెట్టు ;రకు దూసుకుపోతున్నాడు గదా?

ఈ పురోగామి - భౌతికంగా సాధించిన విజయాలు, నైతికంగా సాగిస్తే ఎంత బాగుంటుందీ? మెట్టు ఎప్పుడూ పైకి ఎక్కితేనే సువిశాల జగత్తు గ్రాహ్యం అవుతుంది. కానీ - మెట్టుపై నుంచి కదలకుండా వుంటే నాల్గు దిక్కులు పిలా చూడగలడూ? అజ్ఞానం నుంచి అక్షర జ్ఞానం పొందిన మనిషి - మానవత్వం పెంచుకుని 'పురోగామి' కావాలి! 'మతం' అనే ఊబిలోకి జారి తిరోగామి కాకూడదు. 'సర్వేజనా స్సుఖినోభవంతు' అనే జ్ఞానమే మానవ నైతిక పురోగమనం!!






# ముక్తంటే ?

'మో క్షము కలదా... భువిలో జీవన్ముక్తులు గాని వారలకు?' అని ఆధ్యాత్మ తత్త్వాన్ని అరమోడ్పు కన్నులతో ఆలపించేడు త్యాగరాజస్వామి.

ఆ కీర్తన అందరినోట వేలు, లక్షలు, కోట్ల సార్లు గానం చేయబడుతోంది. ఎందరు జీవన్ముక్తులు కాగలరు?

ఈ సర్వ చరాచర సృష్టిలో ప్రతిజీవి జీవితం కోసం తెగ తాపత్రయపడుతుంది. అందర్నీ మించి మానవుడు ఇంకా ఎక్కువ ఆరాటపడుతున్నాడు. తనకోసమే కాక, తనవారి కోసం కూడా ఎంతో శ్రమిస్తున్నాడు. జన్మించినది మొదలు మరణించేవరకు జీవనపోరాటం తప్పకపోయినా, ఆ పోరాటం మనస్సుని లోబరుచుకోనంత వరకు మనిషి స్వతంత్రుడే. ఎప్పుడైతే మానసికంగా దిగులుపడుతూ, చింతిస్తూ అదే యావలో తీరని కాంక్షకి లోనవుతాడో అప్పుడు బంధితుడవు తున్నాడు.

లేనిదానికోసం బాధపడటం మానవుడి ప్రవృత్తి. అదే మనిషికి శాపం. ఉన్నదానితో సంతృప్తి పడేవాడికి ఏ బాధా వుండదు. కానీ, నూటికి పదిమంది కూడా తృప్తిగా వుండలేరు. అందుకే మానవుడు ప్రశాంతంగా, ఆనందమయంగా వుండలేకపోతున్నాడు. సంతోషం, ఆనందం ఎక్కడో దొరుకు తాయని, వాటికోసం అర్రులు చాస్తూ పరుగెత్తుతాడు కానీ- తన మనస్సుని పగ్గాలు వేసి పట్టుకుని ఉన్నచోటనే సంతృప్తి చూడలేక పోతున్నాడు.

కడుపునిండా భోజనం చేసిన వాడికి ఇంకాస్త ఫలహారం తినాలంటే వెగటుగా వుంటుంది. అలాగే -మనస్సు స్వాధీనమైన జ్ఞానికి ప్రాపంచిక వ్యావృత్తులు విసుగనిపిస్తాయి. అందుచేతనే అతను అడుగుతున్న వాటిని కేవలం నిమిత్తమాత్రుడుగా అనుభవించటమే తప్ప, తనకై తాను ఏ కోరికలూ పెంచుకోడు. దీనివల్ల వేదిక మీద నటిస్తున్న నటుడిలా మాత్రమే మిగిలిపోతాడు. రచయిత రాసిన కథానుగుణంగా నటించటంలో నటుడికి ఏ దోషం లేనట్టే జ్ఞానదృష్టితో ఆలోచించేవాడికి ప్రాపంచిక దోషాలు తగలవు. వాడే ముక్తుడు !

విద్యార్థి దశలో వున్నంతవరకు పరీక్షలు వ్రాయటం, మళ్ళీ చదవటం, మళ్ళీ వ్రాయటం జరుగుతూనే వుంటుంది. కానీ -చదువు ఆగిపోయేక పరీక్ష వ్రా యవలసిన అవసరం, పాఠాలు కంఠస్థం చేయవలసిన పని వుండదు.

మానవ జీవితం కూడా అంతే! కోరికలు, తాపత్రయాలు ఆగిపోతే ఇంక వేరే గమ్యం చేరాల్సిన అవసరం లేదు. ఉన్నచోటనే -అంటే... మనస్సు ఆగిపోయిన చోట ముక్తికి స్థానం. మనస్సు పరిగెడ్తున్నంత సేపూ గమ్యం చేరినట్టే. మనస్సు నిర్మలంగా, నిలకడగా, నిశ్చలంగా వుంటే అదే (టర్మనెస్) ముక్తి !!

కురుక్షేత్ర యుద్ధంలో దుర్యోధనుడు కోరుకున్న పన్నెండు అక్షౌహిణిల సైన్యం మనస్సులో పరిగెత్తే కోరికల లాంటివి. అర్జునుడు కోరిన కృష్ణుడు ఒకేచోట నిలచే ముక్తిలాంటిది. పాండువులు గెలిచిన విజయమే జ్ఞాని పొందే ముక్తి. కౌరవుల ఓటమే సామాన్యుడి జీవన పోరాటం. జన్మ పరంపరలు.

మనిషికుండే కోరికలు నిస్వార్థమై ప్రజాహితమైనప్పుడు ఆ మనిషి ఆదర్శవంతుడవుతాడు. ద్దం మీద ఆవగింజలా అతని ఆరాటం అతన్ని అంటదు. సగటు మనిషి తనకోసమే పెంచుకున్న ోరికలు- జిగురు మీద అతుక్కున్న చెయ్యిలా ఊడిరాదు. మొదటి దశ ముక్తికి చేరుకుంటే, రెండో దశ అజ్ఞానంలోనే కూరుకుపోయే స్థితి.






# సర్వధా సుకరం మిత్రం దుష్కరం తత్పరిపాలనం

మిత్రుని సంపాదించుట తేలిక, ఆ మైత్రిని కాపాడుకొనుట కష్టము అని తాత్పర్యం.

'అసలు మిత్రుడంటే ఎలాంటివాడు?' అని ప్రశ్నించుకుంటే ఆ మైత్రిని కాపాడుకోవట మెలాగో తెలుసుకోగలం.

మానవ జన్మ ఎత్తేక ఒక్కడైనా మిత్రుడు లేకపోతే ఆ జన్మ వృధా! ఎందుకంటే... బంధువులు, పరిచయస్తులు చాలామంది ఉంటారు. పుట్టిన వంశాన్ని బట్టి బంధువులు ఎలాగూ వుంటారు. ఇక అవసరాలని బట్టి పరిచయస్తులు దొరుకుతారు. కానీ, మిత్రుడు దొరకడం కష్టం. మనస్సు ఎరిగి, అభిరుచులు కలిసి ఆత్మీయతని పంచి ఇవ్వగలవాడే మిత్రుడు. కష్టంలో, సుఖంలో కూడా పాలు పంచుకోగలవాడే మిత్రుడు. ధనం వున్నప్పుడు దగ్గరికి చేరి, దరిద్రం చుట్టుకున్నప్పుడు దూరం జరిగేవాడు మిత్రుడు కాడు. మనసుతో దగ్గరై, మాటతో ఆత్మీయతని పెంచి, పనుల ద్వారా కలిసిపోగలవాడే మిత్రుడు.

కష్టకాలంలో ధైర్యం చెప్పి, ఆ కష్టాన్ని తాను కూడా పంచుకోగల్గినట్టి మిత్రుడు దైవ సమానుడు. దైవమే మిత్రుడి రూపంలో మానవుడికి చేయూతనిస్తుంది. అందుచేత- అటువంటి మిత్రుడు దొరికినవాడు అదృష్టవంతుడు. అవసరాలను బట్టి, వృత్తిని బట్టి మనకి అనేక మందితో పరిచయం కల్గుతుంది. అంతేకాదు- కొందరు మిత్రులవుతారు. కానీ... ఆ మిత్రత్వం సరైనది కాదు. పనివాళ్ళు, పాలివాళ్ళు, చాకలాడు, కూరలవాళ్ళు , దుకాణాలవాళ్ళు, ఇరుగు పొరుగు ఆఫీసులో వాళ్ళు... ఇలాగ

మనకి ప్రతిరోజు తారసపడే మనుషులంతా మిత్రులవరు. ఇక- రాజకీయ నాయకులకు గానీ, సంస్థలు నడిపేవాళ్ళకి గానీ, సంఘసేవకులకు గానీ, వ్యాపారస్తులకుగానీ, కళాకారులకు గానీ... ఎంతోమందితో ఎన్నో లావాదేవీలు వుంటాయి. వాళ్ళు ఎంతో దగ్గరవచ్చుగానీ, మిత్రులుగా మాత్రం మిగలరు.

'నాకు చాలామంది మిత్రులున్నా'రని చెప్పుకుంటూ వుంటారు. ఇలాంటి మిత్రులంతా అన్నివేళలా సహకరించరు. ఇక - మంచి మిత్రుడ్ని సంపాదించుకోగల్గినపుడు ఆ మైత్రిని కాపాడుకోవటం చాలా ముఖ్యం. మనకేదో పేరు ప్రఖ్యాతులు వచ్చాయని, సిరిసంపద కలిసి వచ్చిందనీ, పదవులు వచ్చాయనీ ప్రాణమిత్రుడైన వాడ్ని చులకన చేయుట, దూరం చేసుకోవటం, ముఖం చాటు చేసుకోవటం... క్షమించలేని నేరం.

ఈరోజుల్లో చాలామంది అవకాశాల కోసం స్నేహాలు చేస్తూవుంటారు. తమ అవసరం తీరగానే ఇక స్నేహితుణ్ణి మరచిపోతారు. ఇక- కొంతమంది అతితక్కువ కాలంలో అతిగాఢంగా దగ్గరికి చేరినట్టే ఇట్టే దూరమవుతారు. ఇవన్నీ నిజమైనవి కావు.

దట్టంగా మబ్బులు పడతాయి కానీ- గాలి బాగా వీస్తే బెదరిపోవటమో, నీటిధారలుగా మారటమో (వర్షం పడటమో) జరుగుతుంది. మబ్బులు మాయమైపోతాయి. కొన్ని స్నేహాలు ఇలాంటివే! ఎవరైనా వేరేవాళ్ళు వచ్చిచేరితే మొదటి స్నేహాన్ని వదలివెళ్ళిపోతారు. ఇది మిత్రత్వమవదు.

విద్యార్థి దశనుంచి గృహస్థు (గృహిణి), ఉద్యోగదశలో, వృద్ధాప్యంలో అనేక రకాలుగా మిత్రులు తటస్థపడుతూ వుంటారు. కానీ -జీవితాంతం మిత్రుడుగా మిగిలిపోయేవారు చాలా తక్కువ. మనం కూడా మిగుల్చుకోలేము.

దారిలో నడిచే బాటసారుల వంటి అనుభవాలు మాత్రమే ఇవన్నీ!

కష్టం వచ్చినా, సుఖం వచ్చినా మనోనిబ్బరం కల్గినవాడు సదా సంతోషంగా అనుభవిస్తాడు. కనుక మనస్సుని జాగ్రత్తగా వుంచుకోగల్గినవాడు సుఖజీవి.






# న కశ్చిన్నా పరాధ్యతి !

మానవ జన్మ ఎత్తిన ప్రతివాడు నీతి, నిజాయితీ, సత్యపరిపాలన చేయలేదు. అనేక కారణాలవల్ల ఇష్టం వున్నా, లేకున్నా తప్పు చేస్తాడు. ఒకవేళ ఇష్టపూర్వకంగా చేస్తే సమర్థించుకుంటాడు. లేదా - ఇతరుల మీదకి నెట్టినా తప్పేమీ లేదు. 'వాళ్ల చెయ్యమంటే చేసేను2 అని తనని తను రక్షించుకుంటాడు.

ఏదో సమయంలో మనిషి తను తప్పుకు లోనవటం జరుగుతుంది. దీనినే 'నకశ్చిన్నా పరాధ్యతి!' అంటారు.

లోకఃలో తప్పు చేయనివారు వుండరని అర్థం. 'తప్పు' అన్నది పెద్దదైనా, చిన్నదైనా తప్పే! తను చేసినా, ఇతరుల ఒత్తిడితో చేసినా... తప్పు తప్పే! అయితే - ఈ చిన్న, పెద్ద అనే వాటికి కొంత సరిహద్దు (మార్జిన్) వుంది.

ఆపదలో కొన్ని అబద్ధాలాడుతారు. దానివల్ల ఒక మంచి జరగడం గానీ, తనను రక్షించుకోవటం గానీ జరిగితే ఆ అబద్ధం 'ఆపత్‌ధర్మం'గా, శిక్ష లేకుండా వుంటుందని పెద్దల వాక్కు. ఇక్కడ అబద్ధం అన్నా తప్పే -అని గ్రహించి, అసలు 'తప్పు' అన్న పదానికి నిర్వచనం చెప్పాలంటే... సమాజంలో నైతిక, సాంఘిక, శారీరకమైన అనేక విధాల ధర్మాలని ఉల్లంఘించటమే తప్పుగా భావించబడుతుంది. పిల్లలు కొట్టుకుంటే 'తప్పు కొట్టుకోకూడదు' అని చెప్తాం. తిడ్తే 'ఆయ్! తప్పు! అలా తిట్టవచ్చా?' అని

కసురుతాం. ఎవరి వస్తువైనా తీసుకుంటే 'తప్పు కదూ? అలా వాళ్ళ వస్తువులు తీసుకోగూడదు' అని మందలిస్తాం.

పిల్లలకైతే చెప్పి కోప్పడుతాం. పెద్దలకైతే? ఏవగిస్తాం, అసహ్యించుకుంటాం. మాట్లాడటం మానేస్తాం. ఇంకా పెద్దలైతే చట్టపరంగా శిక్షిస్తారు.

ఇవన్నీ బయటికి కనిపించే తప్పులు.

కానీ - మానసికంగా మనిషి ఎప్పుడు తప్పు చేయకపోయినా ఆంతర్యంలో తలంపు చెడుగా వస్తే తప్పు చేసినట్టేనని శాస్త్రం చెప్తుంది.

ఈ మనస్సు చాలా చంచలమైనది. ఎంత చెప్పినట్టు వినదు. కనుక నూటికి తొంభైమంది మనస్సుకి లొంగిపోయి వుంటారు. ఆ మిగిలిన పదిమంది సత్ప్రవర్తన కల్గివుండవచ్చును. కానీ- తొంభై మంది మానసిక తప్పులు చేస్తూనే వుంటారు గదా?

కాబట్టి - 'తప్పు అన్నది బాహ్యానికి చేయకుండా వుండటమే కాదు, మానసికంగా కూడా కట్టుదిట్టంలో వుంటేనే సత్పురుషుడు కాగలడు. ఏ తప్పూ చేయని వాడు మానవుల మధ్య 'మహామనీషి'గా వెలుగొందుతాడు.

అందమైన అమ్మాయిని (అబ్బాయిని) చూసి మనసులో ఆకర్షితులవటం - మానసిక వ్యభిచారం! అది చాలా దోషం. అలాగే - డబ్బు గలవాళ్ళమీద ఈర్ష్యపడటం, సుఖపడుతున్న వాళ్ళపైన అసూయపడటం తప్పే!! ఎవరిపైన అయినా కోపం వస్తే వాళ్ళని చంపేయాలన్నంత కోపం వస్తుంది.





# ధృతిమాన్ నావసీదతి !

'ధీ రుడెన్నడూ నశింపడు!' అని అర్థం. అసలు నశించటమంటే పిరికితనం, అసత్యం అని తెలుసుకోవాలి. ఏ మానవుడైతే ధైర్యంతో యదార్థవాదిగా జీవిస్తాడో వాడికి ఓటమి అన్నది లేదు. అదే ధీరత్వం!

ఎవరైతే పిరికితనంతో అసత్యంగా బ్రతుకుతాడో వాడు అనుక్షణం ఓడిపోతూ వుంటాడు గనుక వాడికి 'వ్యక్తిత్వం' వుండదు. మనిషికి వ్యక్తిత్వం లేకపోవటమే నశించడం.

మరొకవిధంగా చెప్పుకోవాలంటే - స్వయంప్రకాశమైన వస్తువుకి నాశనం వుండదు. తాత్కాలికంగా ఏదైనా అడ్డువచ్చినా కొంత సమయం తర్వాత తిరిగి తన స్వయంశక్తిని ప్రకటించడం జరుగుతుంది.

సూర్యభగవానుడు మబ్బుతెర వచ్చినప్పుడు క్షణమాత్రం మసకబారినా ఆ తర్వాత మళ్ళీ ప్రకాశమానంగా కనిపిస్తాడు. వానాకాలంలో మబ్బులు రావచ్చును. వర్షం పడగానే తిరిగి సూర్యతేజస్సు ప్రజ్వలిస్తుంది. కనుక - స్వయంప్రకాశం గల భానుడు ఏ విధంగా తేజస్సు కోల్పోడో అదేవిధంగా ధైర్యవంతుడు తన శక్తిని హీనపరచుకోడు.

సంసారంలో మానవుడు ఎన్నో కష్టనష్టాల్ని ఎదుర్కొంటాడు. అంతమాత్రం చేత దిగులు పడి, మంచంపట్టి జీవితాన్ని వృథా చేసుకుంటే నిజమైన నాశనం అదే అవుతుంది. ఎందుకంటే- పుట్టిన

ప్రతివాడు మరణించక తప్పదని తెలుసు. కనుక ఎవరైనా బంధువులు పోయినప్పుడు ఆ సత్యాన్ని బాగా మననం చేసుకుని, వారి ఆశయాలు సఫలీకృతం చేయటం ద్వారా అరికట్టుకో గల్గాలి. వాడే ధీరోదాత్తుడు. మహనీయులు ఎప్పుడూ తమ బాధ్యతలు విస్మరించకుండా కష్టనష్టాలని దిగమ్రింగుకుని స్థైర్యంతో నిలబడతారు. కనుక 'ధీరోదాత్తులు'గా పిలవబడతారు.

ధీరత్వంలో సర్వ సులక్షణాలు వున్నాయి. కనుక అట్టివానికి అపజయం అన్నది వుండదు. అంతేకాదు, ధీరత్వం అంటే ధర్మగుణం కూడా! ధర్మం అనేది సకల సద్గుణాలు కల శక్తి గనుక, ఎవరైతే ధర్మం తప్పరో వారు రక్షించబడుతారు. అనగా - నాశనం కారు.

ఒక పరిశోధకుడు గానీ, భక్తుడు గానీ, కళారాధకుడు గానీ, సైనికుడు గానీ, కార్మికుడు గానీ 'ధీరోదాత్తుడు'గా నిలిచినప్పుడే తను చేపట్టిన కార్యం సాధించగల్గుతాడు. ఇక్కడ పని పూర్తి కావటం కన్నా ఆ మనిషి కృషిని గురించే చెప్పుకోవాలి. అంటే... అతని ధ్యేయం దృఢంగా వుండాలి. అప్పుడే కదా... పని సాధ్యం అయ్యేది. ఎవరి ఆలోచన లేదా ఉద్దేశం వీగిపోకుండా నిలబడగల్గుతుందో అప్పుడే సంకల్పం నెరవేరినట్టు లెక్క. ఆ నెరవేరటమే విజయం సాధించటం. అదే నాశనం లేకపోవటం!

విద్యార్థి పట్టుదలలో విజయం వుంటుంది. కనుక ఫలితం- విజయమే అవుతుంది.

కొందరు మంచి తెలివితేటలతో నెమ్మదైన వారుంటారు. వారిని చూసి ఈర్ష్య పడేవారు ఎలాగైనా వాళ్ళకి చెడుపేరు రావాలని కోరుకుంటూ ఎన్నో విధాల వారి ప్రగతికి ప్రతిబంధకం అవుతూ వుంటారు. కానీ, 'తెలివి' అనే ధీరోగుణం తరిగిపోనిది కనుక ఆ తెలివిగలవారిని గుర్తించి, వారికి ఇచ్చే గౌరవం ఇతరులు వారికి ఇస్తూనే వుంటారు.

చీకటివేళ దారి తెలియక తడుముకుంటూ వెళ్ళే మనిషి ఎక్కడో పడి దెబ్బ తగిలించు కుంటాడు. అదే పగటిపూట వెలుగులో ప్రయాణించేవారు స్థిరంగా, సూటిగా తను వెళ్ళాల్సిన గమ్యం చేరుకుంటారు. మొదటి ఉపమానం పిరికివాడికి, రెండో ఉదాహరణ ధైర్యస్థుడికి పోల్చుకుంటే స్వయం ప్రకాశంలోని ధీరోదాత్తం తెలుస్తుంది.

అందుకే... ధీరోదాత్తుడికి అపజయం లేదు- అని తెల్సుకోవాలి.





# "సతామేతదగర్హితం"

ధర్మ మార్గాన్ని అనుసరించేవారు - ఒకవేళ పొరపాట్లు - తప్పులు చేసినా - అవి గర్హాము కాజాలవని తాత్పర్యం!

అలాగని చెప్పి ధర్మపరులంతా తప్పులు చేయవచ్చని భావించకూడదు. ప్రహ్లాదుడు హరి భక్తుడు. అయితే తండ్రిని ఎదిరించేడు. మాట వినలేదు. అయినా అతనికి పాపం అంటదు! ఇందుకు కారణం - ఆ చిన్నవాడు అనుసరించిన మార్గం ధర్మమైనది! భగవంతునికన్నా తండ్రి గొప్పవాడు కాడని ప్రహ్లాదుడు నమ్మేడు. కనుక అతనికి తండ్రిని ఎదురించిన దోషం అంటదు!

తండ్రిని ఎదురించటమనే వాక్యాన్ని ఆధారం చేసుకొని నేటి మన లోకం పోకడ వింతగా వికృతంగా ప్రవర్తిస్తే - (ప్రవర్తిస్తోంది) అది మహాదోషం! దుర్ వ్యసనాలు - దుష్టుల స్నేహం చేసి అర్ధరాత్రిళ్ళు జూదాలాడి - త్రాగుడు - క్లబ్బులకి వెళ్ళేవాళ్లు - తండ్రిని ధిక్కరించడం జరిగితే అది క్షంతవ్యం కాదు! వాళ్ళకి ఓ లక్ష్యం లేనప్పుడు దైవ సమానుడై జన్మనిచ్చిన తండ్రిని తిరస్కరించడం మహాపరాధం!

అయితే ధ్యేయం ఉన్నతమైనప్పుడు పెద్దల ఎడ వ్యతిరేక ధోరణిలో వున్నా క్షమార్హులే! దేశసేవకో, దీనజన రక్షణకో దీక్ష వహించి సంసార బంధనం నుంచి బయటికి వచ్చేస్తే అది ప్రశంసనీయమే! అంతేగాక - ఒక్కోసారి పరదుర్మార్గుడైన వాడు కూడా - అకస్మాత్తుగా మారిపోతాడు. వాడిలో సద్గుణ - సతీ సంకల్పాలు కలుగుతాయి ! అటువంటివారిని ప్రశంసించి ప్రోత్సాహమివ్వాలి.

అంతేగాని - 'చాలు! చాలు! వీడు ఒట్టి దౌర్భాగ్యుడు - వీడికి మంచి బుద్ధి కూడానా? అని ఈసడించి మళ్ళీ వెనకటి బురదగుంటలో నెట్టేయరాదు!

ఎంతటి పాపాత్ముడైనా, ఎంతటి దుష్ ప్రవర్తన కల్గినవాడైనా ఒక్కోసారి మలుపు తిరిగి సరైనా మార్గాన నడవాలనుకుంటాడు. అటువంటివారిని క్షమించమని భగవంతుని ఉవాచ!

కొడుకు ఎంత దుష్టుడైనా - 'అమ్మా!' అని పిలవగానే తల్లి కరిగిపోతుంది. ఇది అమ్మలోని దైవగుణం. వాడి పిలుపులోనే వాడి దోషాలన్నీ మరుగుపడుతాయి. అలాగే పరహితులు ఆర్త సంరక్షకులు తన స్వజాన్ని నిర్లక్ష్యం చేసినా అందులో తప్పుపట్టకూడదు. అదే - ఒకవేళ త్రాగుబోతు - జూదరి - తిరుగుబోతు అయితే వాడు స్వసుఖం కోసం పట్టించుకోకపోతే శిక్షార్హుడే!

దీనివల్ల తెలుసుకోదగ్గదేమంటే ఎవరు ధర్మరక్షణ, లేదా కర్తవ్యపాలన చేస్తారో వారియందు దోషాలెంచకూడదు.

ప్రాపంచిక చింతలలో వున్నవారు బాహ్యాడంబరాలే ప్రాముఖ్యతనిస్తారు గానీ ఎదుటివాళ్ళ గుణసంపద తెలుసుకోవాలనుకోరు. దీనివల్ల ధర్మమేదో, అధర్మమేదో తెలియకపోగా - 'న్యాయం' కూడా అన్యాయమై పోతుంది. ధార్మిక చింతనాపరులని అపహాస్యం చేయటం నీతివంతుణ్ణి నిందల పాలు చేయటం నేటి లక్షణమైపోతుంది. అదే విధంగా ఎవరైనా ఒక తప్పుచేస్తే - క్షమించే గుణం నశించిపోతుంది. దీనివల్ల భవితవ్యంలో సమాజ వ్యవస్థ అస్తవ్యస్తమై పోయే ప్రమాదం వుంది!

దూరదర్శన్ లాంటి ప్రసారాల్లో చిన్నపిల్లల చేత తండ్రికి బుద్ధి చెప్తున్నట్టూ పెద్దల లోపాలు ఎత్తి చూపిస్తున్నట్లు వుంటున్నాయి. తల్లిదండ్రుల్ని వేలెత్తి చూపే పిల్లలు ఎంత ఎత్తుకు ఎదిగి వుడాలి? అనేది ధర్మమీమాంస? వాళ్ళు ఇంకా యుక్తవయస్సులో వుండి అతి చంచలమైన గుణంతో వుడి, తండ్రి ధిక్కారం, తల్లిని తిరస్కారం చేయుటలో ఔచిత్యం లేకపోగా - ధర్మం కూడా నశించి పోతుంది!

ఈ రకమైన ధోరణి ప్రజాహితమైనది. కాదూ, భగవంతుడూ మెచ్చడు !!






# ఉత్పన్నస్య వినాశయోగాత్

క్రొత్తగా ఉత్పన్నమైనది ఏదైనప్పటికీ నాశనం తప్పదు - అని అర్థం. అంటే - ప్రపంచంలో ఏదైనా... సృష్టి ఆదిలో లేనిదీ, మధ్యలో వచ్చినదీ అయితే - అది ఒక వస్తువు గానీ, ధర్మంగానీ, పనిగానీ ఏదైనా సరే - కలకాలం నిలవదు. దానికి అంతం తప్పదు!

ఇక - కలకాలం నిలిచేది, నాశనం లేనిది ఏమిటీ? అని సందేహం కలగటం సహజం. అదే సృష్టికి మూలమైన ధర్మశాస్త్రం. ఈ సకల చరాచరమంతా దానంతట అదే ఉత్పన్నం కాలేదు. దానికి మూలమైన శక్తి వుంది. ఆ శక్తికి కొన్ని విధులు (ఫండమెంటల్స్) వున్నాయి! దానినే మనం 'ధర్మం' అనీ, 'ప్రకృతి సహజ'మనీ అంటాం.

అవన్నీ వివరించేవే వేదాలు, ఉపనిషత్తులు . . .

మనం చూస్తున్న, చేస్తున్న, అనుభవిస్తున్న జీవితం అంతా ముందుగానే వున్న వనరుల వల్ల అని, ఆ 'శక్తి' ఉత్పన్నం చేసి వుంచింది! ఆ శక్తినే ఆధ్యాత్మయోగంలో భగవంతుడని, విజ్ఞాన శాస్త్రజ్ఞులు 'పవర్' అని చెప్తుంటారు. ఇక ఉత్పన్నమైనదంతా ప్రకృతే!

పరిశోధన (రిసెర్చి) చేసి వాళ్ళు ఫలానాది కనిపెట్టారు అనీ - కనుగొన్నారూ... అని చెప్పి 'డాక్టరేట్' ఇస్తాం. ఇది నిజంగా అజ్ఞానం. కొత్తగా మానవుడు సృష్టించేది ఏదీ లేదు. ఇంతకు ముందే నిక్షిప్తమై వున్నదాన్ని మనం దుమ్ముదులిపి వెలికి తీస్తున్నామన్న మాట. అది తీసిన వాళ్ళు కష్టపడతారు

కనుక - వారిని మెచ్చుకుందుకు 'డాక్టరేట్' అనే ప్రశంసను - ప్రదానం చేస్తారు. అంత మాత్రం చేత డాక్టరేట్ తీసుకున్న వాళ్ళంతా సృష్టికి అతీతమైన వాళ్ళు కాలేరు.

ఖగోళమైనా, చరిత్రాంశమైనా, విజ్ఞానాంశమైనా. సాహిత్యాంశమైనా, గణితమైనా - ఏ అంశమైనా అది మునుపే వుంది, వుంటుంది. దాన్ని మనం అనుభవిస్తూనే వున్నాం. అయితే... దాని వివరణ తెలియకుండా అనుభవిస్తున్నప్పుడు సామాన్యులం. విలువ తెలుసుకుని దాన్ని వివరించ గల్గిన వాడు పరిశోధకుడు. నిజానికి- పరిశోధన చేయనంత మాత్రాన సృష్టి ధర్మాలు ఆగిపోతున్నాయా? లేదే?

ముడి పదార్థం లాంటి ప్రకృతి సంపద అంతా సృష్టిలో దాగే వుంది. బయటకు తీసి - దాన్ని మన ఉపయోగాలకి అనుగుణంగా లేదా మనకి కావలసిన విధంగా మలుచుకుంటున్నాం. కనుక 'కనిపెట్టిన' అనే పదం కన్నా, 'తెలుసుకున్నాం' అనుకోవడం సమంజసం.

అదేవిధంగా - మానవతకి సంబంధించి అంతరాత్మ ప్రబోధ - నీతి, కరుణ లాంటి వాటివి ముందుగానే వున్నాయి. వాటిని మనం అనుసరిస్తున్నాం. ఏ రంగం ఇష్టమైన వారు ఆ రంగంలో కృషి చేస్తున్నారు. ఇదొక మహా ప్రయోగ శాల. సర్వ పదార్థాలు ఎదురుగా వున్నాయి. వాటినందుకుని మనం ఉపయోగించుకోవటంలోనే మానవజన్మ సాఫల్యం కన్పిస్తుంది.

ప్రతి పరిశోధనకి ఒక ప్రతిఫలం వుంటుంది. దానిని పొందటం కోసమే - తాపత్రయ పడుతున్నాడు మానవుడు. ఏ పరిశోధనా చేయని సామాన్య మానవునికి కూడా సంసార తాపత్రయం వుంటుంది కదా? దానిలో కూడా - ప్రతిఫలం వుంది! సరైన బాధ్యత, విధినిర్వహణ చేసి ఫలితం సాధించడంలో వున్న ఆత్మ సంతృప్తే - ఆ ప్రతిఫలం!

అలాగే - ఈ 'శక్తి' (భగవంతుడు, లేదా పవర్) ఏమిటో తెలుసుకోవాలనే పరిశోధించే వారు వున్నారు. వారే జిజ్ఞాసువులు, ముముక్షువులు, యోగాభ్యాసులు, భక్తులు!

ఇలాంటి వారికి ఆత్మ నైర్మల్యం ఒక్కటే చాలు! చదువులు, డిగ్రీలు అక్కర్లేదు! దానికి- అనగా... ఆ పరిశోధనకి ప్రతిఫలం 'మోక్షం'. ఈ మోక్షం తెలుసుకొన్న (కనుగొన్న) వారు డాక్టరేట్స్. అందరికన్నా మిన్న!! అన్ని పరిశోధనలు అందులోనే వుంటాయి!

ఎన్ని యుగాలైనా ఆ పరిశోధనా ఫలితం నాశనం అవ్వదు. మిగతా రంగాల్లో తెలుసుకున్న విషయాలు మారిపోవచ్చును కానీ, ఆధ్యాత్మ యోగ పరిశోధకుల శోధన ఎప్పుడూ ఒకే ఫలితం మీద నిలిచి వుంటుంది.






# "కర్మాధీనం జగత్సర్వం
# కర్మ కేశవాధీనం"

...అని చెప్పబడింది.

ప్రతికార్యం మనం చేసుకున్నదే. దాని ఫలితమే మనం అనుభవిస్తాం. కోరుకున్నది లభించినా, కోరుకోకపోయినా, లభ్యమైనదీ... అన్నీ కూడా మనం చేసుకున్న పనిమీదే ఆధారపడి వుంటుంది.

ఏ పని చేస్తే ఏ ఫలితం కల్గుతుందో నిర్ణయించేవాడు భగవంతుడు. కనుక మనం చేసే పనికి తగిన ప్రతిఫలం ఇచ్చేది ఆ కేశవుడు లేదా పరమాత్ముడు.

ఫలితం - అంటే గుణధర్మ (ప్రాపర్టీ) అని తెలుసుకోవాలి. నిప్పు కాల్తుంది. అది దాని గుణం. మనం నిప్పుని పట్టుకుని కాలిందని బాధపడితే ఏం లాభం? అలాగే - ప్రతి పదార్థానికి ఒక గుణం వుంటుంది కదా? మంచులో తడిస్తే జలుబు చేస్తుంది. ఎండలో తిరిగితే వేడిచేసి జ్వరం వస్తుంది. ఎవర్నైనా దూషిస్తే వాళ్ళు తిరిగి మనని తిట్టడమో, తన్నడమో చేయవచ్చును. ఇవన్నీ మనకి కన్పించే గుణాలు లేదా ధర్మాలు.

కానీ - మనకి తెలియనివి కూడా వున్నాయి. అవి వెంటనే ఫలితం చూపించవు. కొంత సమయం పడ్తుంది. కనుక మనకి దాని విషయం తెలియక ఆ పని చేస్తూ వుంటాం. దీనివల్ల కాలాంతరంలో దాని ఫలితం అనుభవిస్తున్నప్పుడు - 'ఏం చేసేనో ఇలాంటి అనుభవం జరుగుతోంది' అనుకుని దు:ఖపడతాం.

పైగా - 'ఆ భగవంతుడికి న్యాయం లేదు. నాకింత కష్టం కల్గించేడు. వాళ్ళకేమో అంతా సుఖమే' అని తిట్టుకుంటాం.

ఇది పొరపాటు. నిజానికి భగవంతుడు ఏమీ చేయడు. అన్నిటికీ మనం చేసే ప్రతి పనికి ఒక (రూల్) నిబంధన, సూత్రం, ఫలితం నిర్ణయించేడు. దాన్ని అనుసరించి నడుచుకోవటమే మనం చేయాల్సింది.

అయితే - ఎంతో మంచివాళ్ళు, ధర్మం ప్రకారమే నడిచేవారు కూడా ఒక్కోసారి కష్టపడతారు గదా? మరి అది అన్యాయం కదా? అని మనం ప్రశ్నించుకుంటాం. కానీ, ఈ ధర్మపరులు ఇంతకు ముందు ఏం చేసివున్నారో మనకి తెలయదుకదా?

మనకి ఏదైనా జబ్బు చేసినప్పుడు 'అరే...మనిషి అంత దృఢంగా కనిపిస్తూ వుంటే జబ్బు ఎలా చేసిందీ?' అనుకుంటాం. కానీ - మనం ఇంతకు ముందు ఏ పదార్థాలు తిన్నామో వాటి ప్రభావం మనమీద చూపదా? అలాగే ముందుగా చేసిన పనిమీద తర్వాతి అనుభవం ఆధారమై వుంటుంది.

దీనివల్లనే కర్మాధీనం జగత్సర్వం అని చెప్పబడింది. మరొక సంగతి కూడా తెలుసుకోవాలి. మన బుద్ధి కూడా మనం అనుభవించబోయే దానికి అనుగుణంగానే నడిపిస్తూ వుంటుంది. అందుకే కొందరు తెలుసుండి కూడా పొరపాట్లు , తప్పులు చేసి వాటి ఫలితం అనుభవిస్తారు. పదవీ భ్రష్టులైనా, పట్టా గట్టుకున్నా, బాగుపడినా, చెడిపోయినా... అంతా బుద్ధివల్లనే. ఆ బుద్ధి కర్మని బట్టి కనిపిస్తుంది.

'ఇక అయితే మనం చేసేదేమిటి?' అన్న సందేహం కల్గుతుంది. మనం చేసేది వుంది !! ఒక రోగి వైద్యం చేయించుకుంటున్న సమయంలో పథ్యం, నియమిత ఆహారం, క్రమబద్ధమైన విశ్రాంతి తీసుకుని రోగం తగ్గించుకున్నట్టే - బాధలు పడేవాడు లేదా దు:ఖ పడేవాడు చెడు పనులు చేయకుండా తనని తను కట్టడి చేసుకోవాలి. పొరపాటు పనులు మానేయాలి. తప్పును దిద్దుకుంటే శిక్షాకాలం తగ్గిపోతుందని ధర్మశాస్త్రం చెప్తోంది.

నిప్పుకాలితే మందు వేసుకుని బాధ తగ్గించుకున్నట్టే పాపకర్మలు చేస్తే దానికి పశ్చాత్తాపం ప్రార్థనాపూర్వక వేడుకలు అవసరం. ఇదే మన జీవితంలో నేర్చుకోదగ్గ పాఠం!!



# గుణత: సంగ్రహం కుర్యాత్, దోషతస్తు విసర్జయేత్!

'అదేమిటీ? అతన్ని చూస్తే నీకంత కోపం ఎందుకు? పాపం... చాలా మంచివాడు. ఏ పని చెప్పినా చేసి పెట్టాడు'. అని మనం ఎవరితోనైనా అంటే 'ఆ! మంచివాడే! ఏ పని చెప్పినా చేస్తాడు. నిజమే కానీ, వాడి అతిధోరణి నాకు అసహ్యం. నేను భరించలేను'. అని మనం చెప్పవచ్చును.

కానీ... ఒక మంచితనం వుందిగదా? మరొక చెడుగుణం వుంటే అది మనకు నష్టం కల్గించ నంతరవరకు బాధలేదు. మనకి నచ్చేగుణాలే అన్నీ ఎదుటివాళ్ళలో వుండాలనుకుంటే సాధ్యమా? ఒకతల్లి గర్భమందు పుట్టిన పిల్లలంతా ఒకేలా వుండరు. వారి రూపగుణ భేదాలు మనం చూస్తూనే వుంటాం. అలాగే ప్రతివాళ్ళలో మంచి, చెడూ రెండూ కలిసే వుంటాయి. అంతమాత్రం చేత మంచిని గ్రహించకుండా ఒదిలేస్తామా?

అందుకే 'గుణత: సంగ్రహం కుర్యాత్, దోషతస్తు విసర్జయేత్' అన్నారు. గుణము గ్రహించి దోషమును విడువవలెను - అని అర్థం. ఇక్కడ మరొక విశేషం కూడా వుంది. మంచి, చెడు విడివిడిగా కాక ఒక పని చేయందే మంచి, చెడు మిశ్రమమై వుండటం కూడా జరగవచ్చును.

క్షీరనీర న్యాయంలో పాలు, నీరు కలిసి వుంటాయి. స్నేహం అనేది అలా కలసి వుండాలని చెప్తారు. అయితే... హంసపాలు మాత్రమే త్రాగి, నీరు మిగిల్చివేస్తుందిట. అలాగే... స్నేహితులందు మంచిని వాళ్ళనుంచి గ్రహించి చెడును మనం వదిలేయాలి. అలాంటప్పుడే ఆ స్నేహం నిలుపుకో

గల్గుతాం. ఒక్క స్నేహితులందు మాత్రమే కాదు. మన చుట్టూ సమాజంలో ఎంతోమంది వుంటారు. అందరి భావాలూ ఒకేలాగ వుండవు. కొందరు మనకి బాధ కల్గేలా మాట్లాడవచ్చును. కొందరు తీయగా, ప్రేమగా పల్కరించవచ్చును.

అయితే... బాహ్యప్రవర్తన ఒక్కటే మనం చూడకూడదు. వారిలో ఆంతర్యంలో నిగూఢమైన మంచి ఏదో ఒకటి వుండే వుంటుంది. ఆ గుణాన్ని మనం గ్రహించాలి. దోషాన్ని వదలివేయాలి. బందిపోటు దొంగలు, కసాయివాడిలో గూడా ఎక్కడో ఓ సద్గుణం దాగి వుంటుంది. అదే మనం చూడాలి.

పూర్వం ఒకావిడ అందరికీ ఎంతో మేలు చేస్తుండేదిట. అయితే... ఆవిడ కళ్ళలో ఓ విషపు చూపు వుండేది. అదే దృష్టి (దిష్టి) కలిగే చూపు. ఆవిడ ఏదైనా చూసినప్పుడు 'అమ్మో! ఎంత బాగుందో' అని ఒకసారి అబ్బురపడితే ఇక ఆ వస్తువు బాగుండేది కాదుట. ఒకసారి పడవ సరంగులు నది ఒడ్డున అన్నాలు తింటూవుంటే నీళ్ళకి వెళ్ళిన ఆవిడ వాళ్ళు అన్నాలు తినటం చూసిందట. తెల్లగా సన్నజాజుల్లాంటి ఆ అన్నం మెతుకులు చూసేసరికి ఆవిడకి కన్ను కుట్టిందట. వెంటనే ఆవిడ తేరుకుని వాళ్ళ దగ్గరికి వెళ్ళి 'బాబూ... మీరు ఆ అన్నం తినకండి నా చూపు మంచిది కాదు. మీకు అరగదు. నేను మీకు వండి పెడతాను. మా ఇంటికి రండి'. అని నిష్కపటంగా చెప్పేసిందట. వాళ్ళు మొదట తెల్లబోయి, అన్నం పారేయలేకపోయినా ఆవిడ స్వయంగా చెప్తుంటే ఇక తప్పదని వదిలేసి లేచి ఆవిడతోపాటు వాళ్ళింటికి వెళతారు. ఆవిడ అంతమందికి స్వయంగా వండి కడుపునిండా పెట్టిందట. ముతక దంపుడుబియ్యం, చూడటానికి అన్నం అంత బాగా లేకపోయినా ఆ ఇల్లాలు అభిమానంతో వడ్డిస్తూ వుంటే సరంగులు తృప్తిగా తిని ఆమెకు దండాలు పెట్టి మెచ్చుకున్నారుట.

ఎంత విచిత్రం? చూపు దోషమైనదే గాని, 'గుణం' అమృతప్రాయం! అందుకే మన హృదయం అద్దుడు కాగితంగా (బ్లాటింగ్ పేపర్) అందరి మంచి గ్రహించి, చెడును వదిలేయగల్గితే సర్వం ప్రేమమయంగానే కనిపిస్తుంది. అందుకు ప్రయత్నిద్దాం!





# సహిచ్ఛేయ మధర్మేణ
# శక్రత్వ మపి లక్ష్మణా!

'అధర్మముగ సిద్ధించిన ఇంద్రత్వమైనను నేను కోరను' అన్నది భావం!

ఈ వాక్యం వేదసమ్మతమైనది! పాప పుణ్య భేదం తెల్సిన పురుషులు (స్త్రీలు) ఈ సార.. సమ్మతిస్తారు.

'అధర్మముగ' అంటేనే పాపంతో కూడుకున్నది అని అర్థం. అటువంటప్పుడు 'ఇంద్రత్వం' సుఖం ఎలా కల్గిస్తుంది? ఇంద్రత్వమంటే - సకల భోగాల ఐశ్వర్యాలు !

మనది కానిదీ - అధర్మంగా (అన్యాయంగా, అక్రమంగా) సంపాదించినదీ, ఎంతటి సంపద అయినా, సుఖాన్ని ఇవ్వదు. బందిపోటు దొంగలు, దౌర్జన్యాలు చేసేవాళ్ళు, ఎన్నో కొల్లగొట్టి దాచుకుంటారు. కానీ...హాయిగా, మనశ్శాంతిగా వుండగలరా? ఎప్పుడూ భయపడుతూ చాటు మాటుగా బ్రతుకుతారేతప్ప- సమాజంలో నిర్భీతిగా బ్రతకలేరు.ఎందుచేత? పట్టుబడి పోతా మేమో..., శిక్ష అనుభవించాల్సి వస్తుందని అహోరాత్రులు కంటినిండా నిద్రలేక, నెమ్మదిగా భోజనం చేయలేక రహస్య ప్రదేశాల్లో తలదాచుకుంటారు. ఎప్పుడు ఏ అవాంతరం ముంచుకు వస్తుందో అన్న బెదురే కనుక ఇద సుఖప్రదమైన సంపద కాదు! ఇందులో మరొక సూక్ష్మరహస్యం వుంది!

మన వస్తువు కానిది మనకి సరిపడదు! ఉదాహరణకి - మనకిష్టం లేని ఆహారపదార్థం (ఎంత ఖరీదైనా సరే) మనం తినలేం. అది మన శరీర తత్వానికి పడదు. వికటిస్తుంది. వాంతి వస్తుంది. మనని అనుభవించనీయకుండా చేస్తుంది. కనుక మనం తినం.

అలాగే... మన సంపద కాని దాన్ని మనం కొల్లగొట్టి తెస్తే 'భయం' అనే శక్తి మనకి వికటించేటట్టు చేస్తుంది. ఈ భయమే లేకపోతే హాయిగా అందరూ దోచుకునే అనుభవించేవారు.

ఒకవేళ అటువంటి జనం వున్నా దానికి (దొంగ సంపదకి) తగినంత కట్టుదిట్టం చేసుకుని (బ్లాకు మనీని - వైటు మనీగా మార్చుకునే ప్రయత్నాలు) అనుభవిస్తారు తప్ప - తన కష్టార్జితం అనుభవించేటంతటి తృప్తి వుండదు.

అందుకే... కష్టజీవి అయినవాడు ఏరోజు కూలి డబ్బులతో ఆరోజు హాయిగా తిని నిద్రపోతాడు. వాడికున్నంత స్వేచ్ఛ, సుఖం, మనశ్శాంతి... నిజంగా భాగ్యవంతునికి వుండవు. ఎంతసేపూ డబ్బు దాచుకుందామన్న తాపత్రయంలో నిద్రకీ, తిండికీ కరువై అవస్థపడుతాడు. ఇక్కడ అధర్మమంటే -

మనిషికి కావల్సినంతకన్నా ఎక్కువ వున్నా - అది అధర్మమే అని తాత్పర్యం! మరొకరి ఉపయోగానికి రాని ధనం అనవసరంగా దాచటం అధర్మం. దానిని సద్వినియోగ పరచటమే ధర్మం. కనుక స్వార్జితంలో కూడా ఆశకి అంతులేకుండా సంపాదించటం అధర్మమే గనుక అది సుఖాన్ని ఇవ్వదు.

మనస్సు - అనేక ఆలోచనలు చేసి (పాపపు) అనుభవాలు పొందాలనుకుంటుంది. అలా పొందేటప్పుడు శరీర అవయవాలకి పడకపోతే శరీరం అస్వస్థత చెందుతుంది.

అనే మన అంతరాత్మ మనకి చెప్తూనే వుంటుంది. ఆ ప్రబోధ మనం వినగల్గితే - మనం ప్రాజ్ఞులమే!!!





# ఉభయం హి మహాన్దోష స్తస్మాదన్తర దృగ్బవ !

రాగ ద్వేషాలు రెండూ మంచివి కావు. కనుక మధ్యే మార్గంగా వుండాలని పండితవాక్కు.

రాగమంటే - ప్రేమ, అభిమానం, మమత మొదలగు కరుణరస ప్రధానమైన గుణం!

ద్వేషమంటే - క్రోధం, పగ, ఉద్రేకం, కసి మొదలైన క్రూరమైన గుణం!

ఈ రెండూ విభిన్నమైనవి. అయినప్పటికీ రెండూ ఎక్కువ మోతాదులో ఎవరికైనా వుంటే అనగా వాళ్ళు ఇతరుల మీద చూపిస్తే అది మంచిది కాదని ఆర్యులు, పెద్దలు, విద్వాంసులు చెపుతారు.

రాగమనేది - ఇంట్లోవాళ్ళమీద కాని, బయటి వాళ్ళమీద కాని, చూపవలసినంత వరకే చూపాలి కానీ, అతిగా చూపించకూడదు. సాధారణంగా కన్న పిల్లల మీద అందరికీ అపరిమితమైన అనురాగం వుంటుంది. దానివల్ల తెగ ముద్దు చేసి అల్లరి నేర్పటం, విపరీతంగా ఖర్చులు పెట్టటమే కాకుండా వాళ్ళు చెడుమార్గంలో నడుస్తున్నా - ఏమీ మందలించలేకపోతారు. తప్పని తెలిసినా తమకి వారియందు వుండే ప్రేమాభిమానాలు - అదే... అనురాగం చేత ఏమీ అనలేరు. ఆ తర్వాత ఫలితం చెడుపుగ వుంటే దు:ఖించటం తప్ప లాభం వుండదు. చిన్ననాడు చెప్పక మిన్నకుండి, పెద్ద అయ్యాక నీతులు చెప్దామన్నా వీలుకాదు. చేతులారా పాడుచేసినవారవుతారు. దానివల్ల వాళ్ళు కష్టనష్టాలు ఎదుర్కొని, అవి చూడాల్సి వచ్చినందుకు పెద్దలు బాధపడాల్సి వస్తుంది.

ఒక పిల్లల విషయమే కాదు, భార్యా భర్తలు గానీ, ఆత్మీయులుగానీ ఒకరిపై నొకరు విపరీతంగా రాగాలు పెంచుకుంటే, ఇక వారియందు తప్పులు కనిపించవు. అంటే... చూడలేరు. అందుచేత అనేక అనర్థకాలు జరుగుతూ వుంటాయి! ఇంటి సంగతి వదలి బయటి ప్రపంచంలోకి చూస్తే, మిత్రుల యందు కొందరు అపరిమితంగా రాగానుబంధాలు పెంచుకుంటారు. ఏ దురదృష్టవశాత్తో వారు దూరమైనా లేక దూరప్రదేశాలకి వెళ్ళవలసి వచ్చినా వీళ్ళు తట్టుకోలేక సంకట పరిస్థితుల్లో పడతారు. జీవితంలో చాలా పోగొట్టుకున్నట్లు వ్యధను భరిస్తారు.

ఇలాగ మనుష్యులపైనే కాదు.., వస్తువుల మీద, పెంపుడు జంతువుల మీద, ఆస్తిపాస్తుల మీద విపరీతమైన అనురాగాలు పెంచుకుని తల్లడిల్లిపోతూ వుంటారు.

ఈ రాగానుబంధం ఒక అయస్కాంతం వంటిది! గురుత్వాకర్షణ శక్తి ఎక్కువైనప్పుడు ఎలాగైతే వస్తువు అయస్కాంతానికి అతుక్కుపోయి, విడదో, అలాగే రాగానుబంధం చిక్కనై మనుష్యుల మీద తదితరమైన వాటిమీద గట్టిగా బంధింపబడుతుంది !

ఇక- ద్వేషం విలోమాను పద్ధతిలో సాగి, మనుష్యుల మధ్య ఎన్నో అవాంఛనీయాలు, దుర్ఘటనలు సృష్టిస్తుంది!

మనుష్యులన్నాక ఇష్టాయిష్టాలు, కోపతాపాలు సహజమే! అయినా- ద్వేషం అనేది మనిషిలో ప్రవేశించిందంటే ఎంతసేపూ పగబట్టిన పాములాగా, ఎదుటివానిమీద దెబ్బకొట్టడానికే చూస్తుంది. ఒక ఇంట్లో వుండే బంధువులు ఒకరి మీద ఒకరు ద్వేషం పెంచుకుంటే ఇక ఇల్లు నరకమే! ద్వేషం ఎవరిలో ప్రవేశిస్తుందో వాళ్ళ నరనరాలు ఎప్పుడూ తీవ్రంగా కదిలిపోతూ ఆరోగ్యానికి హానిచేస్తూ మానసిక శాంతిని దూరం చేస్తాయి!

అందుకే - రాజాధిరాజులు యుద్ధాలు చేసుకుని రక్తాలు ప్రవహింప చేసారు! రాజుల కాలం నుంచి ప్రజాస్వామ్యం కాలం వరకు ఈ ద్వేషాలు ఎన్ని ఘాతుకాలు చెలరేపి, ఎంత ప్రాణ, మాన, ధన నష్టాలు కలిగించాయో, చరిత్ర పుటలు చెప్తాయి. ద్వేషం - ఎదుటివాడినే కాదు, తనకి తాను నాశనం చేసుకునేలా చేస్తుంది. చల్లని వెన్నెల వంటిది రాగం! ఎగిసి పడే మంట లాంటిది ద్వేషం!

వెన్నెల చల్లనిదైనా, ఎక్కువసేపు భరించలేం. ఆరోగ్యం చెడుతుంది. అలాగే... మంట అవసరమైనా ఎగిసి పడితే ప్రమాదమే!

మధ్యే మార్గంగా - రాగద్వేషాలు సమపాళ్ళలో వున్నప్పుడే మానవుడు సరళంగా నడవగలడు!





# ఏ కన్య మరణం మేస్తు మా భూత్ సర్వ వినాశనం !

'నేను మరణించినను సరే - ఇతరులు నాశనము కారాదు' అన్నది ఆర్యోక్తి !

మహాత్ములూ - మహనీయులూ ఈ సత్యాన్ని ఆమోదిస్తారు. కనుకనే వారి చరిత్ర పవిత్రమైనది.

సామాన్యుడు - అంతకన్నా క్రిందస్థాయిలో వాడు - తను మరణించాక - ఇక ఎవ్వరు, ఎలావుంటే నాకేమిటి? అనుకుంటారు! అందుకే తాను బ్రతికి వుండగా ఎన్ని అనుభవింపగలడో వాటికోసం తాపత్రయ పడుతూ ఇతరుల సంగతి పట్టించుకోడు.

ఇదే స్వార్థం! మనిషి ఈ స్వార్థం అనే తెరనుంచి బయటి ప్రపంచాన్ని చూసినపుడే 'తను' అనే పరిధినుంచి విశాల దృక్పథానికి చేరుకోగలడు!

తానున్నా, లేకున్నా - అనే ధ్యేయం ఉత్తమోత్తమమైనది ! తనని చూసుకున్నాక ఇతరులను చూడడం అనేది - మధ్యమార్గం ! తనే ముఖ్యం అనుకోవడం - ఇతరులు ఏమైనా తనకవసరం అనుకోవడం - అధమం!

తనకి ఆపద మూడినా, సంకట పరిస్థితి వచ్చినా - తనకి అన్యాయం జరిగినా సరే - ఇతరులకి మేలు జరుగుతుందని తెలిసినప్పుడు - ఆ పని చేయగలవాడు గొప్ప మనసు గలవాడు.

అజ్ఞాన దశలోనో, అమాయకత్వంలోనో, మూర్ఖత్వం చేతనో, మామూలు ప్రజలు తప్పుడు దారుల్లోకి పోతూంటారు. అటువంటి వారిని ఉద్ధరించడం మానవతా ధర్మం. అయితే -ఆ ఉద్ధరణ అనేది అనుకున్నంత తేలిక కాదు. వాళ్ళని బాగుపరచబోయి మనమే ఆపదలో చిక్కుకోగలం! అయినాసరే - ఎదుటివాడు బాగుపడతాడని ఆశించి మనం కష్టం భరించాలి. అంతటి గుణవంతుడు ధర్మపరు డనబడతాడు.

విశిష్టాద్వైతంలో - రామానుజాచార్యులు - ఒకానొక శిష్యునికి ఉపదేశం చేసి - 'నాయనా ! ఇది ఇతరులకి తెలియరాదు. తెలిస్తే నీ తల వ్రక్కలవుతుంది!' అని చెప్తాడు.

అయినా సరే! ఆ శిష్యుడు ప్రజల మేలు కోరి ఆలయ శిఖరం ఎక్కి ( ఆ ధర్మ రహస్యం) ఉపదేశసారం అందరికీ వినిపించాడు. తానొక్కడూ మోక్షం పొందడం కాదని, అజ్ఞానులు, అమాయకుల్ని ఉద్ధరించాలని, గురువుగారి ఆజ్ఞని సయితం ధిక్కరించి అతడు ఆ విధంగా చేశాడు.

ఆ తరువాత గురువుగారు అతని త్యాగాన్ని మెచ్చుకుంటారు.

అంతటి గొప్ప గుణం సామాన్యులకి ఉండదు. నేటి సమాజంలో అతి చిన్న విషయాలకే పోటీపడి - తన దారి తాను చూసుకోవటమే కాదు - ఇతరులకి హాని కలిగించేది అయినా సరే... చేస్తూంటారు.

చరిత్రలో మనకి త్యాగధనులు - నిస్వార్థపరులు ఎందరో కనిపిస్తారు. చెరువుకట్టకి కన్నం పడితే దానికి కాళ్ళు అడ్డంగా పెట్టి, రాత్రంతా కూర్చున్న సాహసవంతులు, త్యాగధనుల కథలు మనకి తెలుసు. అలాగే జానపద కథల్లో తాను దేవతకి బలి అయి ఇతరులను రక్షించిన ఉదంతాలున్నాయి.

కన్నవారు, ఆత్మీయులు, తమ సంతానం కొరకు త్యాగం చేస్తారు. ఇందులో కూడా స్వార్థం వుంది. అది రక్త స్పర్శ. కాని, తనకి సంబంధం లేకపోయినా ఏవిధమైన ఫలాపేక్షా కోరకుండా తనని తాను ఇతరుల మేలుకొరకే భావించడం - చాలా గొప్ప విషయం.

నిరాహార దీక్ష చేసిన పొట్టి శ్రీరాములు దేశస్వాతంత్ర్యం కొరకు జైళ్ళు - శిక్షలు - భరించిన త్యాగధనులు - అట్టివారే!

ఈ మహోపకారం గుణం వల్లనే మానవుడు ఉత్తమోత్తముడై - చిరస్థాయిగా నిలుస్తాడు!!





# సమైక్యతంటే..

మనిషి పుట్టుకకు ముందు ఏమిటో.... పుట్టిపోయాక ఏమిటో తెలియదు! కానీ పుట్టి జీవిస్తున్నప్పుడు మాత్రమే ... చరిత్ర! ఈ చరిత్ర ఎవరికి వాళ్ళకే! ఎవరి మనుగడ వాళ్ళదే! అయినా - ఒంటరిగా ఎవరికి వారుగా జీవించలేనిదే - మానవజీవితం! ప్రతిమనిషి తనకు తెలియకుండానే ఇతరులపై ఆధారపడుతాడు. అలాగే ఇతరులు మన నుంచి ఆధారం పొందుతారు! అంటే... మనిషికీ, మనిషికీ మధ్య, ఆకర్షణ వుంది! ఇదంతా తెలియకుండా జరుగుతూనే వుంటుంది. తెలుసుకుని బాహ్యంలో కూడా... ఐక్యత గల్గివుండటమే, 'సమైక్యత' అనేది! నీవు నువ్వు ఏంచేసుకున్నా... నల్గురి కోసం చేయటమే సమైక్య దృష్టి! దీనికే 'ఏకత్వంలో భిన్నత్వం! భిన్నత్వంలో ఏకత్వం!!' - అని గీతలోని ప్రబోధ!

ఇంట్లో వుంటే - ఏ వస్త్రం కట్టుకున్నా, ఏ తిండి తిన్నా - ఎవరూ చూడరు - కానీ బయటికి వచ్చి నల్గురిలో తిరగవలసి వస్తే ఇంపైన బట్ట కట్టుకుంటాం! మంచి రుచికరమైన భోజనం చేస్తాం!! అంటే మనకోసం కాక ఇతరులు మెచ్చటం కోసం కూడా మనం మన జీవితాన్ని చక్కదిద్దుకుంటాం! అంటే ... సమాజంలో ఒకరికోసం ఒకరు తప్పక తమ బ్రతుకు మలుచుకోవలసి వస్తుంది! ఒకవేళ అలా చేయక మన ఇష్టం వచ్చినట్టు చేస్తే అంటే చిరుగుడ్డలో - చింపిరి అవతారమో అయితే చూసే వాళ్ళు పాపం! పిచ్చివాడు అనే ప్రమాదం వుంది! కనుక అది మనం భరించక మన ఇంపూ, బయటవాళ్ళ

సొంపుకీ తగినట్టు అలంకరించుకుని బయటికి వస్తాం! ప్రతి విషయంలో అంతే! అందుకు విరుద్ధంగా ప్రవర్తించే వాళ్ళని . . . రౌడీలనో, మతిలేనివాళ్ళనో అంటారు తప్ప మామూలు మనుష్యులుగా గుర్తించరు.

కనుక - మనిషికి, సమాజంలో ఇతరులకోసం కూడా, నచ్చిన విధంగా మసులుకోవటం అత్యవసరం! అలా మసులుకోవటం మరికాస్త ఉన్నతంగా, అంటే ఎదుటివాడిని నిజంగానే ఇష్టపడుతూ, మసలుకుంటే - మనం సమతాభావం అలవరచుకున్నట్టే - అందర్నీ సమంగా ప్రేమిస్తూ - మనల్నీ మనం గౌరవించుకుంటే అదే సమైక్యత!

అందరం ఒకటే! అందరిలోని చైతన్యం ఒకటే ఐనా ఎవరి ఆకలి వారిదే! ఎవరి నిద్ర వారిదే! ఎవరి బాధ వారిదే!! నీ ఆకలీ, నిద్రా, బాధా మరొకరు భరించలేరు గదా! ఇదే ఏకత్వంలోని భిన్నత్వం! నిన్ను నీవు చూసుకోవటం లేదా గౌరవించుకోవటం! అలాగే - ఎదుటివాడికే, ఆకలి, నిద్రా లాంటి అవస్థలు వుంటాయని గ్రహించి - మనం ఎల్లాగ వాటికోసం అలమటిస్తామో, ఇతరుల అవస్థ అలాగే వుంటుందని గ్రహించి - వారిని ఆదుకోవటమే భిన్నత్వంలోని ఏకత్వం!

అందరి బాధ ఒకటే! మనం అందరిని మానవతా దృష్టితో చూడడమే - సమైక్యతా భావం.

ఈ సమైక్యతని సాధించిననాడు - మానవుడు సర్వవేళలా సంతోషంగా వుండగలడు! తన రూపం అందరిలో చూడగలడు! అందర్నీ తనతో పోల్చుకోగలడు! అప్పుడు - ప్రత్యేకించి పండుగలు-పర్వదినాలు రానక్కర్లేదు, ఎదుటివాడి సంతోషం ప్రతినిత్యం ఉగాదే! జీవితమంతా సంక్రాంతే!! ...నలోని వెలుగే దీపావళి!!! తనకి పరమానందం! తన సంతుష్టి ఇతరులకి పరమామోదం!!

అందుకే - 'మహనీయులంతా సమైక్యదృష్టి - సమతాభావం . . . సర్వమానవ కళ్యాణానికి దోహదం' - అని బోధిస్తుంటారు! ఈ సమతాభావం లోపించే - మానవుడు అధముడవుతున్నాడు! సమత వల్ల మమత, తద్వారా. . . మానవతా అలవరచుకొని మహోన్నతుడు కావాలి మానవుడు!






# కలతలు !

మనిషికి రెండు దశలలో ప్రాపంచిక అనుభవాలు అవగాహనలోనికి వస్తుంటాం. మొదటిదశలో శరీర సంబంధమైనవి. రెండవ పరిస్థితిలో మానసిక సంబంధమైనవి. కష్టం గానీ, సుఖంగా, శారీరక అనుభవంలో కొంత మనసుకు కూడా కలిగినా తాత్కాలికంగా సమసిపోతుంది. ఒక చిన్న దెబ్బ తగిలితే 'అబ్బా!' అనే బాధాపూరిత కేక హృదయం నుంచి వచ్చినా దెబ్బ తాలూకు మచ్చ శరీరానికే పరిమితంగా వుంటుంది. ఇక - మానసికమైన కష్టసుఖాలు శరీరంతో ఏమీ సంబంధం లేకుండా- అంటే... దేహానికి ఏ మాత్రం ప్రమేయం లేకుండా మానసికంగా అనుభవించవలసి వుంటుంది. బాగా లోతుగా మనసుని బాధించేవి కొన్ని తేలికగా అనిపిస్తూ మనసుని వశపరచు కునేవి కొన్ని.

ఇదిగో... ఇలాంటి వాటినే 'కలతలు' అంటాం.

పైకి బాహాటంగా ఏడ్చి బాధని తీర్చుకోలేం. అలాగని - ఆ బాధని మరచిపోయి హాయిగా నవ్వలేం. కలతలు అనేవి ఒక విధంగా 'నలకల' వంటివి. అనవసరంగా మనల్ని ఎవరైనా మాట అంటారనుకోండి, అదీ... మన చాటుగా అన్నారని మనకి తెలుస్తుంది. ఇక మన మనసు ఊరుకోదు. 'ఎందుకన్నారు? ఎందుకనాలి? ఇంతకాలంగా ఎవరూ ఏమీ అనలేదు కదా? ఇప్పుడెందుకు అనాలి?' అని ఇక ఒకటే మదనపడుతూ వుంటాం. సరిగా తినలేం. నిద్రపోలేం. ఏ పనీ చేయలేం. 'పోనీలే... మన ఎదురుగా ఏమీ అనలేదు కదా - ఎందుకు బాధపడటం?' అనుకోం. తెగ కలతపడి బాధ పడతాం.

మనతో సమానమైన స్థాయిలో వున్నవాళ్ళకి మనకన్నా ఎక్కువ గౌరవం, పేరు ప్రతిష్టలు వస్తాయనుకోండి! అనుకోకుండా మనం కలతపడ్తాం. ఇది అసూయ కాదు. కానీ, మనకి కూడా గుర్తింపు రావాలి కదా!

'ఎందుకు మనని గుర్తించరూ?' అనే తపన మనని కలత పెడ్తుంది. ఒక్కొక్కసారి ఎదుటి వారు మనల్ని నిర్లక్ష్యం చేస్తారు. ఎంతో ఉత్సాహంతో మనం కొందరి ఇళ్ళకో, సభలకో, సమావేశాలకో వెళ్తాం. తీరా అక్కడ మనకి ఎవరూ తెలియక ఒక ప్రక్క మౌనంగా కూర్చుని అనామకంగా వుండాల్సి వస్తుంది. నిజానికి దానివల్ల ఏమీ నష్టం ఉండదు. అయినా మనం కలత పడతాం. చిన్నబోతాం. అలాగే పెళ్ళిళ్ళలో విందు భోజనాలలో గుర్తింపులేని చోట్ల మనం అదొకరకంగా మనసు కలత పెట్టుకుంటాం. ఒక్కొక్కప్పుడు మనం ఎంతో శ్రమపడి చేసిన పనిని ఎవరూ ఆమోదించరు. అలాంటి సమయంలో తప్పకుండా కలతపడతాం.

ఇళ్ళల్లో ఒక్కొక్కసారి పెద్దవాళ్ళు చేసే పనులు తెల్సిపోతూ వుంటాయి. అప్పుడు పెద్దవాళ్ల మనస్సు ఎంత కలతపడ్తుందీ? నవ్వలేక, ఏడ్వలేక దిగులు పడిపోతారు. భర్త నిర్లక్ష్యం, అత్తగారి దెప్పిపొడుపులు, ఆడబడుచు వంకర చూపులు, ఇరుగుపొరుగు మూతి విరుపులు ఇలాంటివన్నీ కలతలు పెట్టే సంఘటనలే.

'ఇదేమిటయ్యా? ఇలా పాడుచేసేవ్? ఇంతకన్నా నేను చేసుకున్నా బాగుండేది' అని ఆఫీసర్ ఎన కొలీగ్ ఎదురుగా ఫైల్ విసిరికొట్టే మనసు కలత పడదా? ముఖ్యంగా యుక్తవయస్సులో వాళ్ళు మనసు కలత పెట్టుకుంటే త్వరగా కోలుకోలేరు.

దీనికి కారణమేమిటి? మనం ఒక భావాన్ని మనస్సులో నిలుపుకుంటాం. దానికి విరుద్ధంగా జరిగితే ఆ పరిస్థితికి అనుగుణంగా మారడానికి పడే అవస్థే ఈ కలతలు. నిండుగా వున్న నీటి కడవ తొణికిసలాడదు. అదే వెలితిగా వున్నప్పుడు బొళక్ బొళక్ మంటాయి నీళ్ళు. మనసెప్పుడూ నిండుగా, పుష్టిగా ఉంచుకోగల్గితే వెలితి వుండదు. కలత రాదు. మనిషి ఎదగాలి. చిన్న చిన్న తొణికిసలాటలు కలతలు నొక్కిపెట్టి నిండుతనం నింపుకోవాలి.






# ఆందోళన !

నిండుగా, ప్రశాంతంగా చెరువులో గానీ, నీటితొట్టిలో గానీ, గుంటలోకానీ ఒక రాయి విసిరినప్పుడు తరంగాలు వస్తాయని మనకి తెల్సు!

అయితే ఎందుకు వస్తాయి?

ప్రశాంతతకి భగ్నం కలిగి నీటి కదలిక చెదరి అల్లకల్లోలం వలన తరంగాలు ఏర్పడుతాయి.

అలాగే- మనిషి మనస్సు ప్రశాంతంగా, ఏ విధమైన చికాకులు లేకుండా వున్నప్పుడు అకస్మాత్తు అంతరాయం కలిగితే గుండె దడదడలాడుతుంది. శరీరమంతా కంపిస్తుంది. భయం, కంగారు లాంటివన్నీ కల్గుతాయి.

'ఏమిటీ... ఏమైందీ? అలావున్నావేం?' అని ఆ పరిస్థితిలో వున్నవాళ్ళని అడిగితే 'ఏమిటోగా వుంది!' అంటారు.

అదే ఆందోళన !

ఆందోళన ! అది చిత్ర విచిత్రంగా వుంటుంది.

ఎవరైనా ఒక తప్పు చేసేరనుకోండి - అది ఇతరులకి తెలిసిపోతున్న సమయంలో దాని ఫలితం ఎలా వుంటుందో తెలియని పరిస్థితిలో మనసు చాలా గజగజ లాడుతుంది.

ఇదొక రకమైన ఆందోళనే!

ఎవరికైనా ప్రమాదం సంభవిస్తుంది. వాళ్ళు ఎలా వున్నారో వివరంగా తెలియదు. అప్పుడు పడే మానసిక అవస్థని ఆందోళనే అంటారు!

మనకి ఒంట్లో బాగుండదు, కడుపులో త్రిప్పినట్టుగా, తల తిరుగుతున్నట్టుగా వుంటుంది. 'ఏమిటో... ఆందోళనగా వుంది' అంటాం! దొంగలు పడుతున్నప్పుడు, హత్యలు జరుగుతున్నప్పుడు ఏదైనా అత్యాచారపు వార్తలు విన్నప్పుడు ఆందోళన కల్గి 'ఎలా బాబూ?' అనుకుంటాం.

ముఖ్యంగా... ఒక విషయంగానీ, వార్తగానీ వినేముందు మానసిక భయం, ఆందోళన ఉంటుంది. ఆ తర్వాత మళ్ళీ వుండదు. అదెంతటి ప్రమాదమైనా, విచారకరమైనా మొదటవున్న ఆందోళన వుండదు. అంటే... కొత్త విషయం -అది ఎలాంటిదైనా సరే... వినబోయేముందు మనస్సు ఆ విషయాన్ని తనలో ఇముడ్చుకుందుకు, ఆయత్తపడడమే -అంటే... సిద్ధపడటమే ఆందోళన యొక్క అర్థం! ఆ తర్వాత తగ్గిపోవడం ఎందుకు జరుగుతోంది... అని ఆలోచిస్తే మనకి బాగా గ్రాహ్యకమవుతుంది. 'మేధ'కి కొత్త విషయం చేరి, మన నాడీ మండలం దాన్ని జీర్ణించుకుంది! కనుక ప్రకంపన తగ్గిపోతుంది.

రాయి చెరువులో పడిపోయాక తరంగాలు మెల్లగా తగ్గిపోతాయి. అదేవిధంగా మనిషికి కొత్తది, అందునా - నష్టమో, బాధో కల్గించేది అయితే ఆందోళన కల్గుతుంది.

ఒక మనిషి మరణవార్త వినేముందు మనకి ఆందోళన కల్గుతుంది. తర్వాత మెల్లమెల్లగా గా, మనం ఆ వార్తకి అలవాటైపోతాం. (ఎడ్జెస్టు అయిపోతాం)

అందుచేత - తుఫాన్ తర్వాత ప్రశాంతత ఎలా వుంటుందో... ఆందోళన తగ్గేక మానసిక స్థితి నెమ్మది నొందుతుంది. మనం కొద్దిగా నరాలని అదుపులో పెట్టుకోగల్గితే దేనికీ ఆందోళన పడం. మనస్సు మన ఆధీనంలో వుండి శరీరాన్ని రక్షిస్తుంది.

ఎంతటివార్తనైనా భరించగలవాడూ, దేనికీ ఆందోళన పడనివాడే... ధీమంతుడు.





# అల్లరంటే ?

సవ్యంగాలేని ఏ పనైనా అల్లరి కింద లెక్క! ఇక సవ్యంగా- అంటే... చక్కగా, సూటిగా, న్యాయంగా, మంచి పద్ధతిలో - ఇలా అనేక అర్థాలు చెప్పుకోవచ్చును. కాని అన్నింటి భావం ఒక్కటే. తాను సుఖంగా వుంటూ, ఇతరులకి కూడా మేలు చేయటం!

ఈ చివరి పదం దగ్గర ఆగి ఆలోచిస్తే 'అల్లరి' యొక్క భావం తెలుస్తుంది. ఇతరులకి మేలు చేయటం అంటే - లాభం, సుఖం, సంతోషం ఏదైనా కావచ్చును. అలా కాక - దానికి వ్యతిరేకంగా నష్టం, బాధ, విచారం కల్గిస్తే అది కీడుగా వక్రిస్తుంది. అదే అల్లరి!

చిన్న పిల్లల్ని మనం మందలించి బుద్ధులు చెప్తాం. 'ఇదిగో! చూడూ! నేను వచ్చేవరకు బుద్ధిగా చదువుకుంటూ వుండు, అల్లరి చేయకేం?' అంటాం. అలాగే 'చూడూ! మనం ఆంటీ వాళ్ళ ఇంటికి వెళుతున్నాం! అక్కడ నువ్వు ఏమీ అల్లరి చేయకూడదు, తెలిసిందా?' అనీ చెప్తాం.

స్కూల్లో ఎప్పుడూ వాడే మాట 'ఏయ్- పిల్లలూ... అల్లరి చేయకండి! నిశ్శబ్దంగా కూర్చోండి!' అని. 'అబ్బ! వాళ్ళ పిల్లలు బొత్తిగా అల్లరి పిల్లలండీ!'అంటుంటారు. 'మా పక్కవాళ్ళు అల్లరి వాళ్ళండి. వాళ్ళతో పడలేం!' అనుకుంటాం!

'ఇదిగో! ఈ పిల్లని ఎందుకు అల్లరి పెడ్తావు?' అని కుర్రాళ్ళని మందలిస్తాం! 'అమ్మో! అక్కడంతా అల్లరి మూక వుంటుంది. నేను వెళ్ళను బాబూ!' అని అమ్మాయి బెదురుతుంది.

ఇక -కాలేజీల్లో, ఉద్యమాల్లో, సభల్లో, విందువినోదాల్లో - అల్లర్లు జరిగాయని వింటూ వుంటాం! రాజకీయాల్లో సరేసరి! మత కలహాల్లో చెప్పనే అక్కర్లేదు!

ఈ విధంగా అల్లర్లని గురించి చెప్పుకుంటే -అవన్నీ ఇతరులకి నష్టమో, బాధో, మనస్తాపమో కల్గించేవే వుంటాయి. కనుక 'అల్లరి' అంటే మరొకర్ని వేధించటం అని అర్థం.

అయితే - సరస సల్లాపాల్లో, సంతోష సమయాల్లో కూడా 'అల్లరి' అనే పదప్రయోగం చేస్తుంటాం! గోపాలబాలుణ్ణి ఉద్దేశించి గోపికలు - 'నన్ను అల్లరి చేయకు కృష్ణా!' అని పాడుతారు. ఈ అల్లరిలో వేదన వుండదు. సిగ్గుతో ఉక్కిరి బిక్కిరి అవటమే ఇందులోని రసరమ్యత! అలాగే- చిన్నపిల్లలు ఇంట్లో తప్పటడుగులు వేస్తూనే, గంతులు వేస్తూనే, తల్లికి దొరకకుండా పరుగులు పెడ్తూ అల్లరి చేస్తారు. ఆ తల్లి విసుక్కుంటూ, ప్రాధేయపడుతూ, 'అల్లరి చేయకురా!' అంటూనే సంతోషిస్తూ వుంటుంది. ఇక్కడ పిల్లల మీద ప్రేమతో - త్వరగా దగ్గరికి రమ్మని పిలవటమే తప్ప - ఆమెకి కలిగే వేదన ఏమీ వుండదు!

కనుక- 'అల్లరి' అనేది సమయాన్ని బట్టి, సందర్భాన్ని బట్టి, ఎదుటి వ్యక్తుల్ని బట్టి వుంటుంది. ఏ అర్ధరాత్రో ఎవరో గట్టిగా గొంతెత్తి అరిచారనుకోండి. ఇరుగుపొరుగు వాళ్ళంతా అదిరిపోయి, బెదిరిపోయి పరిగెత్తుకు వస్తారు. అదే పగటిపూట- ఏ పండుగకో, వినోదంలోనో అరిస్తే ఎవరూ పరుగెత్తుకుని రారు. చూసి ఊరుకుంటారంతే !

'హోలీ' పండుగ నాడు రంగులు జల్లుకుని అందరూ ఎగిరి గంతులు వేస్తే, దాన్ని అల్లరి నుకోరు. అదే అల్లరి మరొకప్పుడు చేస్తే - (న్యూసెన్సు) అసభ్య ప్రవర్తన క్రింద పోలీసు రిపోర్టు ఇస్తాం. సభల్లో కావాలని కొందరు అల్లర్లు చేస్తారు. ప్రజలకి నష్టం కదా?

ఈ విధంగా అల్లరి కూడా అందమైనవి, అసభ్యమైనవి, అపశ్రుతి కల్గించేవి, హద్దుమీరేవి - రకరకాలుగా వుంటాయి! సరదాగా వుండే అల్లర్లు, ముద్దుగా మందలించుకోవచ్చును. కానీ... హద్దు మీరిన అల్లర్లు శిక్షార్హమైనవే!

బాధించే అల్లర్లు, వేధించే అల్లర్లు, ప్రజల్లో తగ్గినప్పుడు... మనసుని రంజింపచేయగల అల్లరి - సంతోషం కల్గించే అల్లరి మిగిలి వుంటాయి. అటువంటివి సెలయేటి వాగులా గలగల మంటుంటాయి. అవి జీవితానికి అవసరం కూడా! అల్లరి ఎప్పుడూ పన్నీటి చిలకరింపులా వుండాలి! బురదనీరు జల్లుకోవటంలా కాదు!





# బ్రహ్మచర్యమంటే ?

వివాహం కాకముందు పురుషుణ్ణి 'బ్రహ్మచారి' అని అంటారు. అయితే - కేవలం వివాహం కాకపోవటం మాత్రమే కాదు. ఏ విధమైన సంసారిక ప్రమేయం లేకపోవటం, ఆ విధమైన వాంఛలు లేకపోవటం- 'బ్రహ్మచర్యం' అని పిలువబడుతుంది.

ఇక్కడ వివాహం అయిందా, లేదా అని కాకుండా ఏ పురుషుడు వాంఛ (సంసారికమైన) లేకుండా వుంటాడో- వాడు బ్రహ్మచర్యం పాటిస్తున్నట్టు లెక్క! ఆ విధంగా చూసినట్లైతే ప్రతి బ్రహ్మచారి బ్రహ్మచర్యం పాటించకనూ పోవచ్చును. అలాగే - వివాహమైనా కూడా బ్రహ్మచర్యం పాటించేవాడూ వుండవచ్చును.

కనుక - బ్రహ్మచారే బ్రహ్మచర్యం పాటిస్తాడని గానీ, బ్రహ్మచర్యం పాటించేవాడే బ్రహ్మచారి అనిగానీ భావించక్కర్లేదు.

అసలు బ్రహ్మచర్యం అంటే - మానవుడు (స్త్రీ అయినా పురుషుడైనా) శారీరక వ్యామోహమైన (సంసారిక వాంఛ) లేకుండా నిగ్రహశక్తి కల్గి వుండడమే అని అర్థం! ఈవిధంగా ఎవ్వరైతే తన శక్తిని, తేజస్సుని, తన శరీరమందే - లయ మొనర్చుకుంటాడో వాడు సర్వశక్తి సమన్వయుడు కాగలడు. అందుకు వీరాంజనేయులు మనకి ప్రత్యక్ష నిదర్శనం.

ఏదైనా ఒక సాహసోపేతమైన కార్యం చేయాలన్నా, పవిత్రమైన దీక్ష, వ్రతం, జపతపాదులు చేయాలన్నా బ్రహ్మచర్యం పాటించాలని చెప్తారు.

దీనికి ముఖ్యమైనది మనో సంకల్పం. మనస్సు యొక్క చలనం మీదే అన్ని కోరికలు ఆధారపడి వుంటాయి. ఆ మనస్సుని మంచి అదుపులో వుంచుకోగల్గేవారికి ఏవిధమైన కోరికలు, వాంఛలు కలుగకుండా శరీరంలోని సర్వశక్తులు అధీనంలో వుంటాయి. ఇటువంటి శక్తిమంతులే ఏ ఘనకార్యమైనా చేయగలరు.

వీరజవానులు, యజ్ఞయాగాదులు చేసేవారు, పరిశోధకులు, కళాకారులు, దైవభక్తులు అన్య చింతలు లేకుండా ఏకాగ్రతతో వుండి ఆ కార్యదీక్షలోనే వుంటారు. ఒకవేళ వారి మనస్సు చలించి (అదే బ్రహ్మచర్యం ఉల్లంఘించి) ఇతర వాటిపైన దృష్టి నిలిస్తే ఆ కార్యం సాధించలేరు. బాహ్యానికి వ్రతాలు చేయటం కాక మనస్సుని అదుపులో వుంచుకోవాలి. కనుక శారీరక వాంఛ లేకపోవటం, చేపట్టిన కార్యం యందు దీక్షే... బ్రహ్మచర్యం అనబడుతుంది.

మేషరాశిలో సూర్యుడి వేడి తీవ్రంగా వుంటుంది. ఆ రాశిలో వున్నప్పుడు సూర్యుడు భూమి మీదున్న జలరాశిని ఆవిరి రూపంలో ఆకాశానికి చేరుస్తాడు.

అదేవిధంగా - మానవుడు 'బ్రహ్మచర్యం' అనే దీక్షా సమయంలో అతని శక్తి అంతా పైకి చేరుకుని సహస్రారాన్ని సందర్శిస్తుంది. తిరిగి అది ఆజ్ఞా చక్రానికి దిగి కన్నుల ద్వారా బాహ్యాన్ని, దైవాన్ని కనుగొంటుంది.

అజ్ఞానం వల్ల అహంకారం వల్ల మానవుడు తన శక్తి సామర్థ్యాలని వృథా చేసుకుంటున్నాడు. అందువల్ల బలహీనుడు నిర్వీర్యుడై తనని తాను తెలుసుకోలేక దిగజారిపోతున్నాడు. అందుకే ఈనాటి సమాజంలోని యువత దుర్బలులై (మానసికంగా) ఏదీ సాధించలేకపోతున్నారు. ప్రకృతిలోని సంపద ెలా వినియోగపరుచుకుంటున్నాడో - అలాగే తనలోని శక్తిని సద్వినియోగం చేసుకుంటే మానవుడు ైవ సమానుడవుతాడు.





# సంసార స్మరణ!

సం సారం అంటే అందరికీ తెలుసు. స్మరణ అన్నా తెలుసు. కానీ- వాటిలో గూడార్థం ఎందరు గ్రహిస్తున్నారు?

'సంసారం' అంటే... కుటుంబం అనీ, భార్య పిల్లలు, తల్లీ తండ్రీ మొదలైన సభ్యులతో కలసి వున్నదాన్నే సంసారం అంటారు. నిజమే కానీ, 'సం . . సారం' అంటే మంచి రసాన్ని లేదా సారాన్ని గ్రోలడం అని నిగూడార్థం. అలాగే- స్మరణ అంటే తలుచుకోవటం స్మరించటం అనుకుంటాం. ఊహూ! మరొక అర్థం వెతకండి.

స్మరణలో 'స' అనే పదాన్ని తీసేస్తే మరణమే మిగులుతుంది. అంటే - బాహ్య వస్తువులను స్మరిస్తున్నాం.

"యదృశ్యం తన్నశ్యం" అన్నారు పెద్దలు.

అంటే... మన దృష్టికి కనిపించే దృశ్యం నశించి పోయేటటువంటిది కనుక ఇప్పుడు సంసార స్మరణలోని అర్థాలని యథతథంగా గ్రహిస్తే కుటుంబ పోషణ, ఆత్మీయుల సంరక్షణ, నిరంతరం వార్ని గురించిన తాపత్రయమే సంసార స్మరణ అని తెలుస్తుంది.

కానీ, అంతరంగా వున్న తాత్పర్యం ఏమంటే... మంచిసారాన్ని గ్రోలి దృష్టికి కనిపించే దృశ్యాలని మరిచిపోవాలని భావం. అంతేగానీ, మంచిసారం నశించిపోతుంది అనే విపరీతార్థం తీసుకోరాదు.

'సంసారం' అంటే ప్రపంచం అని కూడా అర్థం. కనుక మనం నిత్యం ఈ సంసార కూపంలో పడి అసలు సారాన్ని గ్రహించకుండా బాధలు, బెంగలు, వ్యామోహాలు పెంచుకుని కంటికి కనిపించేవన్నీ సత్యమనీ వాటికోసం పరుగులెత్తుతాము.

నిత్యమైనదీ, సత్యమైనదీ, నిత్యనూతనమైనదీ మనం తెలుసుకోలేం.

ఇంకా విచిత్రమేమంటే - ఎన్ని బాధలు పడుతున్నా సంసారం మీద మక్కువ పెరుగుతుందే తప్ప తరగదు.

దీనికి ఉదాహరణగా ఓ చిన్నకథ వుంది.

బాటసారి ఒకడు అడవిలో వెళుతూవుంటే పెద్దపులి ఒకటి అతనికి కనిపించి తరుముకు రాసాగింది. అతను పరుగెత్తుకు వెళ్ళి ఒక పాడుబడ్డ బావిలో పడ్డాడు. కానీ -నీటిలో పడిపోడు. ఒక చెట్టుకొమ్మకి తగులుకుని వ్రేలాడుతాడు. కొమ్మలకి ఎలుకలు వుండి కొమ్మను కొరికేస్తుంటాయి. ఆ చెట్టుకున్న తేనె పట్టునుంచి తేనె బొట్లు బొట్లుగా కారుతూ వుంటుంది. అది అతని నోట్లో పడ్తూ వుంటుంది. ఇంతలో దేవాదిదేవతలు ఆకాశమార్గాన వెళుతో 'మాతో వస్తావా? కైలాసానికి తీసుకెళతాం' అంటారు. అప్పుడు అతను 'తేనె గ్రోలుతున్నాను. బాగుంది. తర్వాత వస్తా'నని బదులు పలుకుతాడు.

బావిలో అడుగున పాము వుంటుంది. పైన చూస్తే పులి వుంటుంది. అయినా 'తేనె త్రాగుతాను' అంటాడు బాటసారి.

ఎంత విచిత్రం!!?

బాటసారే మానవుడు. అడవి అంటే సంసారం. పెద్దపులే ముసలితనం. కొమ్మలు ఆయుర్దాయం. ఎలుకలు రాత్రింపగళ్ళు. తేనె విషయవాంఛలు. దేవతలు పుణ్యాలు, మంచిపనులు. క్రిందవున్న సర్పం మృత్యువు.

తేనె త్రాగడమంటే సంసార తాపత్రయంలోని భాగాలు.

మానవుడు ఇన్ని విధాల సతమతమవుతున్నా 'మంచి పనులు చేసి గట్టు చేరుదాం' అని కానీ, తోటివారికి చేయూత నిద్దామని కానీ అనుకోడు. కనుక సంసారంలోని సారం (జీవితంలోని అర్థం) గ్రహించి భోగాలే ముఖ్యం కాదని తెలిసి, మానవతా దృక్పథంతో చరితార్థుడు కావాలన్నదే సంసార స్మరణ యొక్క అంతరార్థం.






# శుభ్రతంటే ?

శుచీ, శుభ్రత- అనే రెండు మాటలు నిత్యం మనం ఆచరించే దినచర్యల్లోని అంతర్భాగాలు. మనిషి తనకి తెలియకుండానే శుభ్రతని పాటిస్తూ వుంటాడు. ఇది మొదటి అవాటు అయితే అసంకల్పిత చర్యగా మనిషిని వదలకుండా వెంటే వస్తుంది.

ఉదయం నిద్ర లేవగానే ముఖం కడుక్కోటం, స్నానం చేయటం లాంటి నిత్యకృత్యాలన్నీ శుభ్రతని నిరూపించటమే. నిన్నటి నుంచి నేటిలోకి వస్తున్న మనిషి తిరిగి కొత్తగా పనులు ప్రారంభిస్తాడు. కొత్తపనులు మొదలు పెట్టటమంటే పాతని పక్కకి జరిపి కొత్తగా శుభ్రంగా చేయటం అని అర్థం. ప్రతిరోజు మనం చేసే దినచర్యలో ఈ 'పాత'- అంటే... 'మురికి'ని పక్కకి త్రోసి . . . కొత్తగా -అంటే... శుభ్రంగా తయారవుతుంటాం.

ప్రాంగణమంతా తుడిచి, నీళ్ళు జల్లి, రంగవల్లులు తీర్చిదిద్దుతారు. తర్వాత పాత్రలు శుభ్రం చేయటం, ఇళ్ళు తుడుచుకోవడం, సామాన్ల మీద దుమ్ము దులపటం లాంటి అన్ని పనులలో శుభ్రత యొక్క ప్రాముఖ్యతే కనిపిస్తుంది. మనిషి తినే తిండి నుంచి, వేసుకునే దుస్తులు, అలంకరణ, ఇంటిని సర్దుకోవటం, ఇలా ప్రతి పనిలో నిన్నటి పాతని చెరిపేసి, నేటి కొత్తని సంతరించుకోవటమే శుభ్రత యొక్క అర్థం.

కొందరు శుభ్రం పట్ల అతి చూపిస్తారు. ఏ బీరువానో లేక పుస్తకాల షెల్ఫో తీసి శుభ్రం చేయాలని మొదలు పెడ్తారు. ప్రతి అరలో అంగుళం - అంగుళం గుడ్డ పెట్టి తుడిచి, ఓపిక వుంటే సర్ఫులో

ముంచిన బట్టతో కడిగినంత పనిచేసి ఒక పూటంతా మిగతా పనులు ఆపేసి 'శుభ్రత' అన్న పని అతిగా చేస్తుంటారు. నిజానికది శుభ్రం చేసుకోవటం కాదు -ఛాదస్తం అనిపించు కుంటుంది. అలాగే... ప్రతిరోజు కొందరు ఇల్లంతా మూల మూల నుంచి తడిబట్ట పెట్టి తుడిపిస్తూ వుంటారు. ఆ చేయటంలో సామాన్లన్నీ ఇష్టం వచ్చినట్లు పరుచుకుంటారు. పొందిక వుండదు. ఇల్లు శుభ్రమే గాని వస్తువుల అమరిక సరిగా లేకపోతే శుభ్రం రాణించదు.

బట్టలు ఉతికేటప్పుడూ, పప్పుదినుసులు బాగు చేసుకునేటప్పుడూ అక్కర్లేని శుభ్రం పాటించి అలసిపోతుంటారు కొందరు. ఎప్పుడూ నీటుగా, గోటుగా వుండేవాళ్లు బట్టల శుభ్రమే చూసుకుంటారు. భోజనప్రియులు తినే పదార్థాలు, కూర్చునే స్థలం బాగా చూసుకుంటారు. నిద్రా లోలులు పక్క శుభ్రం, అలంకరణ ప్రియులు శరీర శుభ్రం చూసుకుంటారు.

ఇలా - ఎవరికి ఇష్టమైన విషయం వారు ప్రత్యేక దృష్టితో చూసుకుని, అదే జీవిత లక్ష్యంగా భావించుకుని మిగతావారిని నిర్లక్ష్యం చేయటం జరుగుతుంటుంది.

అయితే -ఉమ్మడి ప్రదేశాలైన రోడ్లు, బస్టాండ్లు, రైల్వే ప్లాటుఫారాలు, సినిమాథియేటర్లు, హోటళ్ళు, స్కూళ్ళు, కాలేజీలు, పార్కులు వీటి మాటేమిటి? ఎవరూ ప్రత్యేకించి పట్టించుకోని ఆ ప్రదేశాలు మనకి ప్రతిరోజూ అవసరమయ్యే స్థలాలు కదా?

శుభ్రత అంటే ఎంతసేపూ ఇల్లు, ఒళ్ళు చూసుకోవటం కాదు. ఇది బాహ్య శుభ్రం మాత్రమే. కానీ- అంత:శుద్ధి వుండాలి. హృదయ నైర్మల్యమే అసలైన శుభ్రత. మనసు నిర్మలంగా, కల్మషం ంపుకోకుండా, స్వచ్ఛంగా వుంచుకుంటే భగవంతుని బోధ గ్రహించిన వారమవుతాం. బాహ్యశుద్ధి అంత:శుద్ధి కూడా ముఖ్యమే. మనసు మురికి వదిలించుకుని మానవ జన్మ సార్థకం చేసుకుందాం!!





# అనుగ్రహం

సమాజంలో మనిషికీ, మనిషికీ కొన్ని సంబంధాలు విచిత్రంగా వుంటాయి. మంచి కావచ్చును, చెడు కావచ్చును. ఇలాంటి పరస్పర సంబంధ, సహకారాలలో కొన్ని మంచిని, ఎంతో మేలు చేస్తాయి. కొన్ని చెడ్డని, చాలా బాధిస్తాయి.

'ఏమిటి? చాలా సంతోషంగా వున్నావు? నువ్వు కోరుకున్నదేమైనా జరిగిందా?' అనో, 'విశేషమేమైనా వుందా?' అనో అడుగుతారు కొందరు.' నేను ఫలానా చోటుకి వెళ్ళడానికి మా నాన్న ఒప్పుకున్నారు'. అని ఎదుటివాళ్ళు సంతోషంగా చెప్తారు. 'నిజంగానే!' అని ఆశ్చర్యపోతారు. అంటే ఒప్పుకోవటమనేది చాలా కష్టమైనప్పుడు, అది గనక జరిగితే దానినే 'అనుగ్రహం'గా భావిస్తాం.

ఎంతో శ్రమపడి ఒకరిచేత 'సరే' అనిపించుకోవటమో, మనకి కావల్సిన వస్తు సముదాయాన్ని సేకరించటమో లేదా మనం కోరిన పని నెరవేర్చుకోవటమో జరిగితే అప్పుడు వారి అనుగ్రహం వల్ల జరిగిందని చెప్పుకుంటాం.

కొందరు చాలా కఠినంగా వుంటారు. వారివల్ల ఇతరులకి ఏ పనీ సాధ్యం కాదు. ఒకవేళ వారు మనకి ఏ అంగీకారమో తెల్పి, మనకి సహాయపడితే 'హమ్మయ్య ! వారి 'అనుగ్రహం' దొరికింది. ఇంకా ఫర్వాలేదు' అని చెప్తాం.

సాధారణంగా జరిగిపోయే విషయాలకి 'అనుగ్రహం' అని చెప్పం. కఠినుడు లేదా దుస్సాధ్యమైనది సాధ్యమైనప్పుడు మాత్రమే అనుగ్రహించేరని చెప్తాం.

ఆగ్రహం వల్ల ఎంత నష్టం వుంటుందో, అనుగ్రహం వల్ల అంత మంచి వుంటుంది. మంట లాంటిది ఆగ్రహం అయితే చల్లని మంచులాంటిది అనుగ్రహం.

మంత్రిగారు ఫలానా బిల్లు 'పాసు' చేసారంటే మంత్రిగారి అనుగ్రహం వల్ల మనకి లాభం కల్గిందని ప్రజలు సంతోషిస్తారు. 'ఆవిడ చండశాసనురాలు. ఆవిడే అనుగ్రహిస్తే ఇంక చెప్పేదేముం'దని ఆఫీసులో స్టాఫ్ ఒక్కొక్కప్పుడు అనుకోకుండా జరిగిన మంచిని తల్చుకుంటారు.

ఎన్నాళ్ళనుంచో జరగని కొన్ని పనులు ప్రభుత్వం వారు పూనుకొని చేస్తే 'ఇన్నాళ్ళకి ప్రభుత్వం వారికి అనుగ్రహం కల్గింది ప్రజలమీద. రోడ్లూ, లైట్లు బాగుపడ్తున్నాయి' అనుకుంటారు.

ఇంటి యజమాని ఎప్పుడూ అద్దె తీసుకోవటమే తప్ప, అద్దె వాళ్ళ బాధలు పట్టించుకోకుండా వుండి ఎప్పుడో ఒకసారి అకస్మాత్తుగా ఇంటికి సున్నాలు, రంగులు, బాగు చేయటాలు చేస్తే 'అమ్మో! మా ఇంటి ఆసామికి ఇన్నాళ్ళకి అద్దెవాళ్ళమీద అనుగ్రహం కల్గిం'దని చెప్తాం. ఎప్పుడూ సెలవలు ఇవ్వని ఆఫీసర్ 'సరే సెలవు తీసుకో' అంటే 'అమ్మయ్యో... గురుడు అనుగ్రహించేడోయ్' అని రెచ్చి పోతారు. 'ఇవాళ హోంవర్క్ అక్కర్లే'దని స్ట్రిక్ట్ సార్ అంటే 'అబ్బా! మేష్టారుకి మనమీద అనుగ్రహం కల్గిందిరా!' అనుకుంటారు.

ఇలా-అనుకోకుండా గానీ, బ్రతిమాలుకుని వేడుకున్నా గానీ, మనం పని సాధించగల్గినా, లేక మనకి సంతోషం కల్గినా దానిని ఎదుటివాళ్ళ అనుగ్రహంగా భావిస్తాం.

ఒక్కోసారి చాలాకష్టాలు పడేవాడికి, అనుకోకుండా ఆర్థికంగా బాగుపడే అవకాశం కల్గుతుంది. లాగే సమస్యలు పరిష్కారమవుతాయి. 'భగవంతుడికి ఇన్నాళ్ళకి నా మీద అనుగ్రహం కల్గిం'దని ·డు దండం పెట్టుకుంటాడు.

'పరీక్ష పాసయ్యేలాగా అనుగ్రహించు తండ్రి', 'నాకు ప్రమోషన్ వచ్చేలా అనుగ్రహించు తండ్రి', 'నేనుకోరేది నెరవేరేలాగ అనుగ్రహించు తల్లి' అని భగవంతుణ్ణి ప్రార్థిస్తారు సామాన్యులు. 'నన్ను అనుగ్రహించి ఈ సంసారం సాగరం నుంచి నన్ను తరింపచేయి భగవాన్' అని భక్తులు, జ్ఞానులు వేడుకుంటారు. ఇహలోకసుఖాలు సామాన్యులవి. పరలోకభాగ్యం భక్తులు, భాగవతోత్తములు కోరేవి. వారు భగవంతుడి అనుగ్రహాన్నే కోరుతారు తప్ప మనుషుల ప్రాపకం కోసం ప్రాకులాడరు.





# మనస్సు!

మనిషి అంటే కేవలం రూపం మాత్రమే కాదు. అరిషడ్వర్గాలు, పంచేంద్రియాలు, త్రిగుణాలు మొదలైన సర్వవిధ చర్యలకు నిలయం. ఆలయంలో మనస్సు ఆధిపత్యం వహించి మనిషిని నడిపిస్తుంటుంది. మనిషి జీవితం యావత్తు మనస్సుతో ముడిపడి వుంటుంది. అందుకే 'మనిషి' అంటే 'మనస్సు' యొక్క ప్రతిబింబం.

సర్వకాల సర్వావస్థల యందు మనిషిని నడిపించేది ఈ మనస్సే. కోపం, దు:ఖం, సంతోషం, విచారం, ప్రేమ, కఠినం ఇత్యాది సమస్త చర్యలకు మనస్సే ప్రధానం. ఈ మనస్సు కేంద్ర బిందువుగా మనిషి జీవితంలోని ప్రతి సంఘటనకి కారణమవుతుంది.

ఈ మనస్సు అతి చిత్రమైనది. మనిషిని మంచిగా నడిపించగలదు. చెడువైపు మళ్ళించగలదు.

భగవద్గీతలో కృష్ణపరమాత్మ 'ఈ మనస్సే మనిషికి ప్రధాన శత్రువనీ అదే మిత్రుడనీ' అర్జునుడికి ఉపదేశించాడు. ఎవరు మనస్సుని అరికట్టగల్గి, కోరికలకి అతీతమై, మానవతా విలువల్ని పెంచుకోగల్గుతాడో వాడికి మనస్సు మిత్రువు.

ఎవరు మనస్సుకి వశమై కోరికలవైపు పరిగెడ్తూ, మనిషి జన్మని నిరర్ధకం చేసుకుంటాడో వాడికి మనస్సే శత్రువు.

పురాణాది ఇతిహాసాలలో వర్ణించే ఇంద్రుడు నిజానికి మన మనస్సే. మంచి పనులు చేయాలని సంకల్పించే మునులు, ఋషుల్ని భంగపరచాలనుకునే ఇంద్రుడు, అంటే... మనస్సు మనలోని ప్రతికూలత అన్నమాట. ఏదైనా మంచి తలంపు కల్గి చేయాలనుకుంటే 'ఎందుకు? మనకే ఆ లాభం వచ్చేలా చూసుకుందాం' అని వెంటనే చెడు ఆలోచన రావటం సహజం. ఎలాగైతే మహా ఋషులు ఎదిరించరో అలాగే మనం చెడు ఆలోచనల్ని పక్కకి తోసి లొంగకుండా మంచి తలంపునే అమలు చేస్తే మనం మహాఋషులమే. ఇంద్రుడి ఆటలకి లొంగనివారమే.

కొందరు చక్కగా, హాయిగా మాట్లాడుతారు. కానీ -ఎదుటివారికి ఉపకారం చేయరు. వీరి మనసు నిగూఢమైనది. పైకి నటన, లోపల విషం. మరికొందరు దురుసుగా, పెళుసుగా మాట్లాడుతారు. కానీ- చీమకి కూడా హాని చేయలేరు. అంటే... మనస్సు మంచిదే. కొద్ది ప్రయత్నం చేస్తే మాట కూడా సాత్వికంగా వుంటుంది.

ప్రేమికులకి ఈ మనస్సు- చెప్పిన మాట వినదు. అంటే... మనస్సుకి లొంగిపోయి వీళ్ళు నానా వేదన పడతారు. ప్రేమ సఫలమైతే సరే, లేకపోతే జీవితాంతం విరహతాపం, విచారంతో నిర్జీవంగా తయారవుతారు.

భక్తాగ్రేసరులు ఈ మనస్సుని వేడుకుని 'మాకు భగవత్‌దర్శనం కావాలి. ప్రాపంచిక చింతల పైకి మళ్ళించకు' అంటూ మనసుపైన అనేక గానాలు ఆలపించేరు.

'కొంతమందిని చూస్తుంటే వారి ఆంతర్యం ఏమిటో బోధపడదు' అంటూ వుంటాం. నిజమే... మనస్సు యొక్క 'నెగిటివ్' బయటికి కనిపిస్తే ప్రపంచం తల్లక్రిందులైపోతుంది. మనిషిని చూడగానే వాడి మనస్సు తెలిసి ఎదుటివాడు తిరగబడటమో, జాగ్రత్తపడటమో పారిపోవటమో చేయడూ?

తామస, రాజస, సాత్త్విక గుణాలు... ఈ మనస్సు చేసే పనివల్లే ప్రస్ఫుటమవుతాయి.

మనస్సుని అదుపులో వుంచుకోగల్గేవాడు బుద్ధిమంతుడు. బుద్ధిని ఉపయోగించి మనస్సుకి కళ్ళేలు బిగించగల్గితే పార్థసారధి ప్రవచనం మనం గ్రహించినట్లే. గీతా ప్రబోధని మనం ఆచరించి సర్వజన సుఖాన్ని కోరుదాం !!



# ఆశ - ఆశయం!

మనిషి మనుగడకి ఒక దారి, ఒక ధ్యేయం వుంటుంది. ప్రతిరోజు లేవటం, కాలకృత్యాలు తీర్చుకోవటం, భోజనం చేయటం, పనులు చూసుకోవటం... నిద్రపోవటం, ఇదే జీవితం కాదుగదా? ఒక్కొక్క మనిషికి ఒక్కొక్క రకం ఆలోచన, బుద్ధి వుంటుంది. అది నెరవేర్చు కుందుకే మనిషి ఆరాటం పడుతూ జీవనం సాగిస్తూ వుంటారు. ఇదే 'ఆశ' అనొచ్చును.

ఈ 'ఆశ' మనిషిని తన వెంట పరిగెత్తిస్తుంటుంది. అది అందుకునే వరకు మానవుడి పరుగు. ఆ గాడిలోనే సాగుతుంది. పక్కలకి చూడటానికీ, ఆగి ఆలోచించటానికీ మనిషికి తీరిక వుండదు

ఈ 'గాడి' దాటుకుని 'తను' అన్న పదం పక్కకి జరిపి ఇతరుల మీద దృష్టి నిలిపి వారికోస ఏదో చేయాలనీ, వారి సుఖం కోసమే శ్రమించాలనే యోచన వుంటే అది 'ఆశయం' అంటారు.

'ఆశ' పరిధి తనూ, తనవారికే పరిమితమై చిన్నగా, సామాన్యంగా వుంటుంది. తన ఇంటి ఆవరణకి మాత్రమే సంబంధించి వుంటుంది. 'ఆశయం' పరిధి తన చుట్టూ వారిని ఆదరించి, పెద్దగా ఉన్నతంగా వుంటుంది. తన ఇంటి ఆవరణ దాటుకుని, విశాలంగా విస్తరించి వుంటుంది.

ఆశ కోసం సామాన్య మానవుడు నిరంతరం కష్టపడుతూ, పిల్లల చదువులు, పెళ్ళిళ్ళూ, ఆస్తులు, అంతస్తులు, నోములు, వ్రతాలు, పండుగలు, పబ్బాలు, విందు భోజనాలు, పేరు ప్రతిష్ఠలు... ఇలా ఆ మనిషి సంసార తాపత్రయంలో మునిగిపోయి సంకుచితమైపోతాడు. సర్వసాధారణంగా నూటికి

తొంబై తొమ్మిది మంది ఇలాంటివారే. మిగిలిన ఆ ఒక్కడు ఆశయ సిద్ధి కోసం జీవితాన్ని గడుపుతాడు. వ్యక్తిగతమైన సుఖాపేక్ష అతను కోరడు. స్వజనాపేక్ష అతనికి వుండదు. అతని హృదయంలో పదిమందికీ ఉపయుక్తమైన కార్యం పట్ల శ్రద్ధ, లక్ష్యం వుంటుంది. స్వతంత్ర సమర యోధులు, ధర్మశాలలు కట్టించేవారూ, పాఠశాలలు ఉద్ధరించేవారు, దేవాలయాలు, శరణాలయాలు నిర్మించేవారూ, ఆశయాల కోసం జీవించేవారూ... ఈ కోవకి చెందుతారు.

మతగురువుల ఆశయం- భగవంతుని ప్రబోధని ప్రజలకి అందించటం. మహాత్మా గాంధీకి భారతదేశాన్ని, ప్రజలనీ స్వతంత్రుల్ని చేయాలనే ఆశయం, మదర్ థెరిసాకి అనాథులకి సేవ చేయాలనే ఆశయం.

ఇలాంటి ఆశయాల వల్ల లోక కళ్యాణం జరుగుతుంది. గొప్ప గొప్ప ఆశయాలు అందరికీ కలగకపోవచ్చును. కానీ, ప్రతివారు తను ఆశని కొద్దిగా తగ్గించుకుని పరహితువుని కూడా కోరుకుంటే ఆశయాల ఆవరణలోకి రాగల్గుతారు. మన బాధ్యతల్లో కొద్దిగా శ్రద్ధ, నిజాయితీ చూపించగల్గేవాళ్ళు 'ఆశ' పరిధి దాటినవారే. నర్సులు, కాంపౌండర్లు, డాక్టర్లు కొద్దిగా శాంతం, నీతి, నిజాయితీగా వుంటే పేషంట్ల రోగాలు సగం తగ్గుతాయి. ఇంజనీర్లు స్వార్థం తగ్గించుకుంటే ఇళ్ళు, భవనాలు, బ్రిడ్జీలు చాలాకాలం పటిష్టంగా వుంటాయి. ఉపాధ్యాయులు శ్రద్ధగా పాఠాలు చెప్తే విద్యార్థులు ట్యూషన్ల అవసరం లేకుండా ప్యాసవుతారు. న్యాయవాదులు అబద్ధపు సాక్ష్యాలు చెప్పి, ధనార్జనకి ఆశ పడకుండా వుంటే నేరస్థులు అంతా శిక్షార్హులే అవుతారు. రక్షణశాఖ నిజంగా రక్షణే ధర్మంగా భావిస్తే దేశంలో ఇన్నేసి మానభంగాలు, హత్యలు జరగవు. ఎవరి బాధ్యతలు వాళ్ళు సక్రమంగా నిర్వహిస్తే 'ఆశ' పరిధి తగ్గి 'ఆశయం' రూపు దాల్చుతుంది. ప్రత్యేకించి ఆశయాలు సామాన్యులకి వుండకపోయినా ఆశ నుంచి ఆశయంలోకి పయనిస్తే చాలు !!

* * * * *




# లౌకిక విద్యంటే ?

మానవుడు ఈ భూమి మీద జన్మించిన క్షణం నుంచి వాడి (ఆమె) భవిష్యత్తు ఎలా సాగాలో, సాగించాలో తల్లిదండ్రులు కలలు కంటూనే వుంటారు. ప్రతి మనిషికి వాడి (ఆమె)కంటూ నిర్ణయమైన జీవితం వుండనే వుంటుంది. అయినా- మనం మనకోసం, మన ఆత్మీయుల కోసం ఏం చేయాలో, ఎలా చేయాలో యోచిస్తూనే వుంటాం. ఇది సహజం. అనివార్యం కూడా! 'బుద్ధి' జరగబోయే జీవిత ప్రయాణానికి చుక్కాని వంటిది. డ్రైవర్ స్టీరింగ్ తిప్పితే కార్లు, వాహనాలు కదిలినట్టుగా ఈ బుద్ధి ప్రతివాళ్ళకి మార్గం చూపుతుంది. ఇక మార్గమనేది మన కర్మ ఫలితం మీద వుంటుంది. ఈ కర్మే మన జీవితపు బాట. ప్రతివాడికి వాడి మార్గం వాడికుంటుంది.

అయితే- ఇహానికి సంబంధించిన కోరికలు, ఆలోచనలు లౌకికమైనవి. కర్మను బట్టి ఆ బుద్ధి, పనులు జరిగినా కొంత ప్రయత్నం మీద లౌకికమైన దాంట్లో కూడా ఆముష్మికం (పరమ పదమైన) కూడా పొందవచ్చును.

ఇక - లౌకిక విద్యలు, అంటే... ఈనాడు మన సమాజంలో వున్న అనేక ఉద్యోగాలు బ్రతుకు తెరువు మార్గాలు అన్నీ లౌకికమైనవే.

మరైతే ఈ ఉద్యోగాలు, వృత్తులు లేకుండా, చేయకుండా, బ్రతకటమెలా? అనే సమస్య కలగటం సహజం.

ప్రతి ఉద్యోగంలో లేదా విద్యలో, బ్రతుకుతెరువులో డబ్బు సంపాదించటం, కీర్తి ప్రతిష్టలు పెంచుకోవటం, గౌరవ హోదాలు నిలబెట్టుకోవాలనుకోవటం ఈనాడు మనవాళ్ళు చేస్తున్నారు.

ఈ తపన తగ్గితే అది లౌకిక దశ దాటుతుంది. ఆ తర్వాత మన వృత్తిలో కానీ, విద్యా ప్రదర్శనలో కానీ పరోపకారం, పరమాత్మ దర్శనం ప్రతిక్షేపించుకోగల్గితే అది పరమార్థమై ముక్తి ప్రదమవుతుంది. అందుకు ముఖ్యమైనది అంత:కరణ శుద్ధి.

మ్యాజిక్‌లు, మంత్రాలు, తంత్రాలు మొదలైనవి వేదికమీద ప్రదర్శించే అనేక రకాల విద్యలు. మనం ఇంజనీరింగ్, డాక్టర్, కంట్రాక్టర్ , వ్యాపారతంత్రం (ఎం.బి.ఏ) లాంటి అనేక పెద్ద చదువుల కోసం, తద్వారా ఉద్యోగాల కోసం ప్రాకులాడుతాం. అదేదో చాలా పెద్ద గొప్పగా భావిస్తాం. కానీ- నిజానికి ఈ విద్యల్లో అంత:కరణ శుద్ధి తక్కువ. ఆత్మ విమర్శన చేసుకునేందుకు కూడా మానవుడు సమయాన్ని వినియోగించడు. నటన, ప్రకటనల సంస్థలు కూడా లౌకికమైనవే. కీర్తి ప్రతిష్టలకీ, ధన సంపాదనకే వెంపర్లాడించే విద్యలు ఇవి. అయితే -ఇక ప్రపంచంలో వున్నవన్నీ లౌకిక విద్యలేగదా? అనుకోవచ్చును. నిజమే కానీ, ప్రతివిద్యలో (వృత్తిలో) కొద్దిగానైనా అంత:కరణ శుద్ధి అంటే... నేను న్యాయంగా చేస్తున్నానా? ఇందులో ధర్మం వుందా? ఈ సాధన ద్వారా నేను బ్రతుకు బాటలో తరించగలనా?' అనే ఆత్మవిమర్శ వుంటే లౌకికాన్ని కూడా ధర్మపథంలోకి మార్చుకోగలడు.

వీధిలో దొమ్మరి ఆటకీ, అదే వీధిలో హార్మోణి వాయిస్తూ గానం చేస్తూ సంపాదించేవాడికీ తేడా వుంది. మొదటివాడి విద్య యుక్తి రెండోవాడి విద్య రక్తి. ఈ రెండో సాధనలో మనసుకి రంజన, తద్వారా రంజన అందిస్తున్నాడు. అలాగే - కంట్రాక్టర్లు, ఇంజనీర్లు, డాక్టర్లు, యాక్టర్లు, వ్యాపారస్థులు తమ వృత్తిధర్మంలో ఇతరులకి మేలుచేసేవి నూటికి యాభై చేసినా కొంత మేలే! కుప్పిగంతుల ప్రదర్శన కన్నా కూచిపూడి నాట్యంలో అర్థం, పరమార్థం వుంటుంది గదా? గొంతు చించుకునే కోరస్ పాటల కన్నా తాదాత్మ్యం చెందే పాట నిదానంగా పాడితే మనసు పరవశిస్తుంది కదా?

ఇలాగే పత్రికలు, సంస్థలు కీర్తికోసం, డబ్బు కోసం కాక, కొంతలో కొంత ప్రజాహితవు కోసం పాకులాడితే లౌకికం కూడా ఆధ్యాత్మయోగం అవుతుంది.





# క్రాంతి పథం!

కాంతి పథానికీ, క్రాంతి పథానికీ తేడా వుంది. నల్గురు మెచ్చేదారీ, నల్గురికీ చూపేదారీ కాంతిపథం! అనగా వెలుగుదారి. అయితే... క్రాంతిపథం అన్నా ఆదర్శమైన బాటే కానీ అది కొంత విప్లవంతో కూడినది!! నెమ్మదిగానూ, శాంతియుతంగానూ చేసే మంచిపని 'కాంతిపథం' అవుతుంది. అలా సాగనప్పుడు కొంత ఉద్రేకం, పౌరుషం చూసి ఒక కొత్తదారిని చూపటం క్రాంతి పథం అవుతుంది.

అన్యాయం ఎదుర్కొనే వాళ్ళూ, హక్కులు, బాధ్యతలు తెలుసుకుని వాటిని అమ జరిపేవాళ్ళూ, కొంత సంఘటిత శక్తి చూపించాల్సి వస్తుంది. అలా చూపించి వెలుగుదారిన నడవ క్రాంతిపథం!

మెల్లగా చెప్పటం, గట్టిగా హెచ్చరించటం లాంటివి ఈ క్రాంతిపథం, కాంతిపథంలోని తేడాలు.

చంద్రుని వెలుగు చల్లదనాన్నిస్తుంది. హాయిని గొల్పుతుంది. నిజమే! కానీ, సూర్యరశ్మిలో తేజస్సు మానవుడి జీవిత గమనానికి దోహదం చేస్తుంది! కనుక ఒక్కోసారి 'క్రాంతి' అవసరమే! ఇదే ధోరణిలో ఆలోచిస్తే, 'సంక్రాంతి' అంటే సరి అయిన పథంలో వెలుగులు చిమ్మటం.

పంటలు పండి, ధాన్యం రావటం అందరికీ ఆనందం! హరిదాసులు, జంగం దేవరలు, కొత్త అల్లుళ్ళు, పడుచు పిల్లలు, బొమ్మల కొలువులు, భోగిమంటలు, గొబ్బిపూవులు... ఇవన్నీ జీవితానందానికి నిదర్శనాలు. పశువుల్ని పూజించటం, పోటీలు, మనిషిలోనూ, జంతువుల్లోనూ కూడా ఉత్సాహాన్ని, ఊపునీ పెంచటం!

నిరాశనుంచి ఆశాకిరణాల్లోకి ప్రయాణించటం, చీకట్లనుంచి వెలుగులోకి రావటం... ఇదంతా 'సం-క్రాంతి' అని భావం.

ఇక - సూర్యుడు ప్రయాణం సాగిస్తూ - మకర రాశిలో ప్రవేశించాక, తిరిగి మళ్ళీ వెనక్కి తిరుగుతాడు. అంటే... ఉత్తరముఖంగా ప్రయాణం సాగిస్తాడు.

ఉత్తరాయణ కాలం - పుణ్యప్రదమైంది! జీవులకి జ్ఞానం కల్గించేది! ఉత్తరాయణం - పగలు - శుక్లపక్షంలో మానవుడు మరణిస్తే పుణ్యలోకం చేరుతాడనీ, ఇక మళ్లీ పుట్టడనీ గీతలో ఉద్ఘాటించబడింది. అదే - దక్షిణాయనంలో మనిషి చనిపోతే, అది గనుక రాత్రి, కృష్ణపక్షం అయితే ఆ జీవుడు మళ్ళీ పుడ్తాడనీ చెప్తాడు కృష్ణభగవానుడు.

దక్షిణాయనం - చీకటి - కృష్ణపక్షం అనేవి అజ్ఞానదిశలు. అంటే... కోరికలు, వాంఛలు తీరక, తిరిగి వాటిని అనుభవించే నిమిత్తం మళ్ళీ పుడ్తాడన్నమాట!

అదే ఉత్తరాయణం - పగలు - శుక్లపక్షం అయితే - జ్ఞానదశ! మానవుడు - ఈ ప్రపంచంలో అన్నీ తెలుసుకుని 'ఏది సత్యం, ఏది అసత్యం' అన్న జ్ఞానం సంతరించుకుని - వాంఛలని అణిచేసి - తేజస్వరూపుడవుతాడు! కనుక మళ్ళీ పుట్టడు!

ఇది ఉత్తరాయణంలోని సందేశం! సూర్యుడు మకరరాశిని చేరి ఉత్తరాయణంలోకి ప్రవేశించి మానవ జీవితానికి - లౌకికమైన పండగ సంబరాలు ప్రసాదించటమే కాక - తదనంతరం - పుణ్యలోక ప్రాప్తి కలుగచేయటం కూడా చేస్తాడు! కనుక - ఇహంలోనూ, పరంలోనూ కూడా ఈ 'సంక్రాంతి' భసమయం - ఆనందదాయకం!

జీవితంలో - మానవతా దృక్పథం పెంచుకుని తనవారినీ, బంధుమిత్రులనే గాక, సమాజ యస్సు, దేశ సౌభాగ్యం కోసం కొన్ని సరిహద్దులు చాటి ఉత్తేజంతో ముందుకు సాగాల్సి వుంటుంది. అయినా అది ఆదర్శమే.

అలాగే, జీవితబంధాలు తెంచుకుని మాయామోహం నుంచి విడివడాలంటే అనురాగాలు - మమతానురాగాలు సడి అందుకోవల్సిందే! అయినా అది క్రాంతి పథమే అవుతుంది.






# అస్వస్థత !

మనిషికైనా, మానుకైనా, పశుపక్ష్యాదులకైనా, చివరికి యంత్రాలకైనా, ఏదో ఒక సమయంలో బాగులేకపోవటం జరుగుతుంది. అప్పుడు - ప్రతిరోజులాగ చేసేపనులు చేయలేరు.

విశ్రాంతి అవసరము అవుతుంది! అంటే- శరీరంలో భాగాలకి కొంత రిలీఫ్ లేదా రిపేర్ (విశ్రాంతో, పునరుద్ధరణో) అవసరం అవుతుంది. ఆ పరిస్థితినే 'అస్వస్థత' అంటాం!

ఎక్కువ అలసిపోయినా - ఏమీ అలవక పోయినా కూడా అస్వస్థత గానే వుంటుంది.

'పొద్దున్న లేచిన దగ్గర్నుంచీ నాల్గు ఇళ్ళల్లో పనులు చేయాలి! సాయంత్రం వరకు తీరిక అనేది వుండదు. శరీరం అలసిపోతోంది. అందుకే పడకపెట్టింది పనిమనిషి!' అనే మాట వింటుంటాం. అలసిపోతున్న శరీరానికి అస్వస్థత వస్తుంది!

ఇక, 'రాత్రీపగలు ఆయనకి (ఆవిడకి) ఒకటే ఆలోచనండి! ఆర్థిక ఇబ్బందులు - అప్పులు - జమాఖర్చులు - భవిష్యత్తు ప్రణాళికలు - వీటితో రాత్రి నిద్రేపోరు. అందుకే ఈ మధ్య ఒంట్లో బాగుండటం లేదు. (బి.పి.) రక్తపోటు పెరిగిపోయింది. కాళ్ళు - చేతులు గుంజుతాయట! తల తిరుగుతుందట! ఏమిటో చాలా అస్వస్థతగా వుంటున్నారు!' అని ఓ మధ్యతరగతి కుటుంబీకుణ్ణి (గృహిణిని) గురించి చెప్పుకుంటాం!

ఇక్కడ - అతను (ఆమె) శారీరకంగా అలసిపోవటం లేదు. కానీ - మానసికంగా విపరీతంగా ఆలోచించటం వలన:: అలసిపోతున్నారు. ఆలోచన కూడా కొంత పరిమితి దాటితే మానసికంగా అలసిపోయి, దాని ప్రభావం శరీరం మీద చూపిస్తుంది.

అందుచేత 'అస్వస్థత' అనేది మానసికంగా కూడా వస్తుంది. బాగా ధనవంతులు, ఏపనీ చేయ నక్కరలేనివారూ, దేని గురించీ ఆలోచించనక్కర్లేని వారూ వుంటారు. వాళ్లని 'అబ్బ ఎంత అదృష్టవంతులో'' అనుకుంటాం. కానీ - వాళ్ళకీ అస్వస్థత వుంటుంది.

తింటే అరగదు! (గ్యాసు ట్రబులు) పొట్ట ఉబ్బటం, కాళ్ళూ చేతుతూ, కండరాలూ తేలి ఆయాసం వస్తుంటుంది. కూర్చోలేరు. నించోలేరు. 'పాపం! ఆయనకి (ఆవిడకి) ఎప్పుడూ అస్వస్థతే!' అని చెప్తారు.

అన్ని సుఖాలు వున్నా - అస్వస్థత ఎందుకు వుంటుందీ? అని అనుమానం కల్గడం సహజం! కానీ -అన్ని సుఖాలు వున్నా శరీరం భరించలేదు. ఏ సమయంలో, ఏ పని చేయాలో, ఆ విధంగానే చేస్తున్నప్పుడే అవయవాలన్నీ సరైన శిక్షణలో వుండి చెప్పినమాట వింటాయి. లేకపోతే 'అమ్మ' బయటికి వెళ్ళింది గదా! ఇంట్లో అల్లరి చేద్దాం!' అనుకునే పిల్లల్లాగానో, 'టీచర్ క్లాసులో లేరు గనుక గోల చేయా'లనుకునే విద్యార్థుల్లాగానో - ఈ శరీర అవయవాలన్నీ శిక్షణ కాస్త సడలిస్తే గడబిడ చేస్తాయి. అదే అస్వస్థత. యంత్రాలు సైతం తెగపని చేయిస్తే చెడిపోతాయి. ఒకవేళ పని చేయించకుండా, మూతవేసి దాచిపెట్టి వుంచినా పాడైపోతాయి.

అందుకే - పని పాటలనేవి క్రమపద్ధతిలో సక్రమంగా జరిగితే ఆరోగ్యంగా వుంటారు. చివరగా చెప్పుకునేది ఒకటి వుంటుంది. వృద్ధాప్యం లోని అస్వస్థత 'ఏమిటి సుస్తీ?' అని అడిగితే 'ఏముందీ? పెద్దతనం! ఇంక అంతే!' అనేస్తారు.

చాలాకాలంగా ఉపయోగించిన యంత్రాలు - మానవశరీరాలు చెట్లు, పశుపక్ష్యాదులు - వస్తువులు కూడా - స్వస్థత చెడిపోతాయి. ఇది సహజం. ప్రకృతి ధర్మం. కనుక ఈ దశకి చేరుకున్నాక సత్యం తెలుసుకుంటే - మనిషి వృద్ధాప్యాన్ని, రోగాల్ని కూడా భరించి మానవోత్తముడు కాగలడు!





# పెద్దరికాలు !

మనిషికీ, మనిషికీ మధ్య కొన్ని తేడాలు భేదాలు వుంటాయి. అలా వున్నప్పుడే ఇద్దరూ వేరు వేరుగా కనిపిస్తారు. చీకటి పక్కన వెలుగు, చిన్నగీత పక్కన పెద్దగీత, దు:ఖం వెంటే సుఖం... ఇలా విభేదం తెలుస్తున్నప్పుడే ఒకదాని ప్రత్యేకత మీద మరొకదాని ప్రభావం తెలుసుకోగల్గుతాం.

కానీ - ఒక్కొక్కసారి ఒకదాని ప్రత్యేకత మితిమీరి, రెండవదాని ప్రభావాన్ని కప్పేస్తుంటుంది. అటువంటప్పుడు రెండవది తల వొంచటమో, ఎదురు తిరగటమో జరుగుతూ వుంటుంది. మనుష్యుల్లో కూడా సరిగ్గా ఇంతే! ఒక మనిషి ప్రత్యేకత బాగా విజృంభిస్తే రెండవ మనిషి అనామకుడై ఒక్కోసారి ఎదురించుట జరుగుతుంది.

ఈ ప్రత్యేకత అన్నది శక్తి సామర్థ్యాల్లోనో, కళా కౌశలాల్లోనో అయితే రెండోవారు తల వొంచి వారి ప్రత్యేకతని ఒప్పుకుంటారు. కానీ- కేవలం జీవిత అనుభవాలలో, అతిశయాన్నీ, గొప్పదనాన్నీ చూపిస్తూ వుంటే అదే 'పెద్దరికం'. ఆ పెద్దరికం శ్రుతి మించితే ఎదుటివారు భరించటం కష్టం.

'నేను కాపరానికి వచ్చిన కొత్తలో ఎలా మెలిగేదాన్నో తెలుసా? అత్త మామలకీ, ఆడబడుచులకీ, ఎంత సేవ చేసేదాన్నో' అంటూ కొత్తకోడలికి రోజూ హితబోధ చేసే అత్తగార్ని కోడలు ఏమనుకుంటుంది? 'ఇంట్లో ప్రతిపనికీ, ప్రతిమాటకీ నువ్వుండు... నేను చెప్పినట్టు చెయ్యి, ఏదైనా నన్నడగాలి.' అనే పెద్దవాళ్ళని చూస్తే చిన్నవాళ్ళకి ఎలా వుంటుంది? ఆఫీసర్ అసిస్టెంట్లని, అస్తమానం డ్యూటీని గురించి, క్రమశిక్షణ గురించి లెక్చర్ ఇస్తుంటే ఆఫీసు స్టాఫ్‌కి ఒళ్ళు మండుకుపోదూ?

టీచర్ పాఠం చెప్తూ సబ్జెక్ట్ కన్నా తన తెలివితేటలు, అనుభవాలు గురించే ఎక్కువగా చెప్తే విద్యార్థుల్లో వినే ఓపిక తగ్గి ఆవలింతలు, పిల్లికూతలు, దగ్గులు వస్తుంటాయి.

ఫలానా అతను చాలా అనుభవజ్ఞుడు. అతని దగ్గర నేర్చుకో' అని ఒక కోర్సు కానీ, కళను గురించి గానీ ఎవరైనా చెప్తే ఆ ఫలానా అతను గంటకి ముప్పైసార్లు తన అనుభవాల్లో ఒక్కొక్క ఘటనని చెప్తూ 'ఇలాగేనా పని చెయ్యడమంటే?' అని చీవాట్లు పెడుతుంటే అతన్ని ఏం చెయ్యాలనిపిస్తుంది?

సంగీతం టీచర్, డాన్సుమాస్టర్, ఆర్టిస్టూ, సినీ డైరెక్టర్, హోటల్ మేనేజర్, ఫ్యాక్టరీ ప్రొప్రైటర్ మొదలుకొని పెద్దకూలీ చిన్నకూలీని, మేస్త్రీ తన కిందవాడిని... ఇలా పైమెట్టు మీదున్నవాళ్ళు క్రిందమెట్టు మీదున్న వాడిమీద తన గొప్పతనాన్ని గుమ్మరిస్తూ వుండటాన్నే 'పెద్దరికాలు' అంటారు.

ఈ పెద్దరికం సౌమ్యతగా, కిందవాడిని పైకి రానిచ్చేలాగ వుంటే, అందరూ వారి పెద్దరికాన్ని గౌరవిస్తారు కానీ, రజోగుణంతో రాజసం ఒలకబోస్తూ కిందవాడికి పైకి వచ్చే అవకాశాన్ని ఇవ్వకుండా మనసును బాధిస్తే చాలా విపరీతాలు జరుగుతాయి. కొంత మంది అమాయకులు, పిరికివాళ్ళు తమని కించపరచుకుని జీవితంలో పైకి రాలేరు. మరికొంతమంది ఎదిరించి 'నువ్వెంత? నీ పెద్దరికం ఎంత?' అని తిరస్కరిస్తారు.

'పెద్దరికం' అనేది ఎప్పుడూ, ధైర్యం, ఆత్మస్థైర్యం కలగజేసి చిన్నవాళ్ళని అభివృద్ధిలోకి తెచ్చేలా వుండాలిగానీ, 'మర్రిచెట్టు నీడలో మల్లితీగ పెరగదు' అన్నట్టు కాకూడదు.

ఐ.ఏ.ఎస్. ఇంటర్వ్యూలో 'మీరు ఎన్ని మెట్లు ఎక్కి వచ్చారు?' అని అడిగితే, 'మీకంటె ఒక ుట్టు క్రిందవున్నానని సుభాష్ చంద్రబోస్ అన్నారుట. అంటే- కాబోయే కలెక్టర్' అని భావం. అందులో ంత సత్యం వుంది?

ప్రతివాడూ జీవితపు మెట్లు ఎక్కి వస్తుంటాడు. ఎప్పటికైనా గమ్యం చేరాలని మనం ఆశించి పెద్దరికం చేసేటప్పుడు దానిని సద్వినియోగానికే ఉపయోగిద్దాం !!






# ఆత్మహత్య !

ఎవరైనా సహజంగా మరణించకపోతే వెంటనే అది 'హత్యా' లేక 'ఆత్మహత్యా?' అని తెలుసుకుందుకు ఆరాటపడతాం. పగతో, విద్వేషాలతో ఒకరు చంపితే 'హత్య' అంటాం. బెంగలు, బాధలు, అవమానాలు కష్టాలు భరించలేక తనకు తానే చంపుకుంటే 'ఆత్మహత్య' అంటాం. ఒకవేళ ఏదైనా ప్రమాదం జరిగి మరణిస్తే 'అకాలమరణం' అనో, రోగాలతో పోయినప్పుడు 'ఫలానా వ్యాధి వల్ల పోయా'డనో చెప్పుకుంటాం. వృద్ధుడైనవాడు క్షీణించి, క్షీణించిపోతే వృద్ధాప్యం వలన మరణించేడని చెప్తాం. అంటే - చనిపోతే ఏదో కారణం వుండాలన్నమాట !!

'ఆత్మహత్య' మహాపాతకం అంటారు. తనకి తాను చంపుకోవటం చాలా నేరమన్న మాట అయితే - అసలు 'ఆత్మ'కి చావులేదు. అది చైతన్యభరితమైన శక్తి. వినాశనం లేనిది. మరి ఇక హత్య ఏమిటి ? చావు ఏమిటి?

అంటే- మనిషి ఎప్పుడూ సుఖాలు, సంతోషాలు కోరుకుంటూ హాయిగా వుండాలని చూస్తాడు తప్ప కష్టాలు, బాధలు, బెంగలు పడటానికి ఇష్టపడడు. భరించుకోలేడు. అందుకని- 'ఆత్మహత్య' చేసుకుంటాడు. శరీరం వదిలి వెళ్ళిపోవటమే అని అర్థం. అంటే - అది భీరత్వం కదా? పిరికివాడై జీవితం నుంచి పారిపోవటమన్నమాట!! ఏదో ఒక దుర్బలత్వం చేతనే ఆత్మహత్యకి పాల్పడుతాడు మానవుడు. ఆ దుర్బలత్వం తప్పని, పాపం అని చెప్పుకోవాలి. ఆత్మహత్య చేసుకొనేవాడు తను విముక్తి పొందటమే చూసుకుంటాడు తప్ప- తనని ఆశ్రయించుకుని వున్న బంధుజనానికి, తనపై

ఆధారపడి వుండే స్వజనానికీ అన్యాయం చేయటం తప్పు కదా? వాళ్ళకి బ్రతుకు దుర్భరం కాదా? అని ఆలోచించడు. ఇలాంటివన్నీ ఆత్మహత్యలో గల దోషాలు. హత్య కూడా నేరమే అయినా యుద్ధకాలమందు, ఆపద సమయంలో, మానరక్షణ కోసం, మరొకర్ని కాపాడటం కొరకు 'హత్య' అనేది మరొక పరిధిలో ధర్మంగా పరిగణింపబడుతోంది. కేవలం పగతో, స్వార్థంతో హత్య చేస్తే అదీ మహానేరమే.

ఆత్మహత్యనే చెప్పుకోవాల్సి వచ్చినప్పుడు అది చాలాపాపం -అని అందరూ ఒప్పుకుంటారు. అయితే - నిజానికి ఆత్మహత్య అనేది శరీరాన్ని వదలటం కాదు. "అన్నిటియందు సమముగా నిండి వున్న ఆత్మస్వరూపాన్ని తెలుసుకుని సమదృష్టితో మనమంతా ఒకటే అని ఐక్యతాభావంతో వుండగల్గే వాడు ఆత్మజ్ఞాని. ఈ జ్ఞానం ఎవరికి వుండదో వారు 'ఆత్మహత్య' చేసుకున్నట్టు లెక్క!'' అని శ్రీకృష్ణ పరమాత్మ గీతలో చెప్తాడు.

మనం నిత్యం ఆత్మహత్యలు చేసుకుంటున్నామన్నమాట. ఇతరులని మనతో సమంగా చూడలేం. బాహ్యాడంబరాలు చూసి మోజుపడ్తాం. ఆర్థిక స్థితిగతులకి విలువనిస్తాం. మనికి లాభం కల్గించేవాళ్ళకి నివాళులు పడ్తాం. అదే రోగులని చూసినా, దరిద్రులని చూసినా, వికలాంగులని చూసినా, కురూపులని చూసినా, హీనంగా, నీచంగా, తిరస్కారంగా ప్రవర్తిస్తాం. ఒక్కొక్కప్పుడు మనకి మనమే కించబరచుకుంటాం సాటివారితో పోల్చుకుని! ఇవన్నీ కూడా 'ఆత్మహత్య' క్రిందే లెక్క. అంటే- మనం ప్రతినిత్యం ఎన్నిసార్లు ఆత్మహత్యలు చేసుకుంటున్నామో? . . . అంత దోషం వుంది. ఆత్మని (ఎవరిదైనా సరే) గౌరవించనివాడు 'ఆత్మహత్యా' దోషి అని తెలుసుకోవాలి. ఆ దోషం చేయని ఆత్మజ్ఞాని సర్వదా ఆనందమయుడే !!





# మంటలు !

అగ్ని నుండి మంటలు వస్తాయని అందరికీ తెలుసు. రాపిడి వల్ల అగ్ని పుడుతుందనీ తెలుసు.

అగ్గిపెట్టెమీద అగ్గిపుల్లతో గీస్తే మంట వస్తుంది. అగ్గిపుల్లని మరేదైనా గరుకు ప్రదేశం పైన రాసినా మంట వస్తుంది. రెండు చెకుముకి రాళ్ళను గట్టిగా గీకితే మంట వస్తుంది.

అంటే - 'నిప్పు' మూల స్వరూపం. దానినుండి మంటలు పుడ్తాయి. నిప్పు కణకణ లాడుతూ వున్నంతసేపు ఫర్వాలేదు. కానీ -ఆ వేడి నుంచి మంటలు ఆవిర్భవిస్తే దూరం జరగటమో, జాగ్రత్త వహించటమో చేస్తాం. కారణమేమంటే... మంటలకి వ్యాపించే గుణం వుంది. నీరు ఎలాగైతే ప్రవహిస్తుందో గాలి ఎలాగైతే వీస్తుందో మంటలు కూడా ఒక ప్రదేశం నుంచి మరొక ప్రదేశానికి వీస్తాయి. అంతేకాదు- నిప్పుయొక్క శక్తి అమితమైనప్పుడు మంట రూపంలోకి మారుతుంది. మంటలలో నీలిమంట, ఎర్రమంట, తెల్లని మంట... రకరకాలుగా వుంటాయి. ఒక్కోదానికి ఒక్కో శక్తి వుంటుంది.

సరిగ్గా మానవుడి మనస్సు ఇదేరీతిలో వుంటుంది. మామూలుగా వున్నంతసేపు మనస్సు అణిగిమణిగి వుంటుంది. ఏదైనా పరిస్థితి తటస్థపడితే మనోభావాలు శక్తి పుంజుకుని మంటలాగా పైకి ఎగిసిపడుతుంది.

'నాకు మండిపోతుంది. ఏం చేస్తానో తెలియదు' అంటారు- కోపం ఎక్కువగా వున్నప్పుడు! అలాగే... 'నా మనస్సు ఎంత మండిపోతుందో' అనీ, 'హృదయం మండిపోతోం'దనీ, 'ఒళ్ళు మండి

పోతోం'దనీ చెప్తుంటారు. మండటమంటే మంటలని కాదు. కోపం, ఉద్రేకం, ఆవేదన... ఇత్యాది బాధాకరమైన విషయాలన్నిటికీ 'మండిపోవటం' అనే చెప్తాం.

మరొక చిత్రం ఏమంటే - ఆకలి వేసినామండిపోతోంది... ఆకలి' అంటాం. ఏదైనా వ్రణం, కురుపు, గాయం తగిలినా, మండిపోతుందంటాం. కళ్ళని కూడా మండుతున్నాయని చెప్తాం. ఈ మంటలన్నీ నిప్పు నుంచి వచ్చినవి కాదు. శారీరక, మానసిక బాధలు అన్నీ మంటల రూపానికి సాక్ష్యాలే. అవధులు మించిన వేడి, మంటల రూపం చేరినట్టు మనం బాధల్ని భరించలేనప్పుడు మంటల స్థాయిలో చెప్తాం.

ఇంకా విచిత్రమేమంటే - ధరలు మండిపోతున్నాయనీ రోజులు మండిపోతున్నాయనీ, బుద్ధులు మండిపోతున్నాయనీ... పోలుస్తూ వుంటాం. మంటలనేవి మంచి ఉపయోగపడినంత వరకు గొప్పవే. కాని- ఎప్పుడైతే నష్టం, కష్టం కల్గిస్తాయో అప్పుడు మంటల్ని తిట్టుకుంటాం. అలాగే- మనం మోతాదు మించిన ఉద్రేకంలో మంచిపనులు చేయగల్గితే ఆ ఉద్రేకం, కోపం ప్రయోజన కరమైనవే. కానీ- మన కోపమూ, ఆవేదనా- ఇతరులకీ, మనకీ నష్టం కలుగజేసినా, చేసుకున్నా నిష్ప్రయోజనమే అవుతుంది.

మంటలవల్ల ఫ్యాక్టరీల్లో భారీ ఎత్తున ఎన్నో వస్తువులు తయారు చేయవచ్చును కదా! ఇనుము, సీసం సైతం కరిగించగలం. అలాగే - మనలో రగిలే అగ్నిజ్వాలలు సత్కార్యాలకి ఉపయోగ పడితే ఆమోదనీయమవుతాయి. నిజానికి- ప్రతి ప్రాణిలోనూ వేడి (అగ్ని) వుంటుంది. మానవుడిలో ఇది ారస్థాయి చేరుకున్నప్పుడు రెండు ముఖ్యమైన విషయాలు గమనించాలి.

ఒకటి... శారీరక, మానసిక బాధల వల్ల అయితే అది నష్టం కల్గిస్తుంది. (ఎర్రటి మంట మసి ల్గించినట్టు)

రెండు... శారీరక శక్తులన్నీ మానసిక శక్తులలోకి విలీనం చెందినప్పుడు ఆ మంట సహస్రారం చేరుకుని ఊర్ధ్వముఖమై జోతిర్లింగమవుతుంది. (నీలం మంటలాగా ప్రారంభమై తెల్లని వెలుగుగా ప్రజ్వలిస్తుంది)

ఈ స్థితి చేరుకున్న మానవుడు ధన్యుడు !!



# సహగమనమంటే ?

ఈ సృష్టిలో 'భార్యా - భర్త' అనే ఇద్దరు వ్యక్తుల మధ్య అతి పవిత్రమైన బంధం వుంది. వారిద్దరూ శరీరాలు వేరైనా మనస్సులు ఒకటిగా, మనుగడ ఒకటిగా బ్రతకాలనేది వివాహ బంధంలో వల్లె వేయిస్తారు. అందుకనే - ఎవరి మధ్యా లేనంత సన్నిహితత్వం భార్యాభర్తల మధ్య వుంటుంది. కన్నతల్లిదండ్రుల కన్నా మిన్నగా ప్రేమించే శక్తి ఆలుమగలకే పరిమితమవుతుంది. తమ ప్రతిబింబాలుగా మరో ప్రాణులకి జన్మని ప్రసాదించే ఈ దాంపత్యం అతి పూజ్యమైనది, పునీతమైనది.

అంతటి దివ్యమైన దంపతుల మధ్య అరమరికలు లేకుండా గృహస్థాశ్రమంలో నిత్యం కళ కళలాడుతూ అతిథి అభ్యాగతులని ఆదరిస్తూ, వారసులని తమకి ప్రతిగా మలుస్తూ వుండాలన్నదే గృహస్థ జీవితం యొక్క పరమధర్మం. విధివశాత్తు భర్త గనుక మరణిస్తే, భార్య మానసికంగా ఎటూ క్రుంగిపోతుంది. ఆమెకి జగత్తు శూన్యమైపోతుంది. సంతోషం ఇగిరిపోతుంది. అయినా - ఆమె తమ పిల్లలకోసం, తనలో అగ్నిగుండం నింపుకుని, పైకి గంభీర సముద్రంలా బ్రతుకుతుంది.

పూర్వం ఉమ్మడి సంసారాలు వుండి - పదిమంది బంధువులున్నప్పుడు పిల్లల బాధ్యత వాళ్ళకి అప్పజెప్పి, భరించలేని వేదనతో పతితో పాటు సతికూడా ప్రాణత్యాగం చేసేదని మనకి చరిత్ర, పురాణాలు తెలియజేస్తున్నాయి! అదే 'సహగమనం!' అంటే భర్తవెంట భార్య పరలోకానికి కలసి వెళ్ళటం. ఇక్కడ 'సహగమనం'... అంటే - భర్తతోనే అన్నది ముఖ్యం. తల్లిపోయినా, తండ్రి పోయినా, ప్రియాతి ప్రియమైన అక్క, చెల్లెళ్ళు, పిల్లలు... ఎవరు పోయినా బెంగ భరించలేక కొందరు మంచం పట్టిపోతారు

లేదా ఆత్మహత్య చేసుకుంటారు. కానీ - దాన్ని సహగమనం అని ఎవ్వరూ అనరు. భార్యపోతే భర్తకూడా ఒక్కొక్కప్పుడు భరించలేక ఆత్మహత్య చేసుకోవచ్చును. అయినా- సహగమనం అని అనరు. కేవలం భర్తపోతే భార్య వెంటనే ఆత్మాహుతి చేసుకుని అదే చితిమీద భస్మమైతే అది 'సహగమనం' అంటారు.

ఇక్కడ భార్య అంటే ప్రకృతి. భర్త అంటే పురుషుడు. పురుషుడు లేకుండా ప్రకృతికి ఉనికి లేదన్నది వేదార్థం. అయితే - ప్రకృతి అంటే కేవలం స్త్రీ అని కాదు. 'కోరికలు. . . ఆశలు' . . ప్రకృతి రూపాలు! చైతన్యం ... ఉత్తేజం . . . అనేవి 'పురుష' అనే పదానికి అర్థాలు!

అందుకని - భర్త అనే చైతన్యం కరిగిపోయినప్పుడు - ఆశలు, కోరికలు అనే భార్య చెదిరిపోయి ఆ చైతన్యం తోనే వెళ్ళిపోతాయి. నిజమైన 'సహగమనం' అదే. తనలోని సర్వకోరికలూ, సరదాలూ, అన్నీ ఆ చైతన్యంతో పాటు వెళ్ళిపోవటమే 'సహగమనం!'

భర్తపోతే, భార్య చావాలా?... అన్న ప్రశ్న కాదు ముఖ్యం! అతి పవిత్రమైన బంధంలో ముడిజారిపోతే - తాడు దానంతటదే ఎలా విడిపోతుందో - ఈ ప్రకృతిలో సహజత్వం కోల్పోతే కళావిహీనం ఎలా వుంటుందో - అదే సహగమనం! పూర్వం పెద్దలు వేదార్థాలకి విపరీతార్థాలని తీసుకుని చేసే పనులు నిజానికి ధర్మం కావు. బలవంతంగా శారీరక త్యాగం చేయించటం, చేయటం, భగవంతుని దృష్టిలో కూడా నేరమే! నిజమైన జ్ఞాని శరీరాలని ఎప్పుడూ లెక్కచేయడు! మనసే ముఖ్యం. మనసు నిర్వికారమవటమే సహగమనం. కర్తవ్యతా దృష్టితో మనిషి ఈ భూమి మీద తన ధర్మం నెరవేర్చాలి గాని - ఆత్మాహుతి వల్ల పరమార్థం సిద్ధించదు.

మనిషికీ మనిషికీ కాక - మనసుకీ, మనసుకీ బంధుత్వమే - ఆధ్యాత్మ యోగంలోని సూక్ష్మార్థం.






# దానం - ధర్మం !

ప్రతివాడు గొప్పగా పుట్టలేదు. పుట్టుకతో గొప్పవాడు ఒకడైతే మధ్యలో బాగా సంపాదించే వాడు ఇంకొకడు. అంటే- పుట్టేక గొప్పవాడు అవుతాడు. ఇలా స్థితిమంతుడైనవాడు తనకంటే తక్కువ వాళ్ళకి తృణమో, ఫణమో మళ్ళీ తీసుకోని పద్ధతిలో ఇవ్వటమే 'దానం' అనిపించుకుంటుంది. ఏ విధంగానూ పరిచయం లేని వారికీ, బీదవారికీ దానం చేస్తుంటారు కొందరు. ఇందులో ప్రతి ఫలాపేక్షకు తావులేదు. కొన్ని శుభకార్యాలలో, అశుభ కార్యాలలో కూడ దానం ఇవ్వటం జరుగుతుంది. దానికి 'పుణ్యం' ప్రతిఫలాపేక్షగా 'ఫలానాదానం' అని నిర్దేశింపబడి వుంటుంది. మనసులో ఏమున్నా తప్పనిసరిగా 'దానం' ఇవ్వటం అనేది వ్రతాలు, నోములు, పూజలు, సంప్రదాయకరమైన వేడుకల్లో ఇస్తుంటారు. ఇవి దానాలే అయినా తప్పనిసరిగా ఇవ్వాల్సి వుంటుంది. పూజా పునస్కారాలలో, యాత్రాస్థలాల్లో దానం చేస్తే మంచిదని కొందరు దానం-ధర్మం చేస్తుంటారు.

బిచ్చగాళ్ళకి చేసే దానం నిష్కల్మషం. పరులకింత పెట్టామన్న చింతనతో వాళ్ళకి ఏదో ఇస్తుంటారు. నిర్మలమైన మనస్సుతో పరులకి చేసే ఈ సహాయమే నిజమైన దానం.

కొందరు మహనీయులు భూములు, భవనాలు, పొలాలు, ధనం, దానపట్టారాసి దానిమీద ఆదాయం ప్రతిసంవత్సరం ఏదో ఒక మంచిపనికి వినియోగిస్తారు. కొందరు బీదవిద్యార్థులకి ఉచితంగా విద్యాదానం చేస్తే, మరికొందరు శ్రమదానం చేసి, సమాజ సేవ చేస్తుంటారు. అంటే - దానం అనేది డబ్బురూపంలోనే కానక్కర్లేదు. ఏ రూపంలోనైనా ఇతరులకి తిరిగి తీసుకోని పద్ధతిలో ఇవ్వటమే

దానగుణం. శాస్త్రాలు నమ్మినా నమ్మకపోయినా, 'దానం' చేయటమనేది మానవత్వపు లక్షణం. మనుషులమధ్య ఈ దానగుణం వుంటేనే సమాజంలో సమతాభావం, స్నేహభావం, అనుబంధ బాంధవ్యాలు అంతర్లీనంగా ప్రవహిస్తూ సమాజాన్ని ప్రేమవాహినిలో పచ్చగా వుంచుతుంది.

ఈ దానాలన్నిటికి మించినది రక్తదానం, నేత్రదానం! ఇంకా శరీర అవయవాలలోని కొన్ని భాగాలని దానం చేస్తుంటారు మహనీయులు. ఆనాటి శిబిచక్రవర్తి, దానకర్ణులంతటివారు ఈ దాన గుణం వల్లనే చిరస్థాయులయి నిలిచేరు.

మనుధర్మశాస్త్ర ప్రకారం ప్రతిమనిషీ తన ఆదాయంలో కొంత దాచుకోవాలనీ, మరికొంత దానాల క్రింద వినియోగించాలనీ మన పెద్దలు చెప్తుంటారు. దాయాదులు, ఆత్మీయులు, ఏక గర్భ వాసులు వీళ్ళందరికీ మనం చేయగల సహాయం 'ధర్మం' అనిపించుకుంటుంది. అంటే- 'పురుషార్థం' అన్నమాట. పురుషుడు తన ఆదాయాన్ని సక్రమపద్ధతిలో ఆర్జించి, కొంత దాచుకుని, కొంత దానం, కొంత ధర్మంగా వినియోగించి, మిగిలినది అనుభవించాలన్నది ధర్మశాస్త్రం. 'దానం' దయతో కూడినది 'ధర్మం' బాధ్యతకి సంబంధించిది. ఈ రెండూ మనిషి చేయగల్గితే ఉత్తముడనిపించు కుంటాడు. అంతేకానీ - తనని మాలిన ధర్మం గానీ, ఎవరికీ ఏమీ చెయ్యని స్వార్థం గానీ మంచిది కాదు.

మనం మహనీయులం కాకపోయినా మానవతా దృష్టితో సాటివారికి 'దానధర్మం' చేసి 'మంచి మనిషి'గా మిగులుదాం.





# ఫీలింగ్!

మనం చాలా తరచుగా వాడే పదాలకి ఒక నిర్ణీతమైన అర్థం కనిపించదు. సందర్భాను సారంగా ఆ పదం వాడుతూ వుంటాం! అంతేకాదు - భాషభేదం కూడా చూడం.

అలాంటి పదాలలో 'ఫీలింగ్' అనేది ఒకటి.

'నువ్వు అలా మాట్లాడితే అతను (ఆమె) ఎలా ఫీలయ్యాడో తెలుసా!' అంటాం. ఫీలవటమంటే? బాధపడటమా? చిన్నబుచ్చుకోవటమా? లేక తటస్థమా? స్థిరంగా చెప్పలేం.

చెప్పేవాళ్ళ ముఖ భంగిమని బట్టి, జరిగిన సందర్భాన్ని బట్టి ఆ ఫీలవడం ఆధారపడి వుంటుంది. 'ఇదిగో... చూడు- నువ్వు గనుక రేపు రాకపోతే నేను చాలా ఫీలవుతాను' అంటే... బాధ పడతాను అనో, విచారిస్తాను అనో, వెలితి పడతాననో అర్థం. ఇందులో అభిమానం, ప్రేమ వ్యక్తమవుతాయి. అదే వాక్యాన్ని కొద్దిగా మార్చి చేస్తే దాని అర్థం మారిపోతుంది.

'ఇదిగో! నువ్వు గనుక వచ్చావా? నేను చా:లా ఫీలవాల్సి వస్తుంది' అంటారనుకోండి! రాకూడదనీ, అలా రావడం వలన తనకో, అక్కడున్న మరెవరికో ఇబ్బంది కల్గుతుందనీ భావం. అంటే -దీనిలో కోపం కల్గించే అర్థం వెల్లడి అవుతుంది.

'నేను ఎంత చెప్పినా నీకు ఏ ఫీలింగ్ రాదా?' అన్న వాక్యంలో చాలా భావాలు మెదులుతాయి. మంచో, చెడో ఏదో ఒకటి అన్నట్టుగా ధ్వనిస్తుంది. కనుక ఫీలింగ్ అనేది మంచికీ, చెడుకీ సమయానుకూలంగా వాడతాం.

ఇలాంటిదే 'సిగ్గు'. 'ఇది' అనే పదాలు కూడా.

ప్రకృతి అందాన్ని చూసి చాలా ఫీలయ్యామంటారు. దానిని ఆనందించామని అర్థం చేసుకుంటాం. 'ఫలానా' దారుణం చూడలేక నేను ఎంత ఫీలయ్యానో' అని చెప్తే అందులో హృదయ విదారకమైన విషయం వున్నట్టు భావించాలి.

యవ్వనంలో వున్నప్పుడు పరస్పరం ఆకర్షణ కూడా 'ఫీలింగ్'తో అన్వయించి చెప్తారు. ఆ అమ్మాయిని (అబ్బాయిని) చూసినా, ఆమె (అతని)తో మాట్లాడినా తను చాలా ఫీలవుతానంటాడు. ఇది ప్రేమతోనో లేక మోహంతోనో కూడిన చర్య.

నిజానికి - ' ఫీలింగ్' అనేది మానసిక ప్రక్రియ. అది ఏ రకమైన చర్యకైనా వాడుతూ వుంటారు. రాజకీయాలని గురించీ, ఎలక్షన్ల గురించీ, కుటుంబ గొడవల్ని గురించీ ఏదైనా సంస్థల్ని గురించీ 'నువ్వు ఎలా ఫీలవుతున్నావు?' అని అడుగుతారు కొందరు. ఇక్కడ ఫీలవటం అంటే- ఉద్దేశం అని మారుతుంది.

కొత్త సంసారాన్ని గురించి గానీ, కొత్త ఉద్యోగాన్ని గురించి గానీ ఇలాగే 'ఎలా ఫీలవుతున్నావ్?' అని అడిగితే 'ఏమనుకుంటున్నావు?' 'బాగుందా?' బాగులేదా?'అని అర్థం.

ఇలా 'ఫీలింగ్' అనే పదం ఎన్నో భావాలకి ప్రతిరూపం. పదిమందిలో వుండగా ఎవర్నైనా విమర్శించినా, తిట్టినా వాళ్ళు చాలా ఫీలవుతారు. పరీక్ష ఫెయిలైన విద్యార్థులు, తిరస్కృతి పొందిన పెద్దలు ఫీలవటంలో ఎక్కువగా ఆత్మాభిమానం ద్యోతకమవుతుంది.

' ఫీలింగ్' అనేది ఆంగ్ల పదమే అయినా ఆంధ్రపదమంత అలవాటుగా మారి అన్ని భాషల వాళ్ళూ ఉపయోగిస్తూ వుంటారు. అందుకు కారణం 'అది' అనేక భావాలకి ప్రతిరూపం కనుకే!

ఎంత తరచుగా మనం ఫీలింగ్ అనే పదాన్ని ఉపయోగిస్తామో దానికి నిత్యజీవితంలో కూడా అంత విలువనిస్తే బాగుంటుంది.

అక్కర్లేని వాటికి ఫీలవడం, ఎదుటివారిని అలా ఫీలయ్యేటట్టు చేయటం మనం మానుకుంటే ఎంతో మంచిది !!






# ఆశ!

జీవితం ఎప్పుడూ ఒకేలాగ సాగదు. సుఖం, దుఃఖం... వెలుగునీడల్లా కలిసిపోయి మనిషిని చుట్టేస్తూ, లాక్కెళ్ళుతూ వుంటుంది. నిరాశా, నిస్పృహల్లో తేలిపోతున్నా మళ్ళీ సూర్యోదయం కోసం ఎదురుస్తూ ముందుకు వెళుతుంటాడు మానవుడు.

ఈ ఎదురుచూపు వెలుగుకోసం! వెతుకులాటనే 'ఆశ' అని పిలుస్తాం. ఎంతటి విచారంలోనైనా ఆశ మనిషికి ఓదార్పు నిస్తుంది. 'ఆశ' మనిషికి కొత్త ఊపిరినిస్తుంది. రేపటిమీద ఆశ నింపుకున్నవాడు ఈరోజు ఎంతటి బాధనైనా భరించగలడు.

కటిక దరిద్రుడు, కూటికి లేనివాడు కూడా 'ఏదో ఒకరోజు తను కడుపు నిండా తిని హాయిగా వుండగల'నని ఆశని పెంచుకుంటూ, ఎంత అవస్థ పడుతున్నా జీవించాలనే అనుకుంటాడు.

మనుషులందరూ ఎప్పుడూ ఏదో ఆశాభావాన్ని పెంచుకుంటూనే వుంటారు. సామాన్యులైతే వారి ఆశలు- అబ్బాయిని బాగా చదివించాలనీ, వాడు పెద్ద ఉద్యోగం చేసి తమని ఉద్ధరించాలనీ, ఆశ పడ్తారు. అలాగే - అమ్మాయికి మంచి సంబంధం చూసి పెళ్ళి చేయాలనీ, వాళ్ళు సుఖంగా వుండాలనీ ఆశిస్తారు.

వృద్ధాప్యంలో తనవారు తనని ప్రేమగా చూడాలనీ, వయస్సు మళ్ళిన వారి ఆశ. 'రేపు చూసుకో. నేనే ఆటల్లో ఫస్టు వస్తాను. నాన్నతో అన్నీ కొనిపించుకుంటాను'. అంటూ బాల్యావస్థలోని 'ఛాలెంజ్'ఆశగా రూపుదిద్దుకొంటుంది.

మంచాలమీద పడివుండి బాధలు పడే రోగులు 'రేపు ఈ రోగం తగ్గగానే ఇంటికి వెళ్ళిపోవచ్చును. హాయిగా తిని తిరుగుతాను' అనుకుంటూ మందులిస్తున్న డాక్టర్లు, సేవ చేస్తున్న నర్సుల్ని చూసి 'ఫర్వాలేదు' అనే ఆశ పెంచుకుంటారు.

దీనులు, వికలాంగులు, ఆర్తులు తమకి సహాయపడ్తున్న ధర్మమూర్తుల్ని, తమ ఆశా జ్యోతులుగా భావించి ఊరట పొందుతారు. 'కష్టపడి పనిచేస్తున్నాను, నాకు తప్పకుండా ప్రమోషన్ వస్తుం'దనీ, 'మళ్ళీ నెలలో అయ్యగారు జీతం పెంచుతారులే' అనీ, 'పై సంవత్సరంలోనైనా పంటలు బాగా పండకపోతాయా, కష్టాలు తీరకపోతాయా, అనీ మళ్ళీ పండగకి పట్టుచీర కొనుక్కోగల'ననీ, 'ఇంకొక నెలలో అనుకున్న నగలు చేయించుకోగల'ననీ, ఇలా చిన్నా, పెద్ద ఆశలు వెన్నెల మడుగుల్లా సెలేటి గలగలల్లా, ఎప్పుడో ఒకప్పుడు అందరి జీవితాల్లో దూరి గిలగింతలు పెడ్తూనే వుంటాయి.

గిలిగింతలు పెట్టే చిన్నిపొన్నారి ఆశలు మనుష్యులకి వరాలు. ఆ ఆశల వల్లే మనిషికి కొత్తబలం, కొత్తదనం సంతరించి చీకటి నుంచి వెలుగు వైపు నడుస్తాడు. అనుకున్నది నెరవేరినా, నెరవేరకపోయినా, 'ఆశ' వల్ల మనిషి కర్మయోగి కాగల్గుతాడు... తనకి తెలియకుండానే! భగవంతుని బోధ అదే.

కానీ- ఆశ హద్దుదాటి అత్యాశగా మారితే ముప్పే! పక్కవాడిని ముంచి తను బాగుపడాలనుకోవటం, ఎంత సంపాదించినా తృప్తి లేకపోవటం, పదవులు, ప్రతిష్టలకోసం అహోరాత్రులు ఆరాటపడటం... ఇలాంటివి ఆశ కాదు. 'అబ్బో ఎంతాశో?' అనే దురాశని గుర్తు చేస్తాయి. అప్పుడు కర్మయోగి కాదు కర్మ బంధనాల్లో చిక్కుకుని ఇహపరాల్లో కూడా పతమయే స్థితి పడుతుంది.

ఆదర్శమూర్తులు ఈ రెంటి స్థాయిని దాటి పైకి ఎక్కగలరు. వారికి ఆశ వుండదు. 'ఆశయం' వుంటుంది. అందుకే వాళ్ళు మహాత్ములు. మనం సామాన్యులం. కనీసం ఈ స్థాయి నుంచి పడిపోకుండా జాగ్రత్త పడదాం !!





# అంతర్నేత్రం

సృష్టిలో ప్రతి జీవరాశికి వుండేవి రెండు కళ్ళే! జీవితానికి కళ్ళు అతి ముఖ్యమైనవి. 'సర్వేంద్రియాణాం నయనం ప్రధానం' అన్నారు. అవయవాలన్నిటిలో కళ్ళు ముఖ్యమైనవి. చూపు లేకపోతే బ్రతుకు దుర్భరమవుతుంది. అయితే - బయటికి కనిపించే రెండు కళ్ళూ కాక మరొకటి వుంది. అది కనిపించదు. కానీ - కనిపించే ప్రతి వస్తువునుంచీ, అనుభవాలనుంచీ జ్ఞానాన్ని గ్రహిస్తుంది. అదే 'అంతర్నేత్రం'.

దృష్టికి కనిపించేవన్నీ లౌకికాలు. అంటే... నిత్యజీవితపు అవసరాలకి సంబంధించినవి. కానీ 'అంతర్నేత్రం' అంటే కనిపించని (బాహ్యానికి) విషయాలని కూడా గ్రహించి మేధస్సును పెంచుతుంది.

సమాజంలో సగటు మనిషి తన ఉనికి లేదా స్థాయి ఎలా భావిస్తాడు? 'బీదా, మధ్య తరగతి గొప్ప, చాలా గొప్ప' అనే తరగతులుగా విభజించి తనకున్న ఆర్థిక సంపద ఏ మెట్టుమీద వుంద చూసుకుంటాడు. అంటే... గొప్పవాణ్ణా, బీదవాణ్ణా, మధ్యస్థంగా వున్నానా? అని చూసుకుంటాడు.

అదేవిధంగా విద్యలోనూ, పేరు ప్రతిష్టలలోనూ కూడా తనని తను చూసుకోగలడు. ఇదంతా బాహ్యానికి సంబంధించినది.

కానీ - అంతర్గతంగా మన స్థానం ఏ మెట్టుమీద వుందో తెలుసుకోగల్గేది అంతర్నేత్రంతోనే!

సమాజంలోని తరగతుల్లాగా అద్వైతంలో లేదా అధ్యాత్మంలో కూడా మనిషి ఉన్నతిని కొలతతూచే తరగతులున్నాయి.

మొదటిది... ఎంతసేపూ భోజనాది విషయాలు, కూరలు, వంటలు, రుచులు, ఆకలి గురించి ఆరాటపడే వాళ్ళుంటారు. వాళ్ళు ఎవరితో మాట్లాడినా వీటి గురించే మాట్లాడుతారు. అంటే - కడుపులో పడే తిండికి సంబంధించినవే. ఈ కడుపును మన శరీర అవయవాలలో అడుగున వున్నది కనుక బీదరికపు స్థాయిని తెలుసుకోవాలి. ఈ రకం కబుర్లు చెప్పేవాళ్ళు పేదవాళ్ళన్న మాట.

రెండవది... సమాజంలోని విశేషాల్ని గురించి శ్రద్ధ చూపేవాళ్ళు, బట్టలు, స్టీలు సామాన్లు, నగలు, సినిమాలు, ఇళ్ళూ, వాకిళ్లూ, రాజకీయాలు... వీటిని గురించే చెప్పుకునేవాళ్ళు మధ్యతరగతి వారన్నమాట. వీరి బుద్ధి గర్భకుహరం దాటి పైకి వచ్చినట్టు తెలుసుకోవాలి.

మూడోది... విజ్ఞానపరమైనవీ, శాస్త్రాల గురించీ, గ్రంథ సమీక్షలు... ఇత్యాది వాటిమీద ఆసక్తి చూపేవార్ని ఇంకాస్త పైకి - అంటే... హృదయ ఫలకం వరకు చేర్చి మధ్యతరగతి దాటినవారుగా భావించాలి.

నాల్గోరకం మనుష్యులు. వీరే అంతర్నేత్రం తెరుచుకుని ప్రపంచాన్ని చూడగల జ్ఞానులు. వీరు సదా 'జీవితగమ్యం ఏమిటి? ఈ సృష్టికి మూలం ఏమిటీ?' అన్న చింతలో, అన్వేషణలో వుంటారు. వీరే చాలా గొప్పవారుగా పరిగణించబడుతారు. యోగశక్తితో కుండలిని లేపి, సహస్రారం చేరుకోటం అంటే ఇదే.

గర్భంనుంచి ఆలోచనలు, బుద్ధి శిరస్సు చేరుకుంటే వారి చూపు ఆకాశం వైపుగా వుంటుంది. అంతర్యం తెలుసుకునే 'అంతర్నేత్రం' అంటే ఇదే!! బాహ్యంలోని కళ్ళకీ, అంతర్నేత్రానికీ తారతమ్యం ఇదన్నమాట.





# నిర్లక్ష్యం!

ప్రతి జీవితానికి ఓ లక్ష్యం వుంటుంది. పుట్టింది మొదలు ఆ మనిషి మనస్సులో ఆ లక్ష్యం తాలూకు భావాలే కదులుతూ వుంటాయి. ఆ భావాలకనుగుణంగానే ఆ మనిషి చర్యలు ప్రస్ఫుటమవుతూ వుంటాయి. కొందరికి జీవితం పట్ల ఏ రకమైన ధ్యేయమూ వుండదు. గాలివాటుగా ఏ సమయానికి ఏది తోస్తే అది చేస్తుంటారు. ఇలా లక్ష్యంలేని జీవితాలు వేటికీ ప్రాముఖ్యతనివ్వవు. జీవితం అంటే - ఏదో ఆటవిడుపులా సాగిస్తారు.

కొందరు తమ విషయంలోనే కాదు.., ఎదుటివాళ్ళ విషయంలో కూడా లక్ష్యం చూపించరు. అదే నిర్లక్ష్యం.

అత్యవసర విషయంపైన గట్టిగా చెప్పి 'ఆ పని ఎలాగైనా అయేటట్టు చూడండి' అని ఓ పెద్ద మనిషికి విన్నవించామనుకోండి. ఎంతో భరోసా ఇచ్చినా మర్నాడు పలకరించేసరికి తడుముకోకుండా 'అనుకున్నాను కానీ, వీలు కాలేదు. అవునూ... ఇంతకుముందు అక్కర్లేదనుకున్నారు కదా?' అని మనకే ఎదురు ప్రశ్న వేస్తారు.

వస్తువుల పట్ల కొందరికి నిర్లక్ష్యం ఎక్కువ. జాగ్రత్తగా పెట్టవలసిన చోట ఏమరుపాటుగా పడేస్తారు అవి పగిలినా, విరిగినా అంతగా పట్టించుకోరు. కొందరు అతి విలువైన పుస్తకాలని, అందులో దాచుకోవలసిన ముఖ్యాంశాలనీ చిందర వందరగా వదిలేస్తారు. ఆల్బమ్‌లు, డైరీలు, రసీదులు లాంటివి అవసరమైనప్పుడు ఎంతగానో వెతకవలసి వస్తుంది.

భోజనాల దగ్గర ఆదరాబాదరాగా పరిగెత్తుతున్నట్టు తినేవారూ, కోళ్లు కెక్కరించినట్టు వేళ్ళతో మెతుకులు నెట్టేవారూ, తిండిపట్ల నిర్లక్ష్యం చూపేవాళ్ళే! ఉదయం లేచిన దగ్గర్నుంచి ఒక పద్ధతి, అలవాటు లేకుండా తోచినప్పుడు ఏదో చేస్తూ, కాలం వృథాగా ఖర్చుపెట్టేవాళ్ళు నిజంగా సమయం పట్ల నిర్లక్ష్యం చూపేవాళ్ళే! పెద్దవాళ్ళు పిలుస్తున్నా వినిపించుకోకుండా వెళ్ళిపోయేవారూ, కింద ఏదైనా పడినా తీసుకోకుండా, చూసుకోకుండా వెళ్ళిపోయేవార్ని చూస్తుంటే పక్కవాళ్ళకి చిర్రెత్తుకొస్తుంది. కొందరికి ఇంట్లో బట్టలమీద బొత్తిగా, ధ్యాస వుండదు. స్టాండ్‌లమీదో, తీగెలమీదో ఎక్కడ పడితే అక్కడ పడేసి మళ్ళీ వేసుకునేటప్పుడు కూడా ఏ మూలనుంచో తీసి వేసుకుంటారు.

సాధారణంగా నిరాశ, నిరుత్సాహం పేరుకు పోయినప్పుడు ఈ నిర్లక్ష్యం మనిషిని ఆవహిస్తుంది. అయితే - కొందరు ఇష్టపూర్వకంగా ఈ నిర్లక్ష్య ధోరణిని అలవాటు చేసుకుంటారు. శాస్త్రజ్ఞులు, కవులు, రచయితలు, కళాకారులు ఎప్పుడూ తమ లోకంలో వుండి చుట్టు ప్రక్కల గమనించ లేనంత నిర్లక్ష్యంలో వుంటారు.

ప్రేమికులు గడ్డాలు పెంచుకుని శూన్యంలోకి చూస్తూ తమ ప్రేమ సఫలమవుతుందో, లేదో... అన్న వేదాంత ధోరణిలో 'జీవితం అంటే మిథ్య' అన్న తలంపుతో నిర్లక్ష్య వైఖరి చూపిస్తూ వుంటారు.

ఇది నిజంగా వేదాంతం కాదు. అవకాశం కల్సివస్తే 'ఝూం'మంటూ వివాహం చేసుకుని విలాసపురుషుడిగా వుంటారు. అందుకని నిజంగా వేదాంతులు, జ్ఞానులు ఈ జీవితం పట్ల విరక్తి చెంది పరమాత్మని కనుగొనే లక్ష్యంతో ఈ లోకపు విధానాలపైన నిర్లక్ష్యంగా వుంటారు. వారికి జీవితంపైన ...్యం వుండదు.

కానీ - సామాన్యులమైన మనం జీవితానికో 'లక్ష్యం' వుంచుకుని, ఆ లక్ష్య సిద్ధి ద్వారా మనం ...రించి సమాజాన్ని ఉద్ధరించాలనుకోవాలి. లక్ష్యం గొప్పది. నిర్లక్ష్యం చిన్నది. ఏ విషయానికైనా ఇది వర్తిస్తుంది.






# క్షమ అంటే !

ఈ సృష్టి మహా సాగరం! ప్రతి మనిషి జీవితం ఓ పడవ లాంటిది. ఆటుపోట్లకి తూలిపోతూ, తేలిపోతూ గమ్యం చేరాలి. పడవ, పడవకీ మధ్య చేయూత, సహకరింపు వుంటే ప్రయాణం సుగమనం అవుతుంది.

ప్రతినిత్యం మనిషి ఎన్నో ఒడిదొడుకులు, ఎదురు దెబ్బలు, తప్పులు, పొరపాట్లు చేస్తూ రేపటి రోజులోకి ప్రయాణిస్తూ వుంటాడు. ఇలాచేసే తప్పులు, పొరపాట్లకి పక్కవాళ్ళ చేయూతో, సమర్థింపో దొరికితే ఎంత సుఖం!?

ఆ సమర్థింపు లేదా సహకరింపునే 'క్షమ' అంటాం. తప్పుచేసిన మనిషికి నిజానికి శిక్ష కదా పడాల్సింది? కాని, ఎదుటివారినుంచి క్షమ లభిస్తే ఎంత అదృష్టం!? అలాంటి క్షమాగుణం కల మనిషి భగవంతునికి ప్రీతిపాత్రుడు.

'అమ్మో! పాలన్నీ పారబోసేవ్. అమ్మ వచ్చిందంటే చంపేస్తుంది'. అంటూ చిన్న పిల్లలు తప్పు చేస్తే బెదిరిస్తాం. అంటే ఏమిటి అర్థం? తప్పుచేస్తే ఆ తల్లి క్షమించదన్నమాట. అందుకే కొందరి ఇళ్ళల్లో పిల్లలు ఏదైనా తప్పుచేస్తే హడలిపోతూ, ప్రాణాలు బిగబట్టుకుని వుంటారు. కొన్ని స్కూళ్ళల్లో పిల్లలు టీచర్లంటే బిక్కచొచ్చుకుపోతారు. అక్కడుండే మిలట్రీ డిసిప్లేన్ అలాంటిది. ఖర్మం చాలక ఏ చిన్న పొరపాటో చేస్తే... ఇక ఆ కుర్రాడికి (అమ్మాయికి) ఇచ్చే పనిష్మంట్ (శిక్ష) ఊహించలేం.

కొందరి ఇళ్ళల్లో కొన్ని పద్ధతులుంటాయి. కొత్తవారికైనా, కొత్త కోడలికైనా... అవి తెల్సుకుని నడిస్తే తప్ప - లేకపోతే చీవాట్లు, అవమానం తప్పదు. క్షమించడమనేది వుండదు ఆ ఇంట్లో.

నేరాలు, హత్యలు చేసేవాళ్ళకి కఠినశిక్షలు వేస్తారు 'లా' ప్రకారం! కానీ, కొన్ని సందర్భాలలో క్షమాభిక్ష లభించి, శిక్ష రద్దు అవుతుంది. నేరస్థుడైనా సరే... ఆ క్షమ దొరికితే పరివర్తన చెందుతాడు. అంతర్యంలో ఓ గొప్ప రిలీఫ్, కృతజ్ఞత లాంటి భావాలు కలుగుతాయి. 'క్షమ'లో అంతటి శక్తి వుంది.

మహనీయులు, మహాత్ముల వారి దగ్గరకి వచ్చి 'నేనిలాంటి తప్పుచేసేను. స్వామీ... నన్ను రక్షించండి' అని ఏ సామాన్యుడో అడిగేడనుకోండి. ఓ చిరునవ్వు విసిరి చేయిఎత్తి దీవిస్తారు. అదే 'క్షమాభిక్ష! చాలు... ఆ సామాన్యుడి మనసు తేలికైపోతుంది.

జీవితాంతం కష్టపడి రాసిన కాయితాలు, పరిశోధనా ఫలితాన్ని దీపంతోసి మండిపోయేలా చేసింది తన పెంపుడు కుక్క. అతి శాంతంతో 'నీకుదాని విలువ తెలియదు పోనిలే...' అని తల నిమిరి క్షమించేడు. ఆ క్షమాగుణమే లేకపోతే ఆ కుక్కని కాల్చిపారేసి వుండేవాడు. కాని, అతనిలోని క్షమాగుణం ఆ పని చేయనివ్వలేదు.

అంతటి శాంతం, నిగ్రహం ఉంటే 'క్షమ' దానంతట అదే అబ్బుతుంది ఎవరికైనా.

అతి చిన్న విషయాలకి కూడా ఆగ్రహం తెచ్చుకొని క్రిందవాళ్ళని తిడ్తూ పనిష్మెంట్లు ఇస్తూ ఉంటారు అధికార్లు. ఆ తర్వాత ఎప్పుడైనా తమ ప్రవర్తన గురించి వారు గుర్తు తెచ్చుకుంటే తెచ్చుకోవాలి. సిగ్గుపడాల్సివస్తుంది.

మనకి చదువుల ప్రభావం వల్ల 'సారీ'లు చెప్పటం అలవాటైంది తప్ప, అది నిజానికి క్షమించటం కాదు. కాలుతొక్కి, చెయ్యితగిలి, శబ్దంచేసి, ఏవో చిన్నచిన్న అభ్యంతరాలు చేసి 'సారీ' అనడం, ఫర్వాలేదని అనిపించుకోవటం, మనకి బాగా అలవాటైన పద్ధతికానీ, నిజంగా మనకి కష్టం కలిగినా, నష్టం కలిగినా క్షమించే గుణం నిజమైన క్షమాగుణం!

ప్రతిరోజు మనం చేసే తప్పులెన్నో మనకితెలుసా? తెలియకుండా చేసే ఈ తప్పుల్ని భగవంతుడు క్షమించేస్తూ ఉంటాడు, మనం అడగక పోయినా, వేడుకోకపోయినా.

భగవతాంశ అయిన ఈ క్షమాగుణం మానవులమైన మనం అలవరచుకుంటే ఈ సంసార సాగరాన్ని తేలిగ్గా దాటగలం. క్షమంటేనే దివ్యత్వం!





# అలవిగాని చోట. . .

తన ఉనికికీ, తన మాటకీ విలువలేని చోట ఎవరైనా ప్రత్యేకత చూపిస్తానంటే సాగదు! అందుచేత ఎవరైనా నీలుగాని చోట ... అధికారం చేసినా, దర్పం చూపినా చెల్లదు. కనుక మనకి సాధ్యపడని చోట ఒదిగి వుండటం బుద్ధిమంతుల లక్షణం!

మన ఇంట్లో తమ అధికారం, పెత్తనం చేసేవాళ్ళు ఎక్కడికైనా వెళ్ళినప్పుడు అక్కడున్న వాళ్ళమీద అధికార పూర్వకంగా మాట్లాడుతానంటే వాళ్ళు సహించకపోవచ్చును.

పదిమంది కలిసివుండే చోట్లు సాధారణంగా కొన్ని వున్నాయి. గ్రంథాలయాలు, ఆసుపత్రులు బస్సుస్టాండ్‌లు, రైల్వే ప్లాటుఫారాలు, సినిమా హాళ్ళు, సభలు, సమావేశాలు, పెళ్ళిళ్ళు మొదలై, శుభకార్యాలు! ఇక . . .దుకాణాల్లో కిరాణా కొట్లల్లో జీవితావసరాల కొరకు వస్తారు గనుక అక్కడ తొందర, అవసరం ఎక్కువ వుండటం చేత మనిషి అధికార వాంఛ అంతగా వుండే ఆస్కారం లేదు. వున్నా మిగతావారు అంతగా పట్టించుకోరు.

కాని స్థిమితంగా కూర్చుని నలుగుర్నీ పరికించే స్థలాల్లో వున్నప్పుడు కొందరు సహజసిద్ధంగా తమలో వున్న పెత్తందారీ గుణాన్ని పైకి కనబరుస్తారు.

'ఇదిగో చూడు నువ్వు కాస్త అటు జరుగు! వీళ్ళు కూర్చోవాలి! అందరూ కూర్చోటానికే ఈ సీట్లు! నువ్వు ఆక్రమించుకుంటే ఎలాగ?' అంటూ బస్సుస్టాపులోనూ, ఆసుపత్రిలోనూ పెద్దరికం

వెలగబెడ్తారు కొందరు. అసలే విసుగు, చికాకు, అస్వస్థతగా వున్నవారికి ఈ రకం అదమాయింపులు ఎదురైతే ఒళ్ళు మండుకువచ్చి, తిరగబడి నాల్గు దులుపుతారు.

మరికొందరు చుట్టాల ఇళ్ళకి వెళ్ళి వాళ్ళ పిల్లలమీద, వాళ్ళ క్రమశిక్షణమీద అధికారం చేయటం తామేదో పెద్దవాళ్ళం అనుకుని, "ఒరేయ్ నేను మీ నా[illegible]పెట్టేవాడినిరా చిన్నప్పుడు! ఇప్పుడు నువ్వేదో కాలేజీ చదువు వెలగబెట్టున్నానని కాలరెత్తేయకు! ఆఫ్టరాల్ నా అనుభవంలో నీ వయస్సెంత?" అంటూ మొదలెట్టారు. దానితో ఆ వయస్సు వచ్చిన పిల్లలకి చిరాకెత్తి "మీరు మా ఇంటికి అతిథులు మాత్రమే! ఆధిక్యత చూపకండి" అని తిరగబడ్డారు.

ఆఫీసులో కొందరు తమ ఆధిక్యత చూపబోతారు. అలాగే పెద్ద కుటుంబాల్లో శుభకార్యాల పట్ల తమ పెత్తనం వెలగబెట్టి ఇతరులపై ఆజమాయిషీ చేయాలని కొందరికి మహా ఉబలాటంగా వుండి అలాంటి అవకాశం ఇవ్వకపోయినా కల్పించుకుని పెత్తనం చేస్తారు.

ఇంకా కొందరు ఒకప్పుడు తాను చాలా పరపతిగా, దర్జాగా పెరిగానని ఇప్పుడూ అలాగే సాగాలనుకుని మనుషులమీద, వాళ్ళ భార్యల మీదా అధికారికంగా మాట్లాడి, తమని గౌరవించ మన్నట్లు ప్రవర్తిస్తారు!

ఇదంతా అజ్ఞానమే! తమకి అలవిగాని చోట, స్థానబలిమి లేనిచోట పరిస్థితులు మారిపోయినప్పుడు ప్రతివారు తమ ప్రవర్తన మార్చుకోవాలి 'అది ప్రకృతి ధర్మం'.

పంచపాండవులంతటివారు విరాటుడి కొలువునందు ఒదిగి బ్రతికేరు. రాజ్యాధిపతులెందరో కాలం కలసిరాక తలవంచారు. రిటైర్ అయిన ఆఫీసర్‌గానీ, పదవిపోయిన మంత్రిగానీ ఎందుకూ పనికిరాడు. అతగాని మాట ఎవరూ వినరు. అందుకని కాలాన్ని, సమయాన్ని గ్రహించుకుని విధేయతని పాటించటం లేదా మౌనంగా వుండటం బుద్ధిమంతుల లక్షణం!

అందుకే వేమన అన్నాడు -

"అలవిగానిచోట అధికులమనరాదు
కొంచముండుటెల్ల కొదువగాదు
కొండ అద్దమందు కొంచమై వుండదా
విశ్వదాభిరామ వినుర వేమ"





# మూర్ఖత్వమంటే . . .

తెలిసిన వాడికి చెప్పవచ్చును. . .  తెలియనివాడికి చెప్పగలం! కాని తెలిసీ తెలియని మూర్ఖులకి చెప్పలేమని పెద్దలంటారు! కొంత తెలిసి, కొంత తెలియకవుండే మనుషులకి ఏ విషయాన్ని గురించి చెప్దామన్నా, వాళ్ళు వినిపించుకోరు! అదే మూర్ఖత. తనకి తెలుసునన్న సంగతి కాదని ఒప్పుకోవటం, మూర్ఖుడికి నచ్చదు. ఒకసారి వాళ్ళ బుర్రకి ఏదైనా ఎక్కించా. . .  ఇక అది మంచైనా చెడ్డైనా అది బుర్రకి పట్టి వుండిపోతుంది తప్ప- చెరగదు!

ఈ మూర్ఖత్వం చాలామందికే వుంది! వాళ్ళు చెప్పిందే ఎదుటివాళ్ళందరూ నమ్మాలి, వినాలి అంతేగాని, ఒకవేళ మనకి తెలియదేమో?. . . తెల్సుకుందాం . . .  అనుకోరు!

అజ్ఞానం, అహంకారం కలిసి చిక్కబడితే అది మూర్ఖత్వంగా రూపుదాలుస్తుంది!

నీతికథల్లో మిత్రభేదం కథలు చెప్తూ - పరవస్తు చిన్నయసూరిగారు ఈ మూర్ఖత గురించి విశదంగా చెప్పేరు. అలాగే యోగి వేమన . . . ఇనుమును కరిగించవచ్చును, ఇసుకలోనైనా నూనె తీయవచ్చును, కుందేటికి కొమ్మునైనా సాధించవచ్చును గాని మూర్ఖుల మనసు రంజింప చేయలేమన్నాడు.

రాజుగారు మూర్ఖుడయితే, ఆ ప్రజలు ఎలాంటి ఇక్కట్లు భరించేవారో మన చరిత్ర పుటల్లోని కథలే సాక్ష్యం.

ఎక్కడో కథలు అక్కర్లేదు. మనకి నిత్యం ఇంట్లో బయటా ఎందరో బంధుమిత్రులు, పరిచయస్థులు వుంటారు. ఇందులో మూర్ఖులు తటస్థపడినప్పుడు మన అవస్థ ఎవరికి వారికే అనుభవం! సమయాసమయాలు గానీ, ఉచితానుచితాలు గానీ ఆలోచించరు మూర్ఖులు.

కొందరికి ఆచారాలలో, శునాలు చూసుకోవడంలో, సాంప్రదాయాలు పాటించటంలో పట్టుదల, నమ్మకం వుంటాయి! ఇందులో తప్పులేదు. అర్థం తెలిసిన వ్యవహారాలు జరిపించటంలో ఆక్షేపణ ఏమీ లేదు. కాని. . . కేవలం తను నమ్మిన దానికి అర్థం తెలియకపోయినా జరిగి తీరాలని పట్టుబట్టేవారు ఇతరులని ఎంత ఇబ్బంది పెట్టి హింసిస్తారో? ముఖ్యంగా. . . శుభకార్యాలలో, అశుభకార్యాలలో కూడా 'తంతు' అన్న పేరుతో నానా రభసా చేసి చుట్టూవున్న వాళ్ళని హడలగొట్టడం, బాధించటం చేస్తారు! కష్టకాలంలో ముఖ్యంగా చూపవలసినది మానవత్వం! ఆచారం పేరిట మూర్ఖంగా ప్రవర్తించి వారం, వర్జ్యం చూసి ఓదార్చాలనటం, దు:ఖితులైవున్న వారిని తప్పుకు తిరగటం ఇవన్నీ మూర్ఖులు చేసే పనులు.

ఆఫీసు విషయాలు ఏదైనా చెప్పబోతే "ఆ (రూల్స్, రెగ్యులేషన్స్) నియమాలు, నిబంధనలూ మీకు తెలియవు. ఊరుకోండి. నాకు తెల్సును" అని అడ్డదిడ్డంగా వాదించేవారుంటారు! 'ఫలానా నటుడికి ఇద్దరు పెళ్ళాలుట!' అంటారనుకోండి. 'అయ్యో. . . అతనికి ఇంకా పెళ్ళే కాలే'దని మనం చెప్పబోయినా ఒప్పుకోరు!! భర్త జీతం, హోదా పక్కావిడతో చెప్పేటప్పుడు అవతలి ఇల్లాలి భర్త కూడా ఉద్యోగస్థుడే అని గమనించకుండా ఎక్కువ జీతం చెప్పి 'మా వారి ఆఫీసులో అంతే!' అని వాదిస్తే ఏమనుకోవాలి? తెలియని విషయాలు తెలుసుకోవాలనుకోవటం విజ్ఞత, వివేకం! తెలియకపోయినా వాదించి గెలవాలనుకోవటం మూర్ఖత్వం! కేవలం తామసంతో కూడుకున్నదీ మూర్ఖత! డాంబర్, వార్నిష్ లాగా చిక్కబడి వుంటుంది!

'గీత'లో ఈ మూర్ఖత్వాన్ని గురించి చెప్తూ ఉదాహరణకి - మహనీయుల వాక్కులను కూడా చేరుస్తారు. మూర్ఖతంటే అజ్ఞానమే అనీ. . . అది పొగబట్టిన గాజు బుడ్డిలాగా మసితో నిండి త్వరగా శుభ్రం కాదని చెప్తారు . . . .!

మనకి తెలియకపోతే మౌనం వహించాలి! లేదా. . . ఒకళ్ళు చెప్తే వినటం నేర్చుకోవాలి! కానీ. . . మూర్ఖత్వం చూపి మనిషి నుంచి పశువుగా మారకూడదు.






# అపాత్రదానం !

పాత్ర నెరిగి దానం చేయాలి అనేది పెద్దల వాక్యం!

'దానం' అనేది చేసేవాడూ, తీసుకునేవాడు కూడా ఆ దానం అనే అర్థాన్ని సార్థకత చేయాలి! అప్పుడే పరమార్థం చేకూరుతుంది! ఇంతకీ 'అపాత్ర' అంటే 'యోగ్యత లేని' అని తాత్పర్యం!

దానం - ధర్మం అనేవి యోగ్యత చూసి ఇస్తారా? అనే సందేహం సామాన్యులకి కలగటం సహజం! నిజమే. . . దానం చేయాలంటే మనం ఇచ్చేది పుచ్చుకునేవాడు, అందుకోగలడా? లేదా? అని ఆలోచించాలి.

పూర్వం తాము దాన ధర్మం చేస్తే దానికి తగినవారు, అంటే (ప్రతిఫలం తిరిగి దక్కాలని ఆశించి) యజ్ఞయాగాలు, కామేష్టులు, వ్రతాలు, నోములు, సంతర్పణలు, గోదాన, భూదాన, అన్న వస్త్ర, సువర్ణాది దానాలు చేసేవారు (ఇప్పుడూ చేస్తున్నారు). వాళ్ళ దానం గ్రహించి దానికి ప్రతిగా తమ ఆశీర్వచనాల్లో కోరిక తీర్చటమో చేసేవారు! అలాంటి శక్తిలేని వారు అయోగ్యులన్న మాట!

అయితే . . 'అపాత్ర' అంటే నిరుపయోగమైన పదవి అని కూడా గ్రహించాలి! ఎవరికి అవసరమో వారికి దానం చెయ్యాలి గానీ . . . అక్కర్లేనివారికీ, నిగ్రహించుకోలేని వారికీ, దుర్వినియోగం చేసుకునే వారికీ దానం చేయకూడదు!

'దానం' అనగానే బీదవాళ్ళకీ, భిక్షకులకి ఇచ్చేదే కానక్కరలేదు. ఉద్యోగం, సత్కారం, వివాహం, ఇళ్ళూ, భూములు పట్టాలివ్వటం, బిరుదులు, అవార్డులు ఇవ్వటం, అధికారాలివ్వటం, నాయకుడిని ఎన్నుకోవటం ఇవన్నీ దాన, ధర్మం క్రిందికే వస్తాయి.

రూల్ ప్రకారం ఉద్యోగాలు ఇస్తున్న ఈ రోజుల్లో అర్హత లేనివారు ఎందరో వున్నారు. ఈ గొప్పదనం లేకపోయినా, సత్కరిస్తున్నారు. పనికి మాలిన అల్లుడు (కోడలు) అయోగ్యులే! ప్రభుత్వం వారిచ్చే ఇళ్ళు తీసుకుంటున్న వారికి (క్వార్టర్స్‌లో వుంటున్నవారికి) స్వంతఇళ్ళు వుంటున్నాయి. ఇక ఏ విషయం లేకపోయినా గొప్ప బిరుదులు, బహుమతులు ఇవ్వడం, దుష్టుడైన నాయకుడిని ఎన్నుకోవడం ఇవన్నీ 'అపాత్ర దానాలే!'.

బిచ్చగాడికి అన్నం వేసేటప్పుడు ఆ పాత్ర ఖాళీగా ఉంటే పచ్చడో, కూరో ముందు దాంట్లో వేసి తర్వాత అన్నం వేయడం చాలామంది చేస్తారు. దీనికి అర్థం ఏమిటంటే వాడికి ఎవరూ భిక్ష వేయలేదు గనుక అర్హత లేనివాడనీ అటువంటి అభాగ్యులకి బిచ్చం వేయకూడదని! అయితే ... మనమే ముందు పచ్చడో, కూరో వేస్తే గిన్నె ఖాళీగా ఉండదు గనుక, అప్పుడు అన్నం వేయవచ్చుననీ పెద్దల తీర్మానం!

అదే నిత్యజీవితంలో అన్వయించుకొని ఏదైనా యితరులకి ఇవ్వదలచినట్లయితే (డబ్బే కానక్కర్లేదు) వాళ్ల గురించి తెలుసుకొని ఇవ్వడం మంచిది!

ఈ రోజుల్లో యాచకులు కూడా మోసాలు చేస్తున్నారు మనం జాగ్రత్తగా గమనించి వేయకపోతే చేసిన దానం విష్రప్రయోజనం అవుతుంది. బూడిదలో పోసిన పన్నీరుకి ఎంత విలువో అదీ అంతే! తాగుబోతు కొడుక్కి తాళంచెవులు అందిస్తే ఇల్లు గుల్లవుతుంది. అహంకారి కోడలికి అధికారం ఇస్తే అత్తమామలు ఆశ్రమాలకి పోవాల్సి వుంటుంది. అలాగే. . . ధనవంతుడికి కానుకలు అనవసరం! భుక్తాయాసం తీర్చుకుంటున్న వాడికి పాలూ పళ్ళూ ఇవ్వక్కరలేదు.

పాత్రనెరిగి చేసిన దానం (కార్యం) ప్రయోజనకారిగా వుండి. . . ఇచ్చినవాడికీ, తీసుకున్నవాడికీ సంతృప్తినిస్తుంది! అదే ధర్మం! ఆ ధర్మమే సమాజాన్నీ దేశాన్నీ పరిరక్షిస్తుంది!






# కంగారంటే?

చీమలు పుట్టలుగా వున్నచోట ఒక కర్రపుల్లతో గాని, వేలితో గానీ కదిపితే ఏం జరుగుతుంది? ఒక్కసారిగా అవి విడిపోయి చెల్లాచెదురుగా అటు ఇటు తిరుగుతాయి! మళ్లీ మొదటి స్థానం చేరుకునే సరికి కొంత సమయం పడుతుంది.

మొదటిస్థితి నుంచి రెండోసారి మళ్ళీ ఆ స్థితి చెందేలోపల అవి పడే తొందరనే 'కంగారు' అని అంటాం.

మనిషి కూడా మామూలుగా నిదానంగా వుండి పనులు చేసుకుంటూ వుంటే ఆ పనిమీదే దృష్టి నిలిపి ప్రశాంతంగా వుంటాడు. కాని... ఏదైనా అనుకోకుండా ఒత్తిడి లేదా తొందర వస్తే అతని నరాలు పట్టు తప్పినట్లై భావాలు చెల్లాచెదురై కంగారుపడతాడు. తిరిగి మళ్ళీ యథాస్థానానికి రావటానికి ఆ నరాల ప్రకంపనలు తగ్గాలి!

ఒక తీగని గట్టిగా లాగి వదిలితే అది పైకీ క్రిందకీ ఊగి మళ్లీ మొదటి స్థానం చేరటానికి కొంచెం సమయం పట్టడం మనం గమనిస్తాం గదా! అలాగే ప్రశాంతంగా వున్న చెరువులో గాని, నీటి తొట్టెలో గాని రాయో, కర్రముక్కో వేస్తే రింగులు రింగులుగా చెదిరి తరంగాలు కనిపిస్తాయి.

మానవుడి మెదడులో నరాలు ఒక క్రమపద్ధతిలో వుండి పనులు చేసుకున్నప్పుడు కంగారు వుండదు. కానీ, ఎవరైనా వచ్చి 'ఇదిగో - ఈ పని అర్జెంటు... ఇది చెయ్యి' అనీ అదే సమయంలో

'వాళ్ళు వస్తున్నారు. . . గబగబా చేసేయి' అనీ, ఇదిగో చూడు - బస్సు వచ్చేసరికి మనం రెడీగా వుండా'లనీ ఈ లోపులో 'అదిగో - గ్యాస్‌స్టవ్‌మీద అది పొంగిపోతోం'దనీ 'అరె! ఆ పంపు కట్టేయి' అనీ. . . ఒకే సమయంలో చేసే పనులు గాని లేదా అతి తక్కువ సమయంలో చేయాల్సిన పని గురించి గానీ చెప్తే మనిషి చాలా కంగారు పడతాడు.

కారణం ఏమిటంటే. . . ఏ పనికైనా కొంత సమయం, వ్యవధి కావల్సి వుంటుంది! అటువంటప్పుడు తొందరపెట్టి త్వరగా చెయ్యమంటే నరాలు ఎక్కువ వేగం పెంచుకుని బలం పుంజుకోవలసి వస్తుంది. దానివల్ల - అంటే. . . ఆ ప్రకంపన వల్ల కంగారు పడతాం! ఎక్కువ పనులు చేయాలన్నా, ఒక పని తక్కువ వ్యవధిలో చేయాలన్నా ఈ కంగారు కల్గుతుంది.

పరీక్ష హాల్లో చివరి గంటలో ప్రతి విద్యార్థికి కంగారే! రైలుకి వెళ్ళే వాళ్ళకీ కంగారే. కొందరు రచయితలు, కళాకారులు కొన్ని పోటీలకి వ్రాసేటప్పుడు, పాడేటప్పుడు గడువు దాటిపోతోందని తెగ కంగారుపడి పోతారు.

ఈ కంగారువల్ల మనిషి బలం తగ్గి నీరస పడతాడు. లేదా. . . ఉద్రిక్తత వల్ల రక్తపోటు తెచ్చుకుంటారు. చికాకు, మానసిక వ్యధలు వస్తాయి. ఇంట్లో మనం గడియారం చూస్తూ పనులు చేసుకుంటూ వుంటే మంచిదేగానీ, దానివల్ల నిముష నిముషానికీ గుండెదడ వస్తుంటుంది! 'అమ్మో. . . అప్పుడే పదా? అయ్యో. . . పదకొండవుతుందే!' అని కంగారుపడి వున్న బలం చెదిరినట్టై చెయ్యగల్గే పని కూడా చెయ్యలేకపోతాం!

కొందరు ఊరికే తొందరపాటుతనం ప్రదర్శిస్తూ వుంటారు. అవతల పెద్దగా అవసరం లేకపోయినా నిత్య అవసరాల్లో కూడా తెగ వేగం చూపించి ప్రక్కవాళ్ళని కంగారుపెడ్తూ వుంటారు.

ఉదయం లేచింది మొదలు 'లేవండి లేవండి' అని అందర్నీ లేపుతూ కాఫీల దగ్గర, వంట దగ్గర భోజనాల దగ్గర తెగ హడావిడి పడుతూ మిగతావాళ్ళని పరుగులెట్టిస్తారు.

పెళ్ళిళ్ళలో, వేరే శుభకార్యాలలో కొంతమంది ఎంతలా పరుగుపెడ్తూ పనులు చేస్తారో మనం చూస్తూనే వుంటాం. మగపెళ్ళివారు ఆడపెళ్ళివార్ని తెగ కంగారు పెడ్తారు.

కంగారు అనేది 'జీవితంలో ప్రతి ఒక్కరోజు వృథాగా పోగొట్టుకుంటున్నామే! అయ్యో. . . ఉపయోగకరమైన పనులు చేద్దాం' అని పడాలి గానీ పనికిమాలిన వాటికోసం కాదు !!





# అయిష్టత (ఎలర్జీ)

మనలో చాలామందికి చాలా రకాల ఇష్టాయిష్టాలు వుంటాయి. కొందరికి నచ్చినవి మరికొందరికి బాగుండక పోవచ్చును. అవి ఆహార పదార్థాలు కావచ్చును, ధరించే దుస్తులు కావచ్చును, చేసే ఉద్యోగం కావచ్చును. చూసేవి, వినేవి, చెప్పేవి ... ఇలా ఏదైనా కావచ్చును. అటువంటి అనుభవం వారికి నచ్చదన్న మాట! దీనినే మనం 'అయిష్టత (ఎలర్జీ) అంటాం!

చిన్నపిల్లల్లో పెరుగు అంటే ఇష్టపడని వారుంటారు. అలాగే కొందరు పెద్దవాళ్ళకి పాల వాస గిట్టదు. కొంతమంది నేతిపేరు చెప్తే వాంతి చేసుకున్నంత పని చేస్తారు! ఈ రకమైన తినే వస్తువు-యందు (ఎలర్జీ) అయిష్టత వున్నవారు ఎక్కడికి వెళ్ళినా కష్టం! పక్కవాళ్ళు తింటున్నా వీరు భరించలేరు.

ఇక వాసనల్లో ఎన్నో రకాల ఎలర్జీలున్న వారుంటారు. చలిగాలి ముక్కుకి తగిల్తే చాలు... గంటలో వాళ్ళకి మాట బరువెక్కి ముక్కు దిబ్బెడ అవుతుంది. కొందరికి బూజులు దులిపినా, పుస్తకాలు సర్దినా, పాతబట్టలు మడతలు విప్పినా పడదు. ఆయాసం వచ్చేస్తుంది. ఇంట్లోనూ వంటలు వండితే ఆ పొగ పీల్చేసరికి కళ్ళు తిరిగి పడిపోతారు. అంటే స్పృహ పోతుంది. ఇక కొందరికి సెంట్లు, పన్నీరు, సుగంధ ద్రవ్యాల వాసన సరిపడదు! కొన్ని కూరల వాసనలు, మందుల వాసనలు ఇష్టపడనివారూ ఉంటారు. అదే విధంగా కొందరికి దుస్తుల్లో ఎలర్జీలుంటాయి. నైలెక్స్, సిల్క్, ఉన్ని, ఫ్లానల్ లాంటి బట్టలు, బనియన్లు , రగ్గులు కొందరికి నచ్చవు. అవి ధరించినట్లైతే వాళ్ళు ఏదో ఒక అస్వస్థతకి

లోనవుతారు. ఎందుకో తెలియదు. జీవితం బాగానే వుంటుంది. అయినా సరే... మనస్సుకెందుకో బాగులేదు అంటారు. ఇదీ ఒక రకం అయిష్టతే.

వీటన్నిటిని బట్టి తెలిసేదేమిటి? ప్రతి మనిషికి ఇష్టాలు, అయిష్టాలు వున్నా ... వంటికి, మనసుకి పడనివి ఎలర్జీలనిపించుకుంటాయి! అంతే... తనకు తానుగా ఆ వస్తువునో, వాసననో ఏవగించుకుంటాడు. అదే వస్తువును మరొకరు ఆప్యాయంగా స్వీకరించగలరు.

రంగుల్లో కూడా ఎలర్జీలు అనుభవించే వారుంటారు. ఎరుపు కొందరికి పడదు. తలనొప్పి వస్తుంది. నలుపు చూస్తే అసహ్యం వేస్తుంది కొందరికి. పెద్ద పెద్ద డిజైన్లు వెర్రి గీతలున్న బట్టలు కొందరిని భయపడేలా అవుతుంది.

ఇవన్నీ కాక... కొందరికి సినిమాలు చూసినా, పుస్తకాలు చదివినా, కొంచెం గట్టిగా మాట్లాడినా, కణతలు నొక్కుకుని చికాకు పడతారు. కొందరికి కొన్ని రకాల చప్పుళ్ళు ఎలర్జీ. గోడ మీద గోరుతో గీస్తే చాలామందికి ఎలర్జీగానే అనిపిస్తుంది. దువ్వెనతో నేల బరికినా, రేకుముక్కతో గీసినా ఆ చప్పుడు ఎలర్జీగా వుంటుంది.

ఎన్నోరకాల ఉద్యోగాలు చేస్తుంటారు. నిజంగా ఆ వృత్తియందు ఇష్టం వుండి చేసేవారు చాలా తక్కువ. 'నాకు ఈ ఉద్యోగం అంటే బొత్తిగా ఇష్టం లేదండీ... మానేయాలనుకుంటున్నాను!' అంటారు.

ఇలా మనిషి మనిషికీ వుండే విభిన్న మనస్తత్వాలు వారి జీవితంలో నడిచే మార్గాన్ని నిర్ణయిస్తాయి! అందరూ ఒకే అభీష్టం కలిగి ఒకే మార్గంలో నడవటానికి వీలులేని అజ్ఞాతశక్తే ఈ 'ఎలర్జీ' అనేది. నమ్మకపోయినా ఒక సత్యం తెలుసుకోవాలి. అదేమంటే గత స్మృతుల (పూర్వ వాసన) వల్ల ప్రతి మనిషిలో కొన్ని శక్తులు (వాసనలు) నిక్షిప్తమై ఏదైనా అనుభవించాలనుకుంటే ఈ ఎలర్జీ ఎదురు తిరిగి అటంకపరుస్తుంది. అవే మనిషి మనిషికి ఉండే తేడాలుగా ఇంతమంది జీవితాల్లో ఇన్ని విభిన్న రీతులలో సాగుతున్నాయి. అందరికీ ఒకే అభిరుచి, అభీష్టం వుంటే? ఊహూ... వుండదు. ఎవరికి నిర్ణయించిన మార్గం వారిదే అన్నట్లుగా 'ఎలర్జీ' అనే బటన్ - స్విచ్ నొక్కి మనిషిని నడిపిస్తుంది.





# సుపుత్రులనగా?!

'అపుత్రస్య గతిర్నాస్తి!'

అని పెద్దలు చెప్తూ వుంటారు. పుత్రులు కలగకపోతే గతులుండవు. అనగా జన్మాంతర మందు వారికి పుణ్యలోక ప్రాప్తిని కలగచేసి తిరిగి మంచి జన్మ వచ్చేవిధంగా పుత్రులైనవారు తల్లిదండ్రులకి కార్యకర్మలు చేయాలనీ, చేస్తారనీ ఆశించి పుత్రులు కావాలని కోరుకుంటారు. జన్మ పరంపరలు నమ్మినా నమ్మకున్నా ప్రస్తుత పరిస్థితులలోనైనా - అనగా... నిత్య జీవితంలో కొడుకైన వాడు తల్లిదండ్రులకి చేయూతనిచ్చేవాడుగా వుండాలని అంతా అంటారు.

జన్మనిచ్చిన తల్లిదండ్రులు పిల్లల్ని బాగా పెంచాలనే అనుకుంటారు. విద్యాబుద్ధులు చెప్పించి, వివాహాది శుభకార్యాలు చేసి ఓ ఇంటివాణ్ణి చేసేవరకు తండ్రి కొడుకుల కోసం శ్రమిస్తూనే వుంటాడు.

తాను గృహస్థు కాగానే ఆశ్రమ ధర్మం ప్రకారం గానీ, తల్లిదండ్రుల మీద అభిమానంతో కాని వారి బాధ్యత తాను వహించటం కొడుకు ధర్మం. తండ్రిపైన వున్న బరువులు, బాధ్యతలు తాను పంచుకోవటంతో కొడుకు తండ్రికి ఆత్మానందం కల్గించి ఆత్మనందను డనిపించుకుంటాడు.

వయస్సు వచ్చిన కొడుకు తండ్రితో ఒక స్నేహితుడిలా, ఆప్తుడిలా, సలహాదారునిలా, కార్యదర్శిలా, వివిధ రూపాలుగా ఆదుకోగల్గి పితృఋణం తీర్చుకోవాలి.

విత్తనం నాటిన తరువాత మొలకెత్తుతుంది. ఆ మొలక మొక్కై, పెరిగి పెద్దయ్యేవరకు దానికి మాలి సంరక్షణ చాలా అవసరం. తరువాత అది స్వయంగా బలం పుంజుకుని కొమ్మలు రెమ్మలను

విస్తృతపరచి తన నీడని, ఫలాలనీ ప్రజలకి అందిస్తుంది. పుత్రుడైనవాడు పెరిగి పెద్దయ్యాక తన శక్తి సామర్థ్యాలతో ఇంటి బాధ్యత వహించటం సంసార వృక్షంలోని ధర్మం!

కానీ... పెద్ద అవుతున్నకొలది ప్రాపంచిక సుఖాల వ్యామోహంలోనూ, స్వార్థంతోనూ, తన చుట్టూ ఓ గిరి గీసుకుని తన సుఖం, ఆనందం చూసుకునే పుత్రులు ఈ కాలంలో ఎక్కువవు తున్నారు.

ఆస్థిపాస్తులు చూసుకోవటం, ఇంట్లో వస్తువులు పంచుకోవటం, తల్లితండ్రులతో పేచీలు గొడవలు పెట్టుకోవటం, వీలైతే వేరింటి కాపురాలు పెట్టుకోవటం రివాజైపోయింది. జన్మభూమి వదిలి విదేశాలలో వుందామన్న అభిలాష, సాధ్యమైనంత వరకు ఇంటి బాధ్యతలు తప్పించుకునే ప్రయత్నం చేయటం, కొడుకుగా పుట్టి అప్పులాడిలా ప్రతీదీ వసూలు చేయటం ఏ శాస్త్రంలోనూ మెచ్చనిది!

ఒక్కొక్క తండ్రి రిటైర్ అయినా మళ్ళీ ఏ పార్ట్‌టైం జాబో, ట్యూషన్లో చెప్పుకుంటున్న స్థితి మనం చూస్తూనే వుంటాం! జబ్బుపడితే ఆసుపత్రిలో వుండి నర్సుల మీద ఆధారపడే వాళ్ళుంటారు. అందరూ - అంటే... కొడుకు కోడళ్ళూ వున్నా ఆశ్రమాలని ఆశ్రయించేవాళ్ళుంటారు. ఇంటి ఖర్చులు బాగా పెట్టి పిత్రార్జితం పాడుచేసేడని కొడుకుతో తిట్లుపడి కోర్టుకెక్కిన ముసలి తండ్రులుంటారు. ఇదంతా కొడుకైనవాడు విచక్షణా రహితంగా ప్రవర్తించటం వల్ల జరిగే దురంతాలు!

తాను తండ్రిలోని భాగమనీ, ఆ అంశ తనలో వుందనీ ఈ సంసారపు నిచ్చెనలో పై మెట్టు మీద వున్నవాడికి (తండ్రికి) క్రిందనున్నవాడు (కొడుకు) సహకరిస్తే వారు త్వరగా గమ్యం చేరగలరని ఏ పుత్రుడైతే గ్రహించి ఆదుకుంటాడో వాడు సుపుత్రుడనబడతాడు. అటువంటి కొడుకులున్న తల్లిదండ్రులు ధన్యులు !!





# బోధ - బాధ !!

బుద్ధికి సంబంధించినది బోధ! శారీరక సంబంధమైనది బాధ! అయితే... బుద్ధి శారీరకమైనది, శరీరం ద్వారా బుద్ధికి కూడా సంతోష దు:ఖాలు కలుగుతూ వుంటాయి.

మానసికమైన బాధ భరిస్తున్నప్పుడు శరీరం అలసిపోతుంది. అలాగే... శారీరకంగా రుగ్మత గానీ, దెబ్బలు, బాధలు గానీ వున్నప్పుడు మనస్సు గిలగిల లాడుతుంది.

కనుక మనస్సు, శరీరం వెలుగు నీడల్లాగ, బొమ్మా బొరుసుల్లాగ కలసి వుంటాయి.

'బోధ' అంటే బుద్ధికి సంబంధించి తెలియచెయ్యటం! విద్యగానీ, విజ్ఞానం గానీ, హిత గానీ, ఆధ్యాత్మం గానీ, మంచిగానీ తెలియచేసి బుద్ధి వికసించి శారీరకంగా సుఖాన్నీ ఆనందాన్నీ అనుభవిస్తుంది. అటువంటి పరిణామం జరిగినప్పుడే అది 'బోధ' అనిపించుకుంటుంది.

అటువంటి బోధలు గురువులు, తల్లిదండ్రులు, స్నేహితులు, భార్య (భర్త) వలన వినవలసి వస్తుంది. ఇందులో గురువు ఒక్కడే సద్బోధ! అంటే... మంచి బోధ! అది విజ్ఞానపరమైనా, ఆధ్యాత్మికమైనా, హితవు అయినా సరే... చేస్తాడు. అందుకే గురువుని 'దైవం' అంటారు.

కాని... కొందరు గురువులు బోధకన్నా బాధ ఎక్కువ కల్గిస్తారు. అందుకే 'బాధ గురువు' 'బోధ గురువు' అంటారు. ఇక గురువు సంగతి వదిలి ఇతరులని గురించి చెప్పుకుంటే... తల్లితండ్రులు కూడ బోధ చేస్తారు. అందులో మంచీ వుండవచ్చును. చెడూ వుండవచ్చును. భార్యా (భర్తా) అంతే! స్నేహితులు కూడా మంచి చెప్పేవాళ్ళూ, చెడు చెప్పేవాళ్ళూ వుంటారు గదా!

అందుచేత బాధించే భార్యలు బోధలు కాదు!

'ఆ భార్య ఏం బోధించిందో గాని అతను పూర్తిగా మారిపోయాడు. స్వార్థపరుడైపోయి తల్లిదండ్రుల్ని సరిగ్గా చూడటం లేదుట'! అనుకుంటారు.

'స్నేహితుల బోధవల్ల వాడిలో చాలా మార్పు వచ్చింది. పేకాట, త్రాగుడు అన్నీ మానేసేడు' అంటారు. ఇది మంచిబుద్దే!

ఇక కొందరు ఉద్యోగ విషయంలో, వ్యాపార విషయంలో, ఇల్లు కట్టుకోవటంలో, వస్తువులు కొనుక్కోవటంలో ఊరికే చెప్తూ వుంటారు. దాన్ని ' బోధ' అనే అంటాం. కానీ... ఈ రకమైన బోధల్లో కొన్ని బాధించేవిగా వుంటాయి. అప్పులు చేసి అందరి చుట్టూ తిరిగి ప్రాధేయపడి, లంచాలు ఇచ్చి వాటివలన శారీరకంగా అలసి బాధపడి చేయాల్సిన పనులుంటాయి! ఇటువంటివి బోధించటం కన్నా బాధించటం ఎక్కువగా వుంటాయి.

'ఫలానా పరీక్షకి చదువు.... ప్రమోషన్ వస్తుంది! ఫలానా వ్రతం చేయి... పిల్లలు బాగుంటారు!' అని పెద్దవాళ్ళో, స్నేహితులో తెగ బోధ చేస్తారు. అలాగే బాబాలు, సన్యాసులు కొన్ని నియమాలు చెప్పి 'క్రమం తప్పక పాటిస్తే నీకు ఉజ్వల భవిష్యత్తు వుంటుం'దని బోధిస్తారు. ఆ బోధలకి లోబడి ఆ నియమాలూ, చదువూ, వ్రతం చేయటానికి ఎంత బాధపడవలసి వస్తుందో !!

ఈ రకమైన బోధలన్నీ శారీరకంగానూ, మానసికంగానూ అలసించి బాధిస్తాయి.

అసలు బోధంటే ఎలా వుండాలి?

ఒకసారి సుభాసు చంద్రబోస్ అన్నాట్ట.

'గార్డ్ ట్రైన్‌కి మైండ్ ఇస్తాడు. టీచర్ మైండ్‌కి ట్రైనింగ్ ఇస్తాడు' అని!

అలాగే బోధ ఎప్పుడూ బుద్ధికి పదును పెట్టేదై వికసింపచేయాలి.





# మోతాదంటే ?

పరిమితిని సూచించి 'అంతకన్నా దాటకూడదు' అని చెప్తే అదే 'మోతాదు' అని అర్థం!

సాధారణంగా రోగులకిచ్చే మందులు ద్రవరూపంలో కొలిచే పదార్థాలకి 'మోతాదు' అనే పదం ఉపయోగిస్తూ వుంటారు.

ఫలానా జబ్బుకి ఈ మందు 'ఇదిగో ఇంత' మోతాదులో సేవించాలని చెప్తారు. అంతకన్నా ఎక్కువ త్రాగితే ఫలితం వుండదు. తారుమారు అయి వికటిస్తుంది. మోతాదు మించిన మందు ఎలాగో ఆహారాది అలవాట్లూ అంతే!

పదార్థం బాగుంది కదా... అని కడుమానం ఎరగకుండా తింటే అజీర్తి చేసి జబ్బు చేస్తుంది. ఈ 'కడుమానం' అంటేనే కడుపుకి పట్టగల్గినంత... అనగా తిండికి మోతాదు అని అర్థం! కొందరికి ఎక్కువ తినవలసి వుంటుంది. కొందరికి తక్కువ తింటే సరిపోతుంది. ఎవరి మోతాదు వారిది!

అలవాట్లు కూడా అంతే! కాఫీలు, పాన్‌లు, తాంబూలం, సిగరెట్లు, జర్దా, త్రాగుడు... ఇవన్నీ నిజానికి చెడు అలవాట్లే. అయినా క్రమబద్ధంగా సేవించేటప్పుడు ఫలితం మామూలుగా వుంటుంది. మోతాదు మించితే దారుణంగా విషమిస్తుంది. త్రాగేవాడు ప్రతిరోజు కొంత మోతాదులో త్రాగితే తూలడు, పేలడు! కానీ... మోతాదు దాటిపోయి త్రాగితే ఒళ్ళు తెలియని పరిస్థితిలో పడిపోవటం, నోటికి వచ్చినట్లు వాగటం జరుగుతుంది. ఆ తర్వాత ఆరోగ్యం చెడి మరణం కూడా సంభవించవచ్చును.

అంటే... ఈ జీవితం కొన్ని హద్దులు పరిమితులకి లోబడి వుండాలి! అలా వున్నప్పుడే మనిషి ప్రశాంతంగా మనగల్గుతాడు. లేకపోతే నిండు జీవితం తొణికిసలాడి బయటికి ఒలికి పోతుంది. అదే జీవితం దెబ్బ తినడం!

ఇక... మోతాదు అనేది కేవలం ఆహార పానీయాలకే కాదు - వస్త్రధారణ, నిద్ర, కోరిక, ఆశ, ప్రవర్తన - ఇలా ప్రతి అడుగులో మనిషికి ఒక పరిమితీ, మోతాదు వుంటుంది. మంచితనానికీ, చెడుకూ కూడా ఒక హద్దు వుంటుంది. అంతేకాదు- తెలివితేటలకీ కొంత మోతాదు వుంటుంది. ఆ మోతాదులో వున్నప్పుడే ఆ తెలివితేటలు రాణిస్తాయి. అలాకాక... మోతాదు మించిన తెలివి అతి తెలివిగా పరిణమించి, వికటిస్తుంది. పనికిరాకుండా పోతుంది! ఇలాంటి అతి తెలివితేటలు గలవాళ్ళని (పర్వర్టెడ్ జీనియస్) అంటారు. వీళ్ళ తెలివి వృధాగా పోతుంది! విపరీతమైనదేదైనా వృధాయే కదా?

వర్షపు ధారలన్నీ నేలలో ఇంకిపోతాయి. లేదా ప్రవహించి ఎక్కడికో చేరుతాయి. అంతేగాని ఉపయోగానికి రావు. అలాగే... విపరీతమైన ఎండలు వడదెబ్బ కొడ్తాయి గాని 'విటమిన్స్' ప్రసాదించవు. తుఫాన్‌గాలి విసిరిపడేస్తుందే తప్ప మనసుకు ప్రశాంతత నివ్వదు.

స్నేహమైనా, విరోధమైనా, కొంత మోతాదులో వుంటేనే రాణిస్తుంది. మితి దాటితే అందరికీ విసుగే! పళ్ళు చెట్లకున్నప్పుడే ఉపయోగం! తెగకాసి నేలరాలి చితికిపోతే ఎందుకూ కొరగావు. సంతోషం, నవ్వు, దుఃఖం అన్నీ సమపాళ్ళుగా వున్నప్పుడే మనిషి అదుపులో వుంటాడు. ఏది మోతాదు మించినా తొణికిపోవాల్సిందే!

భగవద్గీతలో ఇలా చెప్తాడు భగవానుడు -

'ఆహారం, నిద్ర అన్నీ మితంగా వుంటేనే మనిషికి ఆత్మ సంయమయోగం సాధ్యం అయి ద్ధి లభిస్తుంది!





# విలువలు !

ఈ ప్రపంచంలో అతి విలువైనది ఒక్కటే. అదే మనిషి జీవితం! కానీ, మానవుడు తన జీవితం తప్ప మిగతావన్నీ విలువైనవిగా భావించి మోసపోతూ వుంటాడు. దేనికి విలువనివ్వాలో దేనిని విలువైనదిగా భావించాలో అసలు 'విలువ' అంటే అర్థం ఏమిటో తెలుసుకోలేక పోతున్నాడు మనిషి

మనం ఈ రోజు ఒక కార్యం చేయాలనుకుంటాం! బద్దకం వల్లో, మరే కారణం చేతనో మానేస్తాం. మర్నాడు ఆ అవకాశం జారిపోతుంది. అంటే... ఆ పని చేయవలసిన అవసరం వుండదు. అప్పుడు 'అయ్యో! నిన్ననే చేస్తే బాగుండేది కదా?' అని విచారిస్తాం. దీనిని బట్టి 'నిన్నటి రోజుకి' విలువ ఎంతో అంచనా కట్టుకోవచ్చును. అందుకే కాలం విలువ గ్రహించి పెద్దలు అంటారు- 'ఇవాళ చేయవలసిన పని ఇవాళే చేయి. రేపటికి వాయిదా వేయకు' అని! బాల్యంలో పిల్లలు హాయిగా, స్వేచ్ఛగా తిరుగుతారు ఆటలాడుకుంటారు. వయస్సు వచ్చాక ఆ స్వతంత్రం పోతుంది. ఇష్టం వచ్చినట్టు ఎగరాలన్నా, ఆడాలన్నా, చుట్టూ వున్నవాళ్ళు నవ్వుతారు, గేలిచేస్తారు. కనుక బాల్యం అనేది స్వేచ్ఛకి కేంద్రం. అప్పుడు మందకొడిగా స్తబ్దుగా వుంటే జీవితంలో మళ్ళీ ఆ స్వేచ్ఛ పొందలేం. కనుక బాల్యం విలువ గుర్తించి మనం పిల్లల విషయంలో శ్రద్ధ తీసుకోవాలి. యవ్వనం అంతే, యువతరం కూడా అంతే! చదువులు, లక్ష్యసిద్ధి, ఆ వయస్సులో సాధించలేకపోతే మళ్ళీ జీవితంలో ఆ అవకాశం రాదు.

ఇలాగే ప్రతి వయస్సుకీ ప్రత్యేకమైన విలువలుంటాయి. జీవితంలోని దశలు, కాలం విలువలు మరచి కొందరు సంపాదన కోసం, పేరు ప్రతిష్ఠల కోసం, సుఖాల కోసం తాపత్రయ పడుతూ కాలాన్ని వృధా చేసుకుంటారు.

ఒక్కొక్క మనిషి వల్ల ఎంతో అవసరం వుంటుంది. మనం అది గుర్తించకుండా వాళ్ళని నిర్లక్ష్యం చేసి పనికిమాలిన వాళ్ళని- అంటే... దుష్టసావాసం చేసి లేనిపోని కష్టాలు తెచ్చుకుంటాం. అజ్ఞానం వల్ల, అహంకారం వల్ల భర్తని చులకన చేసే భార్యలూ, భార్యని బాధించే భర్తలూ వుంటారు. భర్తలేని భార్యకీ, భార్యలేని భర్తకీ ఎదురయ్యే ఇబ్బందులు, అశాంతులు అనుభవంలోకి వచ్చినప్పుడు ఒకరి విలువలు ఒకరికి తెలుస్తాయి.

కొందరు పొదుపు, పిసినారితనం వల్ల డబ్బు దాచిపెట్టి ఏ ఉపయోగం లేకుండా చేసుకుంటారు. ఎన్నో అవసరాలు వచ్చినా పైసా ఖర్చు చేయరు. కానీ, డబ్బు కన్న మనిషి విలువైన వాడని గ్రహించేసరికి ఆ విలువని వాళ్లు అందుకోలేకపోతారు. అయితే... అదుపు లేకుండా ఖర్చు చేసి అప్పులు పాలైన వాళ్లూ వుంటారు. వాళ్ళకి ఒక్క పైసా దొరక్క అవస్థ పడుతారు. అప్పుడు 'డబ్బు' విలువైనదని గ్రహించాల్సి వస్తుంది. అప్పుడు 'విలువ' అంటే తెలుస్తుంది.

చిన్నప్పుడు స్కూల్లో చదువుకునేటప్పుడు మనకి లెక్కల టీచర్ యక్స్, వై, జడ్ అనే అక్షరాలకి విలువలు ఆపాదించి, లెక్కలు చేసే విధానం నేర్పుతాడు. ఆ విజ్ఞత మనం పెద్దయ్యాక జీవితపు ముఖ్యావసరాలలోకి అనువదించుకునేందుకు ఉపయోగించుకోవాలి. చదువుకోవటం యొక్క వినియోగం అదే. కేవలం జీవనభృతికే కాదు.

ఏదైతే మనకు భరోసా, ఆసరా, అవసరం, సుఖ సంతోషం, భద్రత కల్పిస్తుందో దానిని విలువైనదిగా భావించాలి. ఆ విలువ పోగొట్టుకుంటే వృథా అయి నేలపాలైనట్టు లెక్క.

కాలం, మనిషి, డబ్బు, మంచితనం, పనితనం, పరోపకారం ఇవ్వన్నీ సామాన్య జీవితాలకి విలువైనవి. కానీ, ఇవన్నీ 'జీవితం' అనే ఒక బిందువు చుట్టూ తిరుగుతూ వుంటాయి. ఆ బిందువు కరిగిపోతే ఇవన్నీ దానిలో లయమైపోతాయి. కనుక 'జీవితం' అన్నిటికన్నా విలువైనది. అంతటి విలువైన జీవితంలో మనిషి ఎన్నో సాధించి తను వున్నా, లేకున్నా తన ఉనికి ప్రస్ఫుటమయ్యే పనులు చేయాలి. అలాంటివారే మహాత్ములు, మహనీయులు, త్యాగులు, ధర్మపరులు, భక్తులు, జ్ఞానులు, పీఠాధిపతులు! వారివల్లనే 'విలువలు' కాపాడబడుతాయి.





# సంగతులు !!

'ఏమిటి బాగున్నారా? ఎక్కడా కనిపించటమే లేదూ! ఏం చేస్తున్నారూ? ఓహో! అలాగా? ఇంకా ఏమిటి సంగతులు?' అని మనం తరుచుగా వాడుతుంటాం.

'సం-గతి'=సంగతి. అంటే 'మంచిస్థితి' లేదా 'విషయం' అని అర్థం. ఇంకా ఏమిటి 'విశేషాలు' అన్నా అదే అర్థం. 'వి-శేషం'=విశేషం. అంటే... మిగిలినవి చెప్పుకోదగినవి అని కదా? అనగా మనం మాట్లాడుకోగా ఇంకా మిగిలినవీ, మాట్లాడుకోవలసినవీ ఏమైనా వున్నాయా? అని అడగటం.

'ఇంకా ఏమిటి సంగతులు?' అన్నా, 'ఇంకా ఏమిటి విశేషాలు?' అన్నా అర్థం ఒక్కటే. ఒక్కోసారి ఎవరైనా కబురు పంపుతారు. 'మీరు ఒకసారి రండి. మీకో సంగతి చెప్పాలి' అని అంటే ఓ మాటో, సంఘటనో, జరుగవలసినదో, చేసినదో ఏదో ఒకటి మనకి చెప్పాలనుకుంటారు. ఆ పరిస్థితిలో 'సంగతి' అనేది మంచీ కావచ్చును. లేదా చెడుదైనా కావచ్చును.

అసలు అర్థాన్ని బట్టి సంగతులు అంటే... మంచి మాటలు లేదా పరిస్థితులు అని అనుకున్నా మనం ఉపయోగించేటప్పుడు అర్థాన్ని బట్టి వాడం. ఎవరికైనా జబ్బుగా వున్నా, పోయినా, మరే చెడు జరిగినా సరే 'మీకా సంగతి తెలుసా?' అని ప్రశ్నిస్తాం.

అందుచేత 'సంగతి' అనే పదం- తెలియని ఒక పరిస్థితి గురించి తెలుసుకోవటం అని గ్రహించవలసి వుంటుంది. మనం ఒకరికి చెప్పినా లేదా ఒకరి నుంచి విన్నా అదే వర్తిస్తుంది.

మరొక రకమైన 'సంగతులు' వున్నాయి.

అవి సంగీతంలో వినిపిస్తాయి. ఒక పదాన్ని పలుమార్లు అర్థం మారేటట్టు వినిపిస్తారు సంగీత విద్వాంసులు. పదాన్ని రాగంతో అనేక ఎత్తుగడలు, దిగువస్థాయిలు కల్పిస్తూ దానిలో రసాన్ని మనకి వినిపిస్తారు. ఈ ప్రయోగాన్ని 'సంగతులు వేయటం' అని చెప్తారు.

ఈ విద్య చాలా ప్రశంసనీయమైనది. పదం అదే వుంటుంది. కానీ, భావం మారిపోతూ వుంటుంది. అంటే... స్థాయి మారినప్పుడల్లా మనకి క్రొత్తగా అనిపిస్తూ వుంటుంది. కనుక 'సంగతి' అవుతుంది. ఇది మనం ప్రతిరోజూ మాట్లాడే భాషలో కూడా వ్యక్తం చేయగలం. ఎలాగంటే- మనం ఎవరినైనా ఒక వస్తువు అడిగినా లేక మనం ఇచ్చినా 'తీసుకోండి' అని మామూలుగా అనటం ఒక భావంతో వుంటుంది. అదే గట్టిగా నొక్కినట్లు 'తీసుక్కోండి' అని పలికితే కోపం వ్యక్తం అవుతుంది. ఇంకా 'తీ-సు-కోం-డి' అని నయగారం ఒలకబోస్తూ చెప్తే అది ప్రేమని తెలియ చేస్తుంది.

ఈ విధంగా ఒకే పదాన్ని అనేకరకాలుగా చెప్పటం కూడా సంగతులుగా భావించవచ్చును.

ఒక్కోసారి పెద్దవాళ్ళు పిల్లల్ని 'ఏమిటి సంగతులు, అమ్మాయి సిగ్గుపడుతూంది?' అని సూటిగా అమ్మాయినే పలకరిస్తారు. ఇక్కడ నిజానికి చెప్పటానికి ఏం లేకపోయినా 'అమ్మాయి సిగ్గునే' ఒక విషయంగా భావించి అడగటం జరుగుతుంది. ఇలాగ సంగతి అనే పదం మనం ఊతగా వాడుతూ ఎన్నో విధాల ఉపయోగించుకుంటాం.

ఉత్తరాలలో అన్నీ వ్రాసేక చివరగా 'ఇంతే సంగతులు' అని అందరూ వ్రాస్తూ వుంటారు. ఇలాంటిదే మరొకటి వుంది. ఏదైనా అయిపోయినా, 'లేదని' చెప్పాలన్నా 'ఇంతే సంగతులు' అని అంటాం. ఇంతేకాదు ఎవరైనా ఏదైనా తీసుకెళ్ళినా మనం అప్పు ఇచ్చినా 'వాళ్ళకిచ్చేరా? ఆ! ఇక ఇంతే సంగతులు!' అని చెప్తారు. ఇక అవి తిరిగి రావనీ, సంగతులు అయిపోయాయనీ భావం.

ఇటువంటి ముగింపు మనం కోరకుండా 'సంగతి' యొక్క అర్థాన్ని నిలపాలంటే ('సం-గతి') మంచి విషయాలు ఎప్పుడూ వినటం, చెప్పటం చేయాలి. 'ఏమిటి సంగతులు' అనిపించుకోవాలి గానీ 'ఇక ఇంతే సంగతులు' అనిపించుకోరాదు.





# నాగరికత - అంటే?!

మనిషి ఆదిలో మృగాలతో సమంగా అర్ధనగ్నంగా ఆకులూ, అలమలూ తింటూ ఆచ్ఛాదన లేని ఆరుబయట నివాసముంటూ బ్రతికేవాడని చరిత్ర సాక్ష్యాధారాలు కన్పిస్తున్నాయి. అది తల్చుకుంటే ఇప్పటి మనకి ఎంతో విచిత్రం, జుగుప్స, లజ్జ కలుగుతాయి. ఎందుకనీ?

మనం ఈనాడు బట్ట కట్టుకోటం (వస్త్రధారణ) నేర్చుకున్నాం. ఆహారాన్ని వండుకోటం తెలుసుకున్నాం. ఇళ్ళు కట్టుకుని ఎండకీ, వానకీ రక్షణ కల్పించుకున్నాం. సాటి మనిషితో కలసి సహజీవనం చేయటానికి వీలుగా భాష, అక్షరజ్ఞానం, మానవతా లక్షణాలు తెలుసుకున్నాం. మిగిలిన జీవరాసుల కన్నా మానవ జన్మకి ప్రత్యేకత వుందని గ్రహించి ఈ మానవ జీవన ప్రమాణాలని పటిష్టం చేసుకునేందుకు ‘వ్యవస్థ’లని ఏర్పాటు చేసుకున్నాం. ఒక్కొక్క రంగానికి ఒక్కొక్క ప్రణాళికని రూపొందించుకున్నాం. ‘వివాహ వ్యవస్థ’ అనీ ‘విద్యా వ్యవస్థ’ అనీ, కొన్ని ముఖ్యమైనవి జీవన సరళిని సక్రమంగా నడిపించాలని అందరూ కలసి ఆమోదించారు. అప్పుడు సమాజం అనీ, మనిషి నాగరికత నేర్చుకున్నాడని భావిస్తున్నాం.

అంటే... పశువుల కన్నా, మృగాలకన్నా భిన్నంగా మనిషి జీవితం ఉన్నతమైనది కనుక అర్థవంతంగా బ్రతకటాన్ని ‘నాగరికత’ అంటున్నాం. అయితే, ఈ నాగరికత ఎలా వుండాలి? మృగాలనుంచి ఎదిగి మనిషిగా సాధించి దైవత్వానికి చేరవలసి వుంది. కానీ, మృగాల కన్నా పై తరగతికి చేరిన మానవుడు నాగరికత ముసుగులో మళ్ళీ దిగజారి మృగానికన్నా క్రిందికి పడిపోతున్నాడు.

ఈనాడు విద్యావంతులంతా 'నాగరికత' అనుకుని వేషధారణ మొదలు ప్రవర్తనలో, ఆహార ఆహార్యాల వరకు సాటివారిని నొప్పిస్తూ అహంకారమనే కొమ్ములతో పొడుస్తున్నారు. 'విద్యలేని వాడు వింతపశువు' అన్నారు గానీ విద్యావంతుడైన వాడే 'సంతపశువు'లా వివాహ వ్యవస్థని అస్తవ్యస్తం చేస్తున్నాడు. వినోదం పేరిట మదించిన ఏనుగుల్లాగ అచ్చుబోసిన ఆంబోతుల్లాగా కుప్పిగంతులు వేసే ఈనాటి చిత్రసీమ ఆదిమవాసుల్నే నయమనిపిస్తుంది. ఆనాడు అజ్ఞానంతో ఆకులూ, అలములూ కట్టుకుంటే ఈనాడు జ్ఞానం కలిగి అర్ధనగ్నంగా తయారవుతున్నారు.

ఐక్యత కలిగి, సమతాభావంతో, సాంఘిక వ్యవస్థని అనుసరించటమే నాగరికత. అందరూ ఏకభావానికి రావాలన్నదే దీని పరమార్థం. కానీ... వ్యవస్థల్ని చిన్నాభిన్నం చేసి హక్కుల్ని సాధించటం, పక్కవాణ్ణి దోచుకోవటం, పగ, ద్వేషం, ఈర్ష్యలు పెంచుకోవటం... ఇదీ ఈనాటి నాగరికత! సుఖజీవనం కోసం ఏర్పాటు చేసుకున్న జీవన వసతులన్నీ ఈనాడు మానవుణ్ణి లాలసపరుణ్ణి చేసి, అనాగరికుణ్ణి చేస్తున్నాయి. తనకి కావల్సిన దానికన్నా ఎక్కువగా ఆశించటమే అనాగరికత. దానికోసం సాటివాణ్ణి చావుదెబ్బ కొట్టటం కాబట్టి అనాగరికత. చివరికి మనిషి ఈ అనాగరికత వల్లే పతనం చెందుతాడు.

మనిషిని మనిషిగా గుర్తించి సహజీవన సౌభాగ్యం అర్థం చేసుకున్ననాడు, నాగరికత రాణిస్తుంది. ఆణిముత్యంలా మెరుస్తుంది. దైవమే దిగివచ్చి భువిలో నిలిచిపోతుంది.





# పోలికలు !

ఈ సృష్టిలో ప్రతి మనిషీ వేరొక మనిషితో కలవడు. కొన్ని వందల మంది, వేల మందిలో ఎక్కడైనా ఒక మనిషిలాగా మరొక మనిషి వుండవచ్చును.

అటువంటప్పుడు వాళ్ళిద్దరికీ చాలా పోలికలు వున్నాయి అంటాం. అంతేగానీ, ఎక్కడో ఒకచోట భేదం వుండే వుంటుంది. అంటే... ప్రపంచంలో ఏ ఒక్క ఇద్దరూ ఒకేలాగ వుండరు. ఎవరికి వారే, వేరుగా వుంటారు. ఎక్కడైనా ఒక్కలాగ వుంటే దాన్ని 'పోలిక' అంటాం. అంతకుతప్ప 'ఒక్కటే' అనలేము

రూపంలో గాని, కంఠస్వరంలో గాని, బుద్ధుల్లో గానీ, అలవాట్లలో గానీ 'దగ్గరితనం చూపించటమే 'పోలిక'!

'ఆ అమ్మాయి అచ్చంగా మీ అమ్మాయిలాగా వుం'దంటాం. 'ఆ గొంతు వింటుంటే అబ్బ నువ్వే అనుకున్నాను. సరిగ్గా నీ కంఠంలాగానే వుంది!' అనుకుంటాం. ఎవరైనా ఒక పని చేస్తుంటే ఆ పని మనకి ఇంకెవరో అలాగే చేస్తారని గుర్తు వస్తుంటుంది. 'మా అబ్బాయి అలవాట్లన్నీ అచ్చు వాళ్ళ తాతగారివే. ఆ కూర్చోవటం, నడవటం అచ్చంగా మా మామగారు అలాగే చేసేవారు' అని చెప్తుంటాం.

ఇలా ఒకరికి మరొకరి పోలికలు వుంటాయి. కానీ, ఒకటే అవటం అసాధ్యం. ఔ కవల పిల్లలల్లో (ట్విన్స్) కూడా శరీర ఆకృతి ఒక్కలా వుండవచ్చును. కానీ... బుద్ధులు, జాతకాలు, కంఠస్వరాలు కలియవు. కారణం ఏమిటి?

ప్రతి మనిషి జన్మించిన సమయం వేరు, వేరుగా వుంటుంది. ప్రదేశం, తల్లిదండ్రులు, సమయం, స్థితిగతులు అనేక రకాలుగా వుంటాయి. ఏ ఒక్కచోటూ కలవదు గదా? అడుగు అడుగూ తేడా వుంటుంది. క్షణం క్షణం మారిపోతుంది. ధనవంతులు, బీదవారూ వుంటారు. ఇన్ని రకాల భేదాలున్నప్పుడు పుడ్తున్న మనుష్యుల్లోనూ భేదాలుంటాయి. అంతేకాదు - ఒక తల్లి గర్భమందు జన్మించినవారే ఒక్కలా వుండరు. సమయం, స్థలాన్ని బట్టి వారి జాతకాలు వేరుగా వుంటాయి. జాతకాలని బట్టి బుద్ధులు, అలవాట్లు మారిపోతూ వుంటాయి.

ఇంత పరమసత్యం విజ్ఞానశాస్త్రం ద్వారా మనకి తెలుస్తున్నా అజ్ఞానం చేత మనం అనేక పొరపాట్లు చేస్తుంటాం. అదే... ఇంకొకర్ని అనుసరించడం! 'నేను అలాగే పాడాలి' అనుకోవటం, ' నేను అంతలా నటించాలి' అనుకోవటం, ' నేను అచ్చంగా ఫలానా యాక్టర్‌లా వున్నా'నుకోవటం ఇవన్నీ అజ్ఞానమే. 'మావాడు అంతటివాడు, ఇంతటివాడు' అనుకోవటం పొరపాటే. మంచి నడవడిక, సుబుద్ధులు నేర్చుకుని పెద్దల అడుగుజాడల్లో నడవ వచ్చును గానీ, 'అలాంటివాడే' అనుకోరాదు.

మనుషులు ముద్రించే ఫోటోల్లో 'నెగిటివ్'లుంటాయి. కానీ, సృష్టిలో భగవంతుడు నెగిటివ్‌లని ఉపయోగించడు. ఎవరి వ్యక్తిత్వం వారిదే. ఎవరి దారి వారిదే. ఎవరి కర్మ వారిదే. ఏ ఒక్కరూ మరొకరితో ఏకమవరు. అంతా కలిసి ఒకటే అయినటువంటి ఒకానొక మహాశక్తిలోని భాగాలం.

మనందరిలోని వివిధ గుణసంపత్తి, కళ, విద్య అన్నీ కలిస్తేనే భగవంతుని రూపం. అదే విశ్వరూపం! కనుక ప్రతివారిలోనూ మన పోలికా, మనలో ఇతరుల పోలికా చూసుకోవటమే మానవతా లక్షణం. పై ఆకృతి గాక, లోని చైతన్యం ఒక్కటే అని గ్రహించగల్గేదే నిజమైన జ్ఞానం.






# సార్థకత !

ప్రతివాడు తనకోసం ఏదో చేసుకోవటం, చెయ్యాలనుకోవటం సహజం. పిల్లలకి వివాహాలు, ఆస్తులు సమకూర్చుకోవటం, బంధుమిత్రుల్ని ఆదరించటం, సమాజంలో కలుపు గోలుగా మనుగడ సాగించటం... ఇవన్నీ సగటు మానవుని కనీస బాధ్యతలు! వీటికి మించిన ధ్యేయం లేదా ఆశయం కొందరికి వుంటుంది. అందులో కొద్దిగా కీర్తికాంక్ష తొంగి చూస్తుంది. అయినా... సగటు మనిషి కన్నా కొద్దిగా పై మెట్టుకి వెళ్ళిన మధ్యమ పురుష లక్షణం కనిపిస్తుంది. ఇంతకన్నా ప్రజాహిత కార్యాల నిర్వికార దృష్టితో చేసే సహృదయులుంటారు. వారు తన కోసమని గానీ, ఇంకొకరి కోసమని గానీ ఉద్దేశించి చేయరు. లోక కళ్యాణార్థం నిష్కామ కర్మ చేస్తుంటారు. వీరు ఉత్తమ పురుషులు.

వీరు చేసే పనులలోనే 'సార్థకత!' కనిపిస్తుంది.

ప్రజానాయకులంతా 'దేశసేవ కోసం నేను పాటుపడ్డా'నంటూ చెప్తారు. అందులో ప్రణాళికలు, పథకాలు వేసి వాటి ప్రకారం ఫలానా కార్యక్రమాలు చేసేనని చెప్పటం కేవలం కర్తవ్య పాలన క్రిందికే వస్తుంది తప్ప సార్థకత చేకూరదు.

ఆ కార్యక్రమాలు ఆ స్థానంలో వున్న ఎవరైనా చేస్తారు. ఎందుకంటే అది కర్తవ్యం గనుక!

ఒక ఉద్యోగి బదిలీ అయి వెళ్ళిపోతూ తన బాధ్యతనంతా కొత్తవాడికి అప్పగిస్తాడు. (చార్జి నప్పగించడం) అప్పుడు ఆ సీట్లో కూర్చున్న ఉద్యోగి తన బాధ్యత వహిస్తాడు. ఇక్కడ ఎవరు చేసినా నిర్ణయించిన కార్యక్రమాలు రూల్స్ ప్రకారం చేయటమే గానీ ప్రత్యేకత కనిపించదు.

ఈనాడు విద్యావంతులంతా 'నాగరికత' అనుకుని వేషధారణ మొదలు ప్రవర్తనలో, ఆహార ఆహార్యాల వరకు సాటివారిని నొప్పిస్తూ అహంకారమనే కొమ్ములతో పొడుస్తున్నారు. 'విద్యలేని వాడు వింతపశువు' అన్నారు గానీ విద్యావంతుడైన వాడే 'సంతపశువు'లా వివాహ వ్యవస్థని అస్థవ్యస్తం చేస్తున్నాడు. వినోదం పేరిట మదించిన ఏనుగుల్లాగ అచ్చుబోసిన ఆంబోతుల్లాగా కుప్పిగంతులు వేసే ఈనాటి చిత్రసీమ ఆదిమవాసుల్నే నయమనిపిస్తుంది. ఆనాడు అజ్ఞానంతో ఆకులూ, అలములూ కట్టుకుంటే ఈనాడు జ్ఞానం కలిగి అర్థనగ్నంగా తయారవుతున్నారు.

ఐక్యత కలిగి, సమతాభావంతో, సాంఘిక వ్యవస్థని అనుసరించటమే నాగరికత. అందరూ ఏకభావానికి రావాలన్నదే దీని పరమార్థం. కానీ... వ్యవస్థల్ని చిన్నాభిన్నం చేసి హక్కుల్ని సాధించటం, పక్కవాణ్ణి దోచుకోవటం, పగ, ద్వేషం, ఈర్ష్యలు పెంచుకోవటం... ఇదీ ఈనాటి నాగరికత! సుఖజీవనం కోసం ఏర్పాటు చేసుకున్న జీవన వసతులన్నీ ఈనాడు మానవుణ్ణి లాలసపరుణ్ణి చేసి, అనాగరికుణ్ణి చేస్తున్నాయి. తనకి కావల్సిన దానికన్నా ఎక్కువగా ఆశించటమే అనాగరికత. దానికోసం సాటివాణ్ణి చావుదెబ్బ కొట్టటం కాబట్టి అనాగరికత. చివరికి మనిషి ఈ అనాగరికత వల్లే పతనం చెందుతాడు.

మనిషిని మనిషిగా గుర్తించి సహజీవన సౌభాగ్యం అర్థం చేసుకున్ననాడు, నాగరికత రాణిస్తుంది. ఆణిముత్యంలా మెరుస్తుంది. దైవమే దిగివచ్చి భువిలో నిలిచిపోతుంది.





# పోలికలు !

ఈ సృష్టిలో ప్రతి మనిషీ వేరొక మనిషితో కలవడు. కొన్ని వందల మంది, వేల మందిలో ఎక్కడైనా ఒక మనిషిలాగా మరొక మనిషి వుండవచ్చును.

అటువంటప్పుడు వాళ్ళిద్దరికీ చాలా పోలికలు వున్నాయి అంటాం. అంతేగానీ, ఎక్కడో ఒకచోట భేదం వుండే వుంటుంది. అంటే... ప్రపంచంలో ఏ ఒక్క ఇద్దరూ ఒకేలాగ వుండరు. ఎవరికి వారే, వేరుగా వుంటారు. ఎక్కడైనా ఒక్కలాగ వుంటే దాన్ని 'పోలిక' అంటాం. అంతకుతప్ప 'ఒక్కటే' అనలేము

రూపంలో గాని, కంఠస్వరంలో గాని, బుద్ధుల్లో గానీ, అలవాట్లలో గానీ 'దగ్గరితనం' చూపించటమే 'పోలిక'!

'ఆ అమ్మాయి అచ్చంగా మీ అమ్మాయిలాగా వుం'దంటాం. 'ఆ గొంతు వింటుంటే అబ్బ నువ్వే అనుకున్నాను. సరిగ్గా నీ కంఠంలాగానే వుంది!' అనుకుంటాం. ఎవరైనా ఒక పని చేస్తుంటే ఆ పని మనకి ఇంకెవరో అలాగే చేస్తారని గుర్తు వస్తుంటుంది. 'మా అబ్బాయి అలవాట్లన్నీ అచ్చు వాళ్ళ తాతగారివే. ఆ కూర్చోవటం, నడవటం అచ్చంగా మా మామగారు అలాగే చేసేవారు' అని చెప్తుంటాం.

ఇలా ఒకరికి మరొకరి పోలికలు వుంటాయి. కానీ, ఒకటే అవటం అసాధ్యంఔ కవల పిల్లలల్లో (ట్విన్స్) కూడా శరీర ఆకృతి ఒక్కలా వుండవచ్చును. కానీ... బుద్ధులు, జాతకాలు, కంఠస్వరాలు కలియవు. కారణం ఏమిటి?

ప్రతి మనిషి జన్మించిన సమయం వేరు, వేరుగా వుంటుంది. ప్రదేశం, తల్లిదండ్రులు, సమయం, స్థితిగతులు అనేక రకాలుగా వుంటాయి. ఏ ఒక్కచోటూ కలవదు గదా? అడుగు అడుగూ తేడా వుంటుంది. క్షణం క్షణం మారిపోతుంది. ధనవంతులు, బీదవారూ వుంటారు. ఇన్ని రకాల భేదాలున్నప్పుడు పుట్టున్న మనుష్యుల్లోనూ భేదాలుంటాయి. అంతేకాదు - ఒక తల్లి గర్భమందు జన్మించినవారే ఒక్కలా వుండరు. సమయం, స్థలాన్ని బట్టి వారి జాతకాలు వేరుగా వుంటాయి. జాతకాలని బట్టి బుద్ధులు, అలవాట్లు మారిపోతూ వుంటాయి.

ఇంత పరమసత్యం విజ్ఞానశాస్త్రం ద్వారా మనకి తెలుస్తున్నా అజ్ఞానం చేత మనం అనేక పొరపాట్లు చేస్తుంటాం. అదే... ఇంకొకర్ని అనుసరించడం! 'నేను అలాగే పాడాలి' అనుకోవటం, ' నేను అంతలా నటించాలి' అనుకోవటం, ' నేను అచ్చంగా ఫలానా యాక్టర్‌లా వున్నా'నుకోవటం ఇవన్నీ అజ్ఞానమే. 'మావాడు అంతటివాడు, ఇంతటివాడు' అనుకోవటం పొరపాటే. మంచి నడవడిక, సుబుద్ధులు నేర్చుకుని పెద్దల అడుగుజాడల్లో నడవ వచ్చును గానీ, 'అలాంటివాడే' అనుకోరాదు.

మనుషులు ముద్రించే ఫోటోల్లో 'నెగిటివ్'లుంటాయి. కానీ, సృష్టిలో భగవంతుడు నెగిటివ్‌లని ఉపయోగించడు. ఎవరి వ్యక్తిత్వం వారిదే. ఎవరి దారి వారిదే. ఎవరి కర్మ వారిదే. ఏ ఒక్కరూ మరొకరితో ఏకమవరు. అంతా కలిసి ఒకటే అయినటువంటి ఒకానొక మహాశక్తిలోని భాగాలం.

మనందరిలోని వివిధ గుణసంపత్తి, కళ, విద్య అన్నీ కలిస్తేనే భగవంతుని రూపం. అదే విశ్వరూపం! కనుక ప్రతివారిలోనూ మన పోలికా, మనలో ఇతరుల పోలికా చూసుకోవటమే మానవతా లక్షణం. పై ఆకృతి గాక, లోని చైతన్యం ఒక్కటే అని గ్రహించగల్గేదే నిజమైన జ్ఞానం.





# సార్థకత!

ప్రతివాడు తనకోసం ఏదో చేసుకోవటం, చెయ్యాలనుకోవటం సహజం. పిల్లలకి వివాహాలు, ఆస్తులు సమకూర్చుకోవటం, బంధుమిత్రుల్ని ఆదరించటం, సమాజంలో కలుపు గోలుగా మనుగడ సాగించటం... ఇవన్నీ సగటు మానవుని కనీస బాధ్యతలు! వీటికి మించిన ధ్యేయం లేదా ఆశయం కొందరికి వుంటుంది. అందులో కొద్దిగా కీర్తికాంక్ష తొంగి చూస్తుంది. అయినా... సగటు మనిషి కన్నా కొద్దిగా పై మెట్టుకి వెళ్ళిన మధ్యమ పురుష లక్షణం కనిపిస్తుంది. ఇంతకన్నా ప్రజాహిత కార్యాలు నిర్వికార దృష్టితో చేసే సహృదయులుంటారు. వారు తన కోసమని గానీ, ఇంకొకరి కోసమని గా ఉద్దేశించి చేయరు. లోక కళ్యాణార్థం నిష్కామ కర్మ చేస్తుంటారు. వీరు ఉత్తమ పురుషులు.

వీరు చేసే పనులలోనే 'సార్ధకత!' కనిపిస్తుంది.

ప్రజానాయకులంతా 'దేశసేవ కోసం నేను పాటుపడ్డా'నంటూ చెప్తారు. అందులో ప్రణాళికలు, పథకాలు వేసి వాటి ప్రకారం ఫలానా కార్యక్రమాలు చేసేనని చెప్పటం కేవలం కర్తవ్య పాలన క్రిందికే వస్తుంది తప్ప సార్ధకత చేకూరదు.

ఆ కార్యక్రమాలు ఆ స్థానంలో వున్న ఎవరైనా చేస్తారు. ఎందుకంటే అది కర్తవ్యం గనుక!

ఒక ఉద్యోగి బదిలీ అయి వెళ్ళిపోతూ తన బాధ్యతనంతా కొత్తవాడికి అప్పగిస్తాడు. (చార్జి నప్పగించడం) అప్పుడు ఆ సీట్లో కూర్చున్న ఉద్యోగి తన బాధ్యత వహిస్తాడు. ఇక్కడ ఎవరు చేసినా నిర్ణయించిన కార్యక్రమాలు రూల్స్ ప్రకారం చేయటమే గానీ ప్రత్యేకత కనిపించదు.

ఒక నియమావళిని అనుసరించి గాకుండా పరహిత కాంక్షతో స్వయంకృషిగా చేసి అది సత్ఫలితాన్నిస్తే ఆ పనిని సార్థకతగా భావించాలి.

మన వాడలో మురికి పేరుకుపోతుంది. మున్సిపాలిటీ వాళ్ళకోసమే ఎదురుచూస్తాం తప్ప మనకై మనం ఆ మురికి కోసం శాశ్వతంగా ఒక ఏర్పాటు చేసుకోం. ఇది అతి చిన్న విషయం! ఇలాగే పాఠశాలల్లో బోరింగ్ పంపులు పెట్టిస్తే? కలకాలం విద్యార్థులకీ, ఉపాధ్యాయులకీ ఉపయోగం. మన డబ్బు సద్వినియోగం అయినట్లు! పల్లెలో చాలాచోట్ల బస్సు స్టాండ్‌లు, ప్రయాణీకులకి సదుపాయాలూ వుండవు. ప్రభుత్వం వారికి ఆర్జీలు పెట్టి పురమాయించక పోతే నల్గురు కలిసి ఒక చిన్నస్టాండ్ కట్టలేరా? కూర్చునేందుకు రెండు రాతి చప్టాలు వేయలేరా? మన డబ్బు పదిలంగా వుండాలనుకునే స్వార్థం సార్థకమైన పనులు చేయనివ్వదు.

'తాతా! దారి పక్కన చెట్టు నాటుతున్నావు గదా? అది పెద్దదయి ఫలాల్నిచ్చేదాకా నువ్వు బ్రతికి వుంటావా?' అని అడిగితే 'నాకోసం కాదు... ప్రజల కోసం'! అన్న వృద్ధుడు చరిత్ర పుటల్లో కనిపిస్తాడు. కానీ, ఆ చెట్టు ఎందరికి ఆశ్రయం ఇచ్చిందో, ఎంతమంది దాని ఫలితాన్ని అనుభవించేరో? వారంతా కనిపించకపోయినా 'సార్థకత' అనే నీడ మనకి ప్రత్యక్ష సాక్ష్యం!

కోవెలకి మెట్లుంటాయి. ఆ మెట్లమీద కొన్ని స్థంభాలపైన కొందరి పేర్లుంటాయి. అవి ఆ ధర్మదాతలవి. వాళ్ళుండరు. కానీ, ఆ మెట్లు మాత్రం ప్రతిరోజు ప్రతిధ్వనింపచేస్తూ వుంటాయి వాళ్ళనామాలు.

శ్మశానవాటికలో ధర్మదాతలు ఎన్నో కట్టిస్తూ వుంటారు. ధర్మసత్రాలు కట్టించిన వారున్నారు. ఏ సమాజంలో బ్రతికినంత కాలం చేసేవి కాక తన గుర్తుగా ఈ లోకంలో సమాజం కోసం ేలే పనులే సార్థకతగా మనిషిని మహోన్నత స్థితికి చేరుస్తాయి.






# కృత్రిమం !

సృష్టిలో కొన్ని ఎవరి ప్రమేయం లేకుండా స్వయంగా ప్రకాశించే శక్తులు, వస్తువులు వుంటాయి. అవి ఒక్కోసారి మానవుడికి అందుబాటులో లేనప్పుడు మనిషి తాత్కాలికమైన ఏర్పాటు చేసుకుని అవసరాన్ని గడుపుకుంటాడు. అంటే... సహజంగా లేనప్పుడు అవసరం కోసం వేరే ఏర్పాటు చేసుకునే విధానం వుంటుంది. అదే 'కృత్రిమం'.

మనిషికి - జన్మించింది మొదలు చివరిదశ వరకు అనేక అవసరాలూ, అలవాట్లూ, అనుభవాలూ జరుగుతూనే వుంటాయి. అందులో ఎప్పుడైనా ఏదైనా సహజత్వం లోపించినట్లైతే మనిషి వెంట మరొక ఏర్పాటు చేసుకునైనా ఆ అవసరం లేదా అలవాటు పూర్తి చేసుకుంటాడు.

కళ్ళు కనిపించకపోతే కళ్ళకి అద్దాలు పెట్టుకుంటాం. చెవులు వినిపించకపోతే (హియరింగ్ ఎయిడ్) యంత్రం ఉపయోగించుకుంటున్నాం. నోటిలో పళ్ళు (దంతాలు) ఊడిపోతే కట్టుడు పళ్ళు పెట్టుకుంటాం. తల వెంట్రుకలు నెరిస్తే (తెల్లబడితే) రంగువేసుకుని నల్లగా వుండేలా చూసుకుంటున్నాం. అలాగే అంగ వైకల్యం కల్గితే ... శస్త్ర చికిత్సలు (ఆపరేషన్లు) మార్పిడి పద్ధతులు చేసుకుంటున్నాం. ఇవన్నీ కృత్రిమాలే!

చల్లని గాలి వీచకపోతే ఫ్యాన్లు ఉపయోగించుకుంటాం. పగటిపూట వుండే వెలుగు, రాత్రి పూట వుండదు గనుక లైట్లు వెలిగించుకుంటాం.

వాస్తవానికి బదులుగా మనం అనేక కృత్రిమ ఏర్పాట్లు చేసుకుంటూ జీవనగతికి అభ్యంతరం ఏర్పడకుండా మనుగడ సాగిస్తున్నాం. అంతవరకు మనిషి అభినందనీయుడు. కానీ, బాహ్యానికి మించి అంతర్గతంగా వుండే గుణ సంపత్తిని కూడా మానవుడు కృత్రిమంగా చేసుకుంటున్నాడు. ఇది చాలా దురదృష్టం! నాటకాలలో చిత్రసీమలో నటించి మెప్పుపొందటంలో కొంత అర్థం వుంది. ఆ నటన ప్రజారంజితం చేస్తుంది. కనుక ఒక ప్రయోజనం సిద్ధించుకుంటుంది. కానీ, నిజ జీవితంలో ఎదుట బాగా మాట్లాడి, వెనుక గోతులు త్రవ్వే రకాలూ, మాట ఇచ్చి మోసం చేసేవాళ్ళూ, తిన్న ఇంట్లోనే హాని తలపెట్టే వాళ్ళూ... కృత్రిమంలో మునిగిపోతున్న రకాలు!

నర్సులు రోగికి సేవ చేస్తూ ఎంతో ప్రేమని, దయని చూపిస్తూ... ఇంక రోగం తగ్గిపోతుందన్నట్టుగా ధైర్యం చెప్తూవుంటారు. దీనివల్ల రోగి త్వరగా కోలుకునేందుకు వీలు కల్గుతుంది. అంటే... ఈ నటనలో (నిజంగా వాళ్ళకి దయాగుణం వుంటే మంచిదే) పరోపకారగుణం వుంది గనుక అది పరమార్థమే! కానీ, చెడుపుచేసే ఉద్దేశ్యంతో చేసే నటనలు కృత్రిమంలో కూడా నీచమైనవి. స్వార్థంతో మనిషి చేసే కృత్రిమ అలంకరణలో కొంత నేరం వుంది.

గాజుతొట్లలో (ఏక్వేరియం) చేపలు పెంచి ఆనందిస్తాం. కాని, ఈ కృత్రిమ పోషణలో చేపలు సహజత్వం కోల్పోయి వేదనపడుతాయి. ఆవుల్నీ, గేదెల్నీ మోసం చేయటం కోసం గడ్డితో దూడని చేసి (చాటపెయ్య) దాని ఎదుటపెట్టి పాలు తీసుకుంటాం. మనం చేసే ఈ కృత్రిమంలో మోసం వుంది.

ఈనాడు సగటు మనిషి స్వహజత్వం తానే కోల్పోయి కృత్రిమ జీవనానికి అలవాటు పడి పోతున్నాడు. ఇంటా, బయటా మనసులో కూడా ఈ కృత్రిమం నిండిపోయి వాతావరణం యావత్తు కృత్రిమమే అయిపోతున్న రోజులివి!

వాస్తవానికి దూరంగా బ్రతుకుతున్న మనం చీకట్లో నడుస్తున్న వాళ్ళతో సమానం. ఎంత త్వరగా వెలుగువైపు రాగల్గితే అంత మంచిది. అందుకు ప్రయత్నించాలి.





# ఆవశ్యకత !

ఏదైనా ఒక కార్య జరగటానికి ఆటంకం వచ్చి ఆగిపోతే ఆ అడ్డు తొలగించటమో లేదా ఆ పని పూర్తి కావటానికి అవసరమైనవి తేవటమో చేస్తాం. అనగా పని ఏ కారణం చేత ఆగిపోయిందో దానికి ప్రాధాన్యత ఇస్తాం. అదే 'ఆవశ్యకత' అంటే.

మనం ఉదయం నిద్రలేచిన దగ్గర్నుంచీ ఎన్నో పనులు చేస్తుంటాం. అవన్నీ నిజానికి ముఖ్యమైనవి కావు. అందులో కొన్ని మానేసినా ఫర్వాలేనివి వుంటాయి. మరికొన్ని తగిని సహాయం లేకపోయినా చేసేయగలం. అటువంటివాటికి పెద్దగా విలువ ఇవ్వక్కర్లేదు. కానీ నీళ్ళు నిలవ చేయాలనుకున్నప్పుడు గంగాళాలు, తొట్టెలు వుండి తీరాలిగతా? అంటే పాత్రల ఆవశ్యకత వుందన్న మాట. అలాగే ఆ వంటలు చేయాలన్నప్పుడు తగిన వస్తు సామగ్రి ఆవశ్యకత వుంటుంది. ఏదైనా సభా సమావేశం ఏర్పాటు చేయాలనుకున్నప్పుడు అధ్యక్షుడు, కార్యదర్శి, గౌరవ అతిథి ఇలా కొందరి ఆవశ్యకత వుంటుంది. శుభ సమయంలో పురోహితుడు విందులు లాంటి ఆవశ్యకత అవసరమే. ఈ విధంగా ఒక కార్యక్రమానికి కానీ నిత్యావసరాలలో గాని కొన్నిటి ఆవశ్యకత చాలా ముఖ్యం.

రాసేవాడికి కలం కాయితాలు అవసరం. పాట పాడేవాడికి ప్రక్క వాయిద్యాలు అవసరం. చూసేవాడికి కళ్ళజోడూ, నడిచేవాడికి కాళ్ళజోడూ (చెప్పులు) అవసరం ఎవరికి ఎప్పుడు ఏది కావల్సి వుంటుందో దానిని ఆవశ్యకత అనుకోవాలి గానీ కొనగల శక్తి వుందిగదా అని ఖరీదైన వస్తువులన్నీ కొని పెట్టుకుని సూది కావల్సిన వచ్చినప్పుడు పక్కింటి వాళ్ళని అడుగుదామనుకోకూడదు.

రోగికి చాలా ప్రమాదంగా వుంటే ఇంజెక్షన్లు, మందులు, ఆక్సిజన్ లాంటివి తప్పనిసరి. ఆ సమయంలో సరిపెట్టుకోవటానికి వీలులేదు. కానీ కొందరు పరమ లోభులు డబ్బు ఖర్చు పెట్టలేక అతి విలువైనచోట ఆవశ్యకతని అశ్రద్ధ చేస్తారు. తరచుగా ప్రయాణాలు చేసేవారుంటారు. వాళ్ళకి సూట్‌కేసులూ, ఫ్లాస్కులు చాలా అవసరం. కానీ కొందరు ప్రతిసారీ వాళ్ళనీ వీళ్ళనీ అడిగి పని పూర్తి చేసుకునేందుకే చూస్తారు. ఇల్లు అన్నాక ఇంట్లోకి కొన్ని తప్పనిసరిగా వుండవలసిని వస్తువులు వుంటాయి. కుర్చీలు, మంచాలు, చాపలు, గొడుగులు, కూరలకి ప్లాస్టిక్ సంచులు, తాళాలు, సూదులు, బ్రష్‌లు ఇలాంటివి చాలాసార్లు పని పడుతాయి. అవి లేకుండా గడుపుకోవాలనుకోవటం చాలా తెలివితక్కువ తనం. వస్తువు చిన్నదే అయినా ఆవశ్యకత గలది అయితే ఇంట్లో తప్పకుండా వుండాల్సిందే.

ఈనాడు మనలో చాలామంది ధనం సంపాదిస్తున్నారే గానీ, యుక్తాయుక్త జ్ఞానం పెంచుకోలేకపోతున్నారు. మోజుపడి ఖరీదైన ఫర్నీచర్లు, మిషన్లు, అలంకరణ సామాగ్రి, వస్త్రాలు, ఫాన్సీ సామాన్లు విపరీతంగా కొని దాచుకుంటున్నారు. ఆవశ్యకత లేని వస్తువులు మనిషిని క్రుంగ దీస్తాయి. అలాగే అత్యవసరమైనవీ, పనికివచ్చేవీ మానేయకూడదు.

ఒక సద్గ్రంథం తరతరాల ఆస్తి. మంచి పుస్తకాల ఆవశ్యకత ఈనాటి ప్రజలకి ఎంతైనా వుంది. అవి గుర్తించి కొంటే ఎన్నో సత్ఫలితాలు సాధించవచ్చును. అంతేకానీ ఖరీదైన సబ్బులూ, సుగంధ ద్రవ్యాలు బోలెడన్ని కొని చర్మ సౌందర్యమే ఆవశ్యకమనుకునే వారిని చూసి జాలిపడాలి!

ఆత్మ సౌందర్యం ఇనుమడిస్తేనే తనేగాక తన చుట్టూ సమాజంలో పరిమళాలు వెల్లి విరిస్తాయి.

మనిషికి నిత్యావసరాలే కాదు. ఆంతర్గత సమాలోచన చాలా ఆవశ్యకమైనది. ప్రతివాడు వివేకంతో ప్రవర్తిస్తే కొంతలో కొంతైనా సమాజం బాగుపడుతుంది.





# సీరియలంటే ?

చిన్న పిల్లల చేతుల్లో ఏదైనా తినే వస్తువులు పెడ్తే ఇంకొంచెం పెట్టమని మళ్ళీ చేయి చాపుతారు. అలాగే, ఆట ఆడిస్తే ఇంకా ఆడుకుంటామంటారు. కథ చెప్తే ఇంకో కథ చెప్పమంటారు. పిల్లలకే కాదు.., పెద్దలకి కూడా ముగించటం లేదా అయిపోవటం అనేది నచ్చదు. అందుకే పూర్వం కథలు చెప్తే కాశీమజిలీ కథలు, నీతి కథలు, జానపద గాథలు, జాతక కథలు, రాజకుమారుడి కథలు... ఇలాగ ముగింపు త్వరగా కాని గొలుసు కథలు చెప్తూ వుండేవారు.

బహుశా... అదే 'సీరియల్'గా నవలా లోకానికి ప్రవేశించి వుంటుంది. కొద్ది కొద్దిగా చెప్పటంలో వినేవాళ్ళకి ఆసక్తి పెరుగుతుంది. ఈరోజు కొంతభాగం చెప్పి 'మిగతాది రేపు చెప్తా'ననటంలో మనిషికి రేపటి మీద ఆశ పెరుగుతుంది.

ఇది సాహిత్య రంగానికి సంబంధించిన సీరియల్ ప్రస్తావన! అయితే... మానవ జీవితంలో వంశ పరంపరలు గమనిస్తే అదొక మహా సీరియల్! ఆ సీరియల్‌కి సమాప్తం వుండదు. అనివార్య కారణాల వలన ఆగిపోవటం వుండదు. 'పొరపాటుకి చింతిస్తున్నాం' అనడానికి వీలుండదు.

పురిటి బిడ్డని చూడగానే బాలసారె, నామకరణం, ఊయల సంబరం, ఆ తర్వాత అన్న ప్రాశనం, పుట్టినరోజు వరకు అన్నీ ఊహలు సాగిపోతాయి. అంటే... కథా విధానానికి సంకల్పం చేయటమే! ఆ తర్వాత అక్షరాభ్యాసానికీ, పాఠశాల ప్రవేశానికీ ఆలోచనలు సాగిస్తారు. అంటే... సీరియల్ సాగటం మొదలు పెడ్తుంది. పాఠశాలలో చదువుతున్నంత కాలం భవితవ్యం కోసం ఇతివృత్తాన్ని

సమకూర్చుకుంటారు. అదే... తమ పిల్లల పట్ల ఆశలు పెంచుకోవటమన్నమాట! 'డాక్టర్ చదివించాలి, కళాకారుణ్ణి చేయాలి, ఆటగాడు కావాలి, సంగీతం నేర్పాలి, నటుడవుతాడేమో? ఒకవేళ (జీనియస్) మేధావి అయి కలెక్టరో, గవర్నరో, డైరెక్టరో అవుతాడేమో? అవాలి, అయి తీరుతాడు'. ఇత్యాది ఊహాగానాలు చిలవలు, పలవలుగా సాగిపోతూ వుంటాయి తల్లితండ్రులకి.

కానీ మనం కల్పించిన కథని మనం సాగించినట్టు నడపగలం. మన జీవితాలు అనుకున్నట్టు నడవక పోవచ్చును. 'దాని' ఇతివృత్తం మన ఊహకన్నా ముందే నిర్ణయమైపోయి వుంటుంది.

అందుకనే ఒక్కొక్కప్పుడు మన ఆశలు 'ఒకనాటి కలలు'గా మిగిలిపోతూ వుంటాయి. మేధావి కావచ్చు. కానీ కలెక్టర్ కాలేక ఏ ప్రయివేటు కంపెనీలోనో చేరవచ్చును. సంగీత విద్వాంసురాలవుతుందనుకున్న కూతురు సరళీస్వరాల్లోనే ఆగిపోవాల్సి వస్తుంది. వాహనయోగం వుంటుందన్న వాడికి ఏ పాత సైకిలో ఉపయోగపడ్తుందేమో? నౌకర్లు, పనివాళ్ళతో సుఖపడుతాడనుకున్న కొడుకు కూరసంచీ పట్టుకుని నీర్సంగా ఇల్లు చేరితే ఎలా వుంటుందీ?

చిన్నప్పుడు పిల్లల్ని గురించి పెద్దవాళ్ళ ఆశలు గొప్పగానే సాగాలి. కానీ... వర్ణనలు, కల్పితాలు మరీ శ్రుతి మించితే నవల ఎలా విసుగనిపిస్తుందో అలాగే మన స్థాయికన్నా, స్థోమత కన్నా పిల్లల్ని గొప్పగా ఎత్తేయకూడదు. కాలం కల్సివచ్చి వాళ్ళు బాగా రాణిస్తే ఆనందమే! అనుకోకుండా నవల మలుపు తిరిగి పాఠకుల మెప్పు పొందినట్టు.

చిత్రమేమిటంటే... తల్లి దండ్రుల ఊహల లాగానే మళ్ళీ వాళ్ళ పిల్లలు తమకి కల్గిన సంతానాన్ని గురించి కలలు కనసాగించటం మొదలుపెడ్తారు.

ఇదొక మహా సీరియల్! కాకుంటే మనం రాసే సీరియల్‌కి సిరా వుంటుంది. మన జీవితాల్ని గురించి ఊహించే సీరియల్‌కి సిరా వుండదు.

అందుకే మనిషి జీవితం గురించిన ఆశలు సిరాలేని కలంతో రాసే సీరియల్స్ !!





# పురుషార్థం!

మనిషి జన్మకి ప్రత్యేకత వుంది. కనుక మానవతని పెంచుకుని మసలాలి. తెలిసినా, తెలియకపోయినా మనం కొన్ని మంచి పనులు చేస్తుంటాం. అసంకల్పితంగా చేసే ఈ చర్యలు మనలోని మానవతకి నిదర్శనాలు. మరీ రాక్షస ప్రవృత్తి కల్గిన వాళ్ళైతే తప్ప సాధారణంగా జాలిగుణం, మంచి ప్రతివాళ్ళకీ గుప్తంగా ఆంతర్యంలో వుంటుంది.

'పుణ్యం' అంటే మంచి పనికి వచ్చే ఫలితం! అది వెంటనే లభించకపోయినా కాలాంతరంలో లభిస్తుంది. ఇక 'పురుషార్థం' అంటే పురుషుడైన వాడు చేయవలసిన కర్తవ్యం! ఇక్కడ 'పురుషు'డంటే మగవాడు అని అర్థం కాదు... 'ఆత్మ స్వరూపం'! అని భావన. స్త్రీ అయినా, పురుషుడైనా మనిషే కదా? ఆ మనిషికి వుండవలసిన మానవతా లక్షణాలే 'పురుషార్థం' అని తెలుసుకోవాలి.

కొందరు లోకకళ్యాణం కోసం యజ్ఞాలు, యాగాలు చేస్తుంటారు. ఇందులో ధనం ప్రాముఖ్యత వహిస్తుంది. సామాన్యులు చేయలేరు. కొన్ని సంస్థలు గానీ, సంఘాలు గానీ కలసి పూనుకోవాలి. మామూలుగా చిన్నచిన్న పనులతో పరోపకారాలు చేసేవాళ్ళూ వుంటారు.

వేసవి కాలంలో నాల్గు కుండలలో నీళ్ళు నింపి దారినపోయే వాళ్ళకి దాహం తీర్చుతారు. చిన్న చిన్న పళ్ళాలలో నీళ్ళుపోసి కిటికీ ఊచల మీదో, పైన గట్టుమీదో పెడతారు. ఆ నీళ్ల పక్షుల కోసం! నోరులేని జీవాలకి దాహం తీర్చటం ఎంతో గొప్ప విషయం. ఇంకా కొందరు 'పంచదార' చిన్నచిన్న చీమల పుట్టల దగ్గర పోస్తారు. ఇదెంతో మహత్కార్యం.

గుడికి వెళ్ళి దండాలు పెట్టి మొక్కులు మొక్కేవారికంటే గుడి ముందర భిక్షులకి దానం చేసేవారు నిజంగా సహృదయులు. ప్రతిరోజు ఇలా రోడ్లమీద చూస్తూనే వుంటాం. వికలాంగులు, అనాధలు ఎందరో కనిపిస్తారు. ఒక్కసారైనా వారికి కడుపునిండా తిండి పెట్టగల్గితే ఎంత బాగుంటుందీ?

కొండలెత్తి కోవెల కట్టలేకపోయినా దారిలో రాళ్ళు రప్పలు లేకుండా శుభ్రం చేయగల్గితే ఆత్మానందం కలుగుతుంది. ఉడుత ఇసుక రేణువులు సముద్రంలో కలపాలనుకుంది. అది ఎంత చిన్నదైనా దాని 'పరోపకార గుణం' మేరు పర్వతమంత ఎత్తైనది.

అలాగే... మనం ఏదో ఘనకార్యాలు చేయాలనుకోవటమో లేక చేయలేమే... అనుకుని నైరాశ్యానికి లోనుగావటమో కానక్కర్లేదు. ప్రతి సహృదయంలో 'పురుషార్థం' కనిపిస్తుంది.

ఈనాడు ఎన్నో సంస్థలు బహుమతులు, కానుకలు ఇస్తూ చాలా ధనం వ్యయం చేస్తున్నారు. బీద విద్యార్థులు, అనాథ బాలికలు దారిలేక అలమటిస్తున్న వారున్నారు. వారికి పుస్తకాలు, బట్టలు, భోజన వసతి చేయగల్గితే ఎంత పురుషార్థం...?!

ప్రతి పనికి డబ్బుతో లాభనష్టాలు చూసుకోకూడదు. మనకి చేతనైన పని ఎంత చిన్నదైనా ఇతరుల కోసం చేయటం 'మానవత' అనిపించుకుంటుంది. కనీసం పక్కవాడు నిరాశ పడుతున్న సమయంలో ధైర్యం చెప్పి వాడిలోని మనోశక్తిని గుర్తుచేసినా గొప్పవిషయమే. ఎంతోమందికి అవకాశాలు రాక వారికున్న నైపుణ్యాన్ని వినియోగించుకోలేక క్రుంగిపోతూ వుంటారు. అలాంటి వారికి ప్రోత్సాహాన్నిస్తే ఎంతోమేలు చేసినవారమవుతాం.

పూర్వం ఇంటిముందు గూట్లో దీపాలు పెట్టేవారు... బాటసారుల కోసం! వరికట్టలు కట్టేవారు... పిచుకల కోసం! ఈనాడు అవన్నీ చేయలేకపోయినా కనీసం వీధిదీపాలు, బస్సులు, రైళ్ళు తగల బెట్టకుండా వుంటే అదే అతిపెద్ద పురుషార్థం !!





# విరాళాలు !

సమాజంలో ప్రతివాడు అన్నివేళలా సవ్యంగా బ్రతకలేక పోవచ్చును. అనుకోకుండా ఎవరికైనా ఆపద రావచ్చును. లేదా అత్యవసర పరిస్థితి కలిగి డబ్బు కావల్సివస్తుంది. ఆ సమయంలో బంధుమిత్రుల సహాయం కోరటం సహజం! వారు కోరకుండా ఇచ్చిన సందర్భాలూ వుంటాయి. ఇలా సాటి మనిషికి చేయూతనివ్వటం సామాన్య విషయం.

ఒకరికైనా, ఇద్దరికైనా, పదిమందికైనా సరే... ఏ ఒక్కరో చేయూతనివ్వలేని పరిస్థితిలో తలొక చెయ్యివేసి సహాయపడటమే 'విరాళాలు' ఇచ్చి సహకరించటం అని మనం అంటూ వుంటాం. అంటే... పదిమందీ కలసి ఇతరులని ఆదుకునే ప్రయత్నమే విరాళ రూపంగా గోచరిస్తుంది.

కొన్ని సంస్థలు శాశ్వత ప్రతిపాదిత రూపంలో కొంత ధనాన్ని నిల్వ వుంచుతాయి. ఆ విధమైన పద్ధతి వలన అత్యవసరం వచ్చినప్పుడు వెంటనే సేవా కార్యక్రమం ప్రారంభించ గల్గుతాయి.

ప్రకృతి వైపరీత్యాలని ముందుగా అంచనా వేయలేము గనుక ఈ రకమైన సంస్థల నిధులు ఎంతో ఉపకరిస్తాయి. ఇవికాక అనాథలు, వికలాంగులు, దీనులు మన సమాజంలో ఎందరెందరో వున్నారు. వీరికొరకు ఆశ్రమాలు కూడా వున్నాయి. ఇవి ఏ ఒక్కరి వల్లా నడవవు. కాబట్టి వారు విరాళాలు సేకరిస్తారు. ఆ సేకరించినదంతా వారికోసం వినియోగిస్తారు.

మనకి చాలా అనుభవంలోకి వచ్చే విషయాలు కొన్ని వున్నాయి. రోడ్డుమీద బ్యాండ్ వాయిస్తూ కొంతమంది పిల్లలు అప్పుడప్పుడు వస్తూ వుంటారు. వారు ఒక రిజిష్టర్ పుస్తకం పట్టుకుని ఇంటింటికి

వెళ్ళి చందా అడిగి సంతకం పెట్టించుకుని తీసుకుంటారు. పూనా, బొంబాయి, నాగపూర్‌ల నుంచి వీళ్ళు అనాథ ఆశ్రమాల చందాల కోసం వస్తూ వుండటం మనం గమనిస్తాం.

అలాగే... 'సర్వోదయ' మండలివారు 'సర్వోదయపాత్ర'ని తెచ్చి వారానికొకసారి బియ్యం, డబ్బులు తీసుకెళుతూ వుంటారు. కుష్టురోగుల సంస్థవారు కూడా చందాలకి వస్తూ వుంటారు. ఇవన్నీ సామూహిక, సంఘ సేవా కార్యక్రమాలు.

అయితే... అప్పుడప్పుడు ఒక కళాకారుడికో, గురువుకో, విద్యార్థికో, పేదవాడికో, చితికిపోయిన తోటి ఉద్యోగికో సహాయం చేసే నిమిత్తం పరిచయస్థులు, మిత్రులు అందరూ బాధితులకీ, అనాథలకీ, ఆర్తులకీ ఈ రకమైన సహాయాన్ని చేయటం మాత్రమే 'విరాళం' అనిపించుకుంటుంది. అంతేకాని, ఒకరిని అభినందించే వేళలో, సత్కరించే వేళలో, శుభకార్యాలలో నలుగురూ కలసి డబ్బు వేసుకుని బహుమతిని ఇవ్వటం చందాలు వేసుకున్నట్టు భావించరాదు. అలాగే... ఏవేవో కార్డులు, కరపత్రాలు ఇచ్చి డబ్బులు అడిగేవారుంటారు. అదీ చందాలిచ్చే పద్ధతి కాదు. అది ఒక రకం యాచన అవుతుంది.

అందుచేత డబ్బు ప్రోగుచేసి ఇవ్వటం అనే ప్రతి పనికీ చందాలు వసూలు చేయడమని కానీ, విరాళాలు ఇవ్వటమని కానీ అర్థం కాదు. అలాగే... కేవలం దీనత్వం బాపి ఆర్థిక సహాయం చేయటం కోసమే విరాళాలు సేకరిస్తారనీ చెప్పరాదు.

దేవుడి కళ్యాణానికీ, సభలకీ, గ్రంథాలయాలకీ, గ్రామ ఉద్ధరణకీ చేసే విరాళాలు వుంటాయి. ఇవి సమాజపరమైన శ్రేయస్సుకీ, సంతోషాలకీ సంబంధించినవి.

కనుక విరాళాలంటే పదిమందీ కలిసి ఒక మంచికోసం కానీ, బాధితులని ఆదుకోవటం కోసం కానీ వినియోగించవలసిన డబ్బు. 'ఇంటింటికొక పూవు, ఈశ్వరునికొక మాల' అన్న అక్షర సత్యమే విరాళం యొక్క ప్రత్యక్ష సాక్ష్యం. ఇటువంటి పవిత్రమైన విరాళాలు దుర్వినియోగం కాకుండా ప్రజలంతా జాగ్రత్త వహిస్తే మానవత మరణించదు !!





# సౌందర్యోపాసన

ఈ ప్రకృతి యావత్తు ఒక అందమైన నిధి! మనసుండీ, ఆలోచన గల్గి, నిశితంగా చూసేవారికి ప్రతిచోటా, ప్రతి మలుపులో ఓ అందం గోచరిస్తుంది! చాలామంది వారి మనస్సుకి నచ్చి వారిని ఆకట్టుకునే వస్తువులు గానీ, ప్రకృతి దృశ్యాలు గానీ, మనుషులు గానీ కనిపిస్తే ఆనందంతో పులకిస్తారు. కొందరు అందమైనవి సేకరించి, దాచిపెట్టటమో, ప్రదర్శించటమో చేస్తుంటారు. అందాన్ని ప్రేమించటంతో సరిగాక, ఆ అందాన్ని ఉపాసించటం, అంటే... 'ఆరాధించటమే' "సౌందర్యోపాసన"!

ఏదైనా అందంగా వుందనిపిస్తే ఆ వస్తువుని కొని ఇంట్లో అలంకరిస్తారు కొందరు. మరికొందరు పూలచెట్లు పెంచి అందమైన పూలని ప్రాణాధికంగా చూసుకుంటారు. ఇక దుస్తులు ఎక్కడెక్కడ కంటికింపుగా వుంటాయో ఎంత దూరమైనా సరే, ఎంత డబ్బైన సరే వెళ్ళి కొనుక్కుంటారు. మరికొందరు గంటల తరబడి తమని అలంకరించుకుంటూనే వుంటారు! ఇలా ఎవరి మనోభిరుచినిబట్టి వారు సౌందర్యాన్ని ఆరాధిస్తూ వుంటారు! వీరందరిలో ఈ శరీర సౌందర్యోపాసకులకి మరీ శ్రద్ధ ఎక్కువ! ఉదయం లేచిన దగ్గర్నుంచీ దంతరక్షణ దగ్గర గంట, ఆ తర్వాత శరీరానికి మెరుపు రావటానికో, ఉన్న నిగారింపు తగ్గకుండా వుండటానికో నిమ్మరసం త్రాగుతారు. నూనె మర్దనా చేసుకుంటారు. ఆ పైన స్నానాల వద్ద రకరకాల సబ్బులు, షాంపులు ఉపయోగిస్తారు. దుస్తులు ధరించటానికి ఎన్నెన్నో భంగిమల్లో చూసుకుంటారు. తల దువ్వటంలో ముఖ వర్చస్సును పెంపు చేసుకుందుకు వారు ఉపయోగించే క్రీములు, పౌడర్లు, నూనెలు, పిన్నులు... ఎన్నెన్నో? పెదాలకి రంగు, గోళ్ళకి రంగు, అవసరమైతే తలకి

రంగు ఇలా అనుక్షణం రంగులు, పూతలతో మేము అందంగా అలంకరించుకుంటున్నామని భావిస్తారు. ఇళ్ళలో వాళ్ళకి చేతగాక పోతే అందాల నిలయాలకి (బ్యూటీ క్లినిక్) వెళ్ళి డబ్బుపెట్టి అలంకరణ చేయించుకుంటారు. ఇలాంటి సౌందర్యోపాసన ధనవంతులకీ, ఎక్కువగా స్త్రీలకే పరిమితం! అయితే... పురుషులలో కూడా సౌందర్యాన్ని ఆరాధించేవారు లేకపోలేదు. వారు కూడా శరీరాన్ని అలంకరించుకునేందుకు తాపత్రయపడుతూ, రకానికో కొత్త ఫేషన్‌తో దుస్తులు, కళ్ళజోళ్ళు, కాళ్ళజోళ్ళు, కర్చీఫ్‌లు, క్రీములు, సెంట్లూ వాడుతూ జీవితంలో ఈ అందానికే ప్రాముఖ్యతనిస్తారు. వీళ్ళనే 'విలాస పురుషులు' అంటారు.

కొందరు అందమైనవాళ్ళని చూస్తూ ఆనందిస్తారు. ఇదొక రకం సౌందర్యోపాసన! ఆహార పానీయాలకంటే కళ్ళకి ఇంపుగా కనిపించే వస్తువులు కొని తమ సౌందర్యాసక్తిని ప్రదర్శిస్తారు. ఇంటిని స్వర్గంలా అలంకరించే వాళ్ళుంటారు. తోటల్నీ, పువ్వుల్నీ కంటికి రెప్పలా పెంచి పిట్టవాలినా సహించలేని వాళ్ళూ వుంటారు. తాగే పాత్రలు, తినే కంచాలు, కూర్చునే కుర్చీలు, పడుకునే మంచాలు అన్నీ అందమైనవి వుంచాలనుకునేవారు కొందరు.

ఈ సౌందర్యోపాసనలన్నీ బాహ్యానికి సంబంధించినవే! ఇవి ఎన్నాళ్ళు చేసినా నిలిచే అందాలు కావు! ప్రకృతి సహజమైన అందాలు రావు! కలకాలం నిలిచేదీ, అన్నివర్గాల వారికీ సమానమైనదీ... ఆత్మ సౌందర్యం లేదా హృదయ సౌందర్యం! ఆ సౌందర్యం తరగదు, కరగదు. 'చిరునవ్వు' దీనికి మెరుపు! 'శాంతం' అనేది సబ్బులు, పౌడర్లు. ప్రేమతో కూడిన పలకరింపుకి ఏ సెంటూ సాటిరాదు. సహనం, కలుపుగోలుతనం అందమైన దుస్తుల్లా అమరి, వాళ్ళు ఎక్కడనుంచుంటే అక్కడ సౌందర్యం వెల్లువై ప్రవహిస్తుంది! నిజమైన సౌందర్యోపాసకులు వీరే!!





# కర్తవ్య పాలన !

ఎవరికైనా ఒక పనిని ఒప్పచెప్పి 'నువ్వు ఈ పని చేయాలి! ఇది నీదే భారం!' అని వారికి బాధ్యతని అందచేస్తే ఆ తీసుకున్న బాధ్యత పూర్తి చేయటమే కర్తవ్యపాలన! తాను సమ్మతించిన కర్తవ్యాన్ని పూర్తిగా నిర్వహించాలి. అప్పుడే కర్తవ్యపాలన అనిపించుకుంటుంది గానీ, కొంతవరకు చేసి ఆ తర్వాత బద్ధకించో, అశ్రద్ధ వల్లనో, చేతకాకనో వదిలివేస్తే ఆ కర్తవ్యం పూర్తికాదు.

మరొక విషయం కూడా వుంది. చిన్న చిన్న పనులు కర్తవ్యపాలన క్రిందికి రావు. 'కర్తవ్యం' అనే పదంలో గురుతరమైన బాధ్యత, ధర్మం, పరోపకారంలాంటి మంచి ఫలితాలు ఇమిడి వుంటాయి. దేశాన్ని పరిపాలించే నాయకులది. కర్తవ్యపాలన! రాష్ట్రాలని ఏలే మంత్రులదీ కర్తవ్య పాలనే. పెద్ద పెద్ద సంస్థలనీ, ఫ్యాక్టరీలనీ చూసేవాళ్ళూ కర్తవ్యపాలకులే! ఆఫీసుల్లో ప్రతిఒక్కరు వారి వారి బాధ్యతలు సరిగా చేయటంలో కర్తవ్యపాలనే వ్యక్తం అవుతుంది.

తండ్రి లేదా ఇంటి యజమాని భార్యా బిడ్డలనీ, వృద్ధులైన తల్లితండ్రులనీ ఇంకా తన ఆధారం కోరే కుటుంబ సభ్యులనీ చూసుకోవటం కర్తవ్యపాలనే అవుతుంది.

ఈ కర్తవ్యం అనేది రెండు రకాలు.

ఒకటి... ఎవరో ఒకరు మనపైన ఒక బాధ్యతని నిలపటం. రెండోది... మనకి జన్మతః సంక్రమించిన బాధ్యత.

ఈ రెండో బాధ్యత మనంతట మనమే నిర్ణయించుకుని చేయాల్సి వుంటుంది. సాధారణంగా వివాహం కాగానే సంసారం భారం వహించవలసి వస్తుంది. ఇది ఎవరూ చెప్పనక్కర్లేదు. అయితే... 'ఇంతవరకే నా కర్తవ్యం' అనుకుంటారు చాలామంది. అది పొరపాటు. కర్తవ్యపాలనలో 'ధర్మం' వుందని తెలుసుకున్నాక 'ఆ ధర్మం ఎటువంటిది'? అని ప్రశ్నించుకుంటే జాలి, మానవత్వం లాంటివి కనిపిస్తాయి. ఆ తర్వాత రక్త సంబంధీకులు వంశానుబంధం గలవారూ కనిపిస్తారు. వారిని గురించి కూడా మనం బాధ్యత తీసుకోవలసి వుంటుంది. 'మనుధర్మం'లోనూ, నేటి మన హిందూ న్యాయశాస్త్రంలోనూ కూడా ఇలాంటి విషయాలు ఉద్ఘాటించే వున్నాయి.

మన దాయాదుల్లో (పాలిపంపుల్లో) ఎవరైనా హీనదశలో వుంటే వారిని ఆదుకుని వారి బాగోగులు చూడవలసిన బాధ్యత మనమీద వుంటుంది. సాధారణంగా ఎవరూ ఈ విషయం పట్టించు కోరు. ఎంతసేపు తన కుటుంబానికీ, తనకీ సుఖభోగాలు చూసుకోవటమే గానీ, 'ఆ! వాళ్ళ బాధ్యత నాకేమిటీ?' అనుకుంటారు. కానీ... 'కర్తవ్యం' అనేది ఎల్లవేళలా ఎవరూ చెప్పనక్కర్లేదు. మనకై మనం చేపట్టవచ్చును. శాస్త్ర ప్రమాణాలు కొంత తెలుసుకుని గోరంత మానవతని సంతరించుకుంటే ఏ కర్తవ్యం పాలించాలో మనకి తెలుస్తుంది.

పరిపాలించే నాయకులూ, ఫ్యాక్టరీల డైరెక్టర్లూ, ఆఫీసర్లూ ఇలా ప్రతి రంగంలోని వారూ తమకి వర్తించే లాభాలూ, పరిమితమైన పనులూ మాత్రమే తెలుసుకుంటారు గానీ, పెద్ద మనసుతో కర్తవ్యాలని విస్తరింపచేసుకుని అందరి మంచిని చూడాలనుకోరు. అలాగే... కుటుంబాలలో ఆస్తుల కోసం న్యాయచట్టాలు తిరగేస్తారు కానీ, కర్తవ్యం నిర్వహించాల్సినప్పుడు ముఖం చాటు చేస్తారు. సగటు మనిషికి 'కర్తవ్యం' అనేది చిన్న పరిధిలోనే వుంటుంది. ఆ పరిధి విశాలం చేసుకున్నవారే మహామహులు. ధర్మోద్ధారకులు, త్యాగమూర్తులు. వారికోసం స్వర్గధామంలో ధర్మఘంట ఎడతెరిపి లేకుండా మ్రోగుతూ వుంటుందిట !!?





# సన్మానమంటే!

ఈ సకల చరాచర ప్రపంచంలో ఎన్నో రకాల శక్తులు వాటి ప్రభావాలు వ్యాపించి వున్నాయి. అందులో కొన్ని మంచివి, కొన్ని చెడువి వుంటాయి. మనం మంచిని కోరుకున్నప్పుడు జాగ్రత్తగా ఆ మంచి ప్రభావాన్ని మాత్రమే గ్రహించి మిగతాది వదిలేయాలి. మనుషుల్లో మంచి గుణాలూ, ప్రవర్తనా, విశేష ప్రజ్ఞలు కల్గివుంటే, అవి ఇతరులకి ఆమోదనీయమైనవైతే అటువంటి వ్యక్తులని గౌరవించి వారినుంచి మంచిని అంతా గ్రహించాలి.

'సన్-మానం'! అంటే మంచిని గుర్తించటం లేదా గౌరవించటం - అని తెలుసుకోవాలి.

అటువంటి వ్యక్తుల్ని వేదికపైన, సభాముఖంగా వారి గొప్పదనాన్ని అందరికీ తెలియచేస్తూ- ఆ విశేష శక్తుల్ని పరిచయం చేస్తూ వాటిని మనం ఎందుకని గౌరవిస్తున్నామో తెలియ చెయ్యటమే సన్మానంలోని ముఖ్య ఉద్దేశం. ఈ విధంగా చేయటం వలన మంచినీ, పవిత్రతనీ మనం పూజించి సమాజానికి ఓ చక్కని సందేశం అందిస్తున్నట్టు లెక్క! అనేక రకాల సన్మానాలు వుంటాయి. సమయం, సందర్భం బట్టి అవి చేస్తుంటారు.

పూర్వం వివాహాది శుభకార్యాలలో 'సదస్యం' తంతు వుండేది. వేద పండితులనందర్నీ పిలిచి వేదపఠనం చేయించి వారి వారి అర్హతల్ని బట్టి వారికి దక్షిణ తాంబూలాది సత్కారం చేసి గౌరవించేవారు.

అదేవిధంగా పర్వదినాలలో విద్వత్ గోష్టులు జరిగేవి. దేవాలయాల్లో పండిత ప్రవచనాలు, తర్క వితర్కాలు జరిపి సత్కరించేవారు. పండితులలో విశేషించి 'ఘనాపాఠీ'లు ప్రజ్ఞగలవారుగా కీర్తించబడుతారు.

ఈరోజుల్లో సాహితీపరులనే కాక కళాకారులందర్నీ గుర్తించి సన్మానించటం సంతోషించ దగ్గదే.

కానీ... ఒక మంచిని గుర్తించి సన్మానించవలసిన ఘట్టంలో నిజాయితీ, ఋజువర్తనం లేకుండా అవకతవకలు జరుగుతున్నాయి. సన్మానించటం అనే కార్యక్రమం మాత్రమే ముఖ్యోద్దేశమై 'ఘనత, ప్రజ్ఞలకి' స్థానం లేకుండా పోతోంది. అంటే... అర్థమే మారిపోతోంది. విలువలేని సన్మానాలు స్వార్థం కోసమే తప్ప సభికులకి ఉపయుక్తం కావు.

సానుభూతి వల్లనో, స్వలాభం ఆశించో సన్మాన కార్యక్రమాలు చేయటం వల్ల మనల్ని మనం మోసపుచ్చుకుని సమాజాన్ని తప్పుదారి పట్టిస్తున్నామన్న మాట. వీడ్కోలు సమయాల్లో, ఆహ్వాన సందర్భాలలో చేసే సన్మానాలకీ ఓ అర్థం వుంటుంది.

సన్మానాలు, సత్కార్యాలలో దైవసంపద నిండి వుంటుంది. అది అపసవ్యం అయినప్పుడు దోష ప్రభావం చుట్టుకుంటుంది. ఆ కారణంగా అర్థరహితంగా చేసే పనులకి వృధాప్రయాసే కాదు... అనర్థకం కూడా మనకి తెలియకుండానే వెంబడిస్తుంది. అసలు సన్మానితులైన వారు వేదిక నెక్కినప్పుడు వారి బాధ్యత గురుతరమవుతుంది. పదిమంది ఎదుట తాను అభిముఖంగా నిలిచి ఉపన్యసించటమంటే తాను వారందరి కన్నా మిన్న అయి సామర్థ్యం కలిగివుండాలి. వేదిక ఎక్కటం అంటే ఏదో గట్టో, పుట్టో, ట్టో ఎక్కటం కాదు. సమాజానికి సందేశం ఇచ్చి అది నిలుపుకో గల్గాలి. సన్మానం అనేది 'వ్యక్తి'కి దు, వ్యక్తిత్వానికి! అది సక్రమంగా జరగాలి. బాహ్యంగా మనిషికి చేస్తున్న సత్కార్యం అంటే... గంధం, పన్నీరు, పూలమాల, శాలువా లాంటి మన్ననలన్నీ అంతర్గతంగా వున్నవారి శక్తి సామర్థ్యాలకే! కనుక విద్వత్‌ని సన్మానించాలి.

ఒక మంచిని చూడాలన్నా, చేయాలన్నా మనిషి ముందు దాని అర్థం గ్రహించి చేయాలి. అప్పుడే దానికి రాణింపు !!





# స్థానబలం!

ఎప్పుడైనా కొత్తచోటుకి వెళితే మనకి బెరుకు, భయం, దడగా వుండటం సహజం! అదే కొంత అలవాటు పడిన తరువాతో, లేక చాలాకాలంగా అలవాటు వుంటేనో మనం భయపడం. చాలా మామూలుగా, నిర్భయంగా, స్వేచ్ఛగా వెళ్ళగల్గుతాం. ఎందుచేత? ఆ స్థలం మనకి ముందే తెలుసు. అక్కడి వాతావరణం మన అనుభవంలో గుర్తుంటుంది. కనుక సునాయాసంగా వెళ్ళగలం. ఇలాగ మనకి బాగా అనుభవం లేదా అలవాటున్నచోట మనకి కొంత ప్రాముఖ్యత కూడా వుంటుంది. మనం అధికారం చేయగల్గుతాం. పనులు సాధించుకోగల్గుతాం. అదే 'స్థాన బలం' అంటే.

కష్టజీవులు, కార్మికులు, శ్రామికులు కొంతకాలంగా ఒకచోట నివసిస్తే అక్కడ వారికి బలం పెరుగుతుంది. గుడిసెవాసులు కాగల్గుతారు. అదేవిధంగా కాలనీల్లో వుండేవారు ఒకేచోట పాతిక ముప్పై సంవత్సరాలు వుంటే వారికి ఆ కాలనీలో ప్రాముఖ్యత పెరుగుతుంది.

అందరిమీద పెత్తనం చేయడం, సలహాలివ్వడం, మీటింగ్‌లు పెట్టడం చేస్తుంటారు. ఒక విధంగా సీనియారిటీ సంపాదించటమే.

ఆఫీసుల్లో చూడండి... కొత్తగా ఉద్యోగానికి వచ్చేవారు ఎంత బిడియంగా వుంటారో? ఐదారు సంవత్సరాల తర్వాత కొత్తవాళ్ళని వాళ్ళే హేళన చేస్తుంటారు! కాలేజీల్లోనూ ఇంతే! ఒక కంపెనీలో అటెండర్ పర్మినెంట్‌గా వుంటే, వాడే ఆఫీసరో, ఛైర్మనో అన్నంత ధీమా చూపించి రూల్స్ కూడా చెప్పగలడు.

మామూలు గృహ వాతావరణంలో చూడండి... కొత్తకోడలు బెంబేలు పడుతుంది. పదేళ్ళ తరువాత ఇంటి అజమాయిషీ అంతా తానే చూస్తూ గడగడలాడించగలదు! ఆఖరికి... పనిమనిషి కూడా ఒక ఇంట్లో ఎన్నో సంవత్సరాలు పని చేస్తూ వుంటే ఆ ఇంట్లో ఆమెకి ఎంతో చనువు, అలవాటు, ఇంటివాళ్ళతో పాటు స్వేచ్ఛ లభిస్తుంది. ఇది 'స్థానబలం' వల్లనే జరుగుతాయి.

మనం చాలాసార్లు గమనిస్తూనే వుంటాం. కొంతమంది తమకి ఏ విధమైన పొత్తు కాకపోయినా, అధికారం లేకపోయినా, కొన్ని ప్రదేశాల్లో 'హుకూం' చెలాయించి అక్కడకి మరొకర్ని రానివ్వరు. నిజానికి చాలాకాలంగా వాళ్ళు అక్కడ వుండటం చేత ఏర్పడిన బలం తప్ప ఇంకే విధమైన చట్టరీత్యా వారికి సాక్ష్యం వుండదు. అలాంటివారే బడ్డీకొట్లు -ఇలాంటి అనేకరకాల వాళ్ళు!

ఇవన్నీ కాక మనిషికి కొన్ని స్థానబలాలుంటాయి. అవి వాళ్ళ రాశిబలాలన్నమాట.

ప్రతివాళ్ళకీ, వాళ్ళ జన్మనక్షత్రాన్ని బట్టి కొన్ని గ్రహాలు వాళ్ళని చుట్టుకుని వుంటాయి. అవే కాలచక్రంలో గ్రహకూటమి - అంటే... కాలం అనే చక్రంలో తిరుగుతూ ఆ మనిషి మీద ప్రభావం చూపిస్తాయి. ఒక్కొక్క గ్రహానికి ఒక్కొక్క బలం వుంటుంది. జన్మించినప్పుడు ఎవరు ఏ గ్రహస్థితిలో పుడ్తారో ఆ గ్రహ ప్రభావం వాళ్ళమీద పని చేస్తుంటుంది. మంచి యొక్క స్థానబలం గొప్పగా వుందని భావిస్తారు. అలాకాక మంచీ, చెడుల కలయికలో మిశ్రమ ఫలితంగా వుంటుంది.

మనపై గ్రహాల ప్రభావం కూడా ఆ మోతాదులోనే వుంటుందన్న మాట! అదే విధంగా మనలోని అంతర్గత గుణాల్లో దేని బలం ఎక్కువగా వుంటే మనం దానికి లొంగి వుంటాం.

మొత్తం మీద విజ్ఞానశాస్త్రం కానీ, జ్యోతిష శాస్త్రం కానీ, తెలియచేసేది ఒకటే. మన నుంచి నిరంతరం బయటికి వెళ్ళే కిరణాలూ, అలాగే బయటినుంచి మనపై ప్రసరించే కిరణాలూ సమ ఉజ్జీలుగా వున్నప్పుడు మన స్థానం పటిష్టంగా వుంటుంది. మన ఉనికి ప్రస్ఫుటమవుతుంది. కనుక మంచి వాతావరణం, మంచి మనుషుల మధ్య మనం ఊపిరి పీల్చుకుని బాగుపడదాం !!






# స్వకర్మాచరణ !

బాల్యంలో మనం ఎన్నో నీతికథలు చదువుకుంటూ వుంటాం! పెరిగి పెద్దయ్యాక ఒక్కసారి వాటి తాత్పర్యాన్ని నిజ జీవితంతో పోల్చుకుని చూస్తే ఆ నీతి బాగా అర్థమవుతుంది.

కుక్కా, గాడిద, చాకలివాని కథ సాధారణంగా అందరికీ తెలిసినదే. దొంగ వస్తున్నాడని చూసి కూడా అరవకుండా ఊరకున్న కుక్కని చూసి, గాడిద కోపించి యజమానికి మేలు చేద్దామన్న ఉద్దేశంతో తను ఓండ్రపెడ్తుంది. ఫలితంగా యజమాని చేత 'బడితె' పూజ చేయించుకుంటుంది.

ఇక్కడ గాడిద స్వభావం మంచిదే కావచ్చును. కానీ... తనకి సంబంధం లేని బాధ్యత పెట్టుకోటం వలన చావుదెబ్బలు తినవలసి వచ్చింది గదా?

మన జీవితంలో కూడా అంతే! మనకి ఏది నియమితమో, ఏది చెయ్యాలో ఆ పని చేస్తేనే విలువ, గౌరవం! మనకి సంబంధించని కార్యాలు నెత్తిన వేసుకుని చేయటం వలన గౌరవం, మాట అటుంచి అవమానం, నిందలు పడవలసి వస్తుంది. కనుక 'స్వకర్మాచరణ' మనిషికి ధర్మం.

కొందరికి తాము చేస్తున్న ఉద్యోగం కన్నా ఇతరుల వృత్తిమీద మోజు ఎక్కువగా వుంటుంది. అనేకసార్లు తన పదవిని నిరసించుకుంటూ 'నేను ఫలానా ఉద్యోగం చెయ్యాలనుకున్నాను. కానీ, నా కర్మ ఇలా ఏడ్చింది' అని బాధపడుతూ వుంటారు. ఈ 'కర్మ' అనీ 'అదృష్టం అనీ చెప్పుకునే కోణంలోనే అతని (ఆమె) జీవితచక్రం తిరగవలసి వుందని నమ్మరు.

జాతకాలు చూసుకుంటారు. వాస్తుశాస్త్రం పరీక్షిస్తారు. కానీ... మనకీ ఈ మార్గమే వ్రాసి వుందేమో- అని తలచరు. అంతమాత్రం చేత నిరాశావాదాన్ని బలపరచటం కాదు. కానీ, మనం ఎంత ప్రయత్నించినా సాధించలేని పనులవల్ల నిరుత్సాహ పడిపోవటం ఇతరులని చూసి భ్రమించి పోవటం అంత శ్రేయస్కరం కాదు.

ఈ స్వకర్మాచరణ అనేక విషయాల్లో గ్రహించాలి. ఇల్లు, కుటుంబం, ఉద్యోగం, ఆర్థిక స్థితి, ఆహారం, వస్త్రాలంకరణ, అందచందాలు, బంధువులు... ఇలా ప్రతి రంగంలోనూ, ప్రతి మనిషికీ ఇతరులతో పోల్చిచూస్తే భేదం కనిపిస్తుంది. కనుక ఒకరి అభీష్టం మరొకరికి అయిష్టం కావచ్చును. ఎదుటివాణ్ణి చూసి మనం మురిసినట్టే అవతలివాడు తమని నిందించుకుని ఇంకొకర్ని మెచ్చుకుంటున్నాడేమో?

'మన ఇంటి (ప్లాను) పద్ధతికన్నా పక్కవాడి ఇంటి అందం బాగుంది' అని నిత్యం బాధపడ్తూ చక్కనివాళ్ళని చూసి కుమిలిపోకూడదు. మన ఇంటి ఆచార నియమాల ప్రకారం మనం నడవాలి కానీ పొరుగువాడి అలవాట్లూ, వాళ్ళ అభిరుచులూ మనం ప్రవేశ పెట్టుకోకూడదు.

'పర ధర్మము'ను చక్కగా అనుష్ఠించుటకంటే ఎంత నీచమైనను, నింద్యముగ కన్పించిననూ ఎవరి ధర్మమును వారనుష్ఠించుట మేలు. దాని వలన పాపమంటదు' అంటాడు గీతాకారుడు. ఇక్కడ పాపమంటే కష్టాలు, బాధలు అని అన్వర్థించుకుంటే చాలు. ఎవరి స్థానం, ఎవరి తరగతి, ఎవరి వ్యక్తిత్వాన్ని బట్టి వారు వారి జీవితం నడుపుకోవాలి గానీ, లేనిపోని బరువులెత్త గూడదని భావం!

సాత్వికుడూ, సత్యవాది అయినవాడు ఉద్యోగం చేసుకునే బ్రతకగలడు కానీ, వ్యాపారం చేసి రాణించలేడు. అలాగే... వృత్తి విద్యలలో మెళుకువలు తెలిసినవాడు ముక్కుమూసుకుని జపం చేసుకోలేడు.

ఎవరి స్వభావానికి తగిన స్వకర్మాచరణ వారు చేసుకోవటంలో సఫలత చేకూర్తుంది గానీ, వున్నదాన్ని వదులుకుని ఎల్లప్పుడు లేనిదాన్ని, రానిదాన్ని గురించి చింతించటం వలన జన్మ వృథా అవుతుంది. ఇదే గీతా రహస్యం.

తన వృత్తినీ, తన కుటుంబాన్నీ, తన వ్యక్తిత్వాన్ని తను గౌరవించుకున్నప్పుడు తృప్తీ, ఆనందం కల్గుతాయి. ఆత్మ న్యూనత ఆత్మహత్య లాంటిదే. కనుక స్వకర్మాచరణని ప్రేమించి ధన్యుడవాలి.






# శుశ్రూషంటే . . .

మనకి వీలు గానిదీ, చేసుకోలేనిదీ, ఇతరుల సహాయం వలన పొందుతూ వుంటాం. అలాగే మనం కూడా చేయూత నిస్తాం. ఈ సహాయం అనేక రకాలుగా వుండవచ్చును. డబ్బు, మాటసాయం, వస్త్రాలు, వస్తువులు, విద్య నేర్పడం ఇలా ఏవైనా కావచ్చును.

కాని శరీరం, రుగ్మత చెందినప్పుడో, గాయాలు, దెబ్బలు తగిలినప్పుడో, అంటే... ప్రమాదాలు జరిగినప్పుడు మన శరీర అవసరాల్ని మనం తీర్చుకోలేము. అదేవిధంగా ఇతరులకీ మన అవసరం కల్గుతుంది. ఈ విధంగా మనం పరులకి, శారీరక సేవ చేయడాన్ని 'శుశ్రూష' అంటాం.

ప్రతి తల్లిదండ్రులు పిల్లలకి శుశ్రూష చేసి పెంచి పెద్దచేయాల్సి వుంటుంది. అయితే... 'సేవ' అనిపించుకోదు. బాధ్యత అవుతుంది. పశువులు, పక్షులు, ఇతర జీవులు అన్నీ కన్న పిల్లల్ని తమ శక్తికొలది, ఆహారపానీయాల నందించి పెంచుతాయి. కనుక తమ పిల్లలకి చేసే సపర్యలు శుశ్రూష కావు. ఇంట్లో వృద్ధులైన బంధువులు, అస్వస్థులైన వారూ వుంటారు. వారికి సహాయపడడం, స్నానాదికాలు. అన్నపానీయాలు అమర్చడం, మందులు ఇవ్వడం, బట్టలు వేయడం, పక్క శుభ్రపరచడం ఇత్యాది పనులన్నీ సేవక్రిందలెక్క. కన్ను కనిపించని బామ్మలకో, అమ్మమ్మలకో, తాతలకో గ్రంథపఠనం చేసి వినిపించినా అదే అర్థం!

ఇవన్నీ కొంతవరకు మొదటి స్థానంలోనివే. అలాకాక విద్యనేర్పిన గురువులకీ, ఉపదేశం పొందిన గురువులకీ, దైవభావంతో సేవ చేసేవారుంటారు.

పూర్వపు రోజుల్లో గురుశుశ్రూషచేసి సకల విద్యలూ నేర్చుకునేవారు. అంటే... గురుసేవయే గురువుగార్కి ఇచ్చే దక్షిణ! ఇంటికి ఎవరైనా అతిధులు వస్తే వారికి ఉపచారం చేసేవారు. స్వాములు, యతీంద్రులకి శుశ్రూష చేసి ఆశీస్సులు పొందేవారు. దీర్ఘరోగగ్రస్థులకి అహోరాత్రాలు సేవచేసిన వారూ వుంటారు.

ఇక్కడ ఒక సత్యం గమనించాలి. అవసరమైన సేవ చేయడంలో ఒక పరమార్థం వుంది. అవసరం లేకపోయినా కేవలం దైవంగా భావించి శుశ్రూష చేయడంలో ఆత్మార్పణ వుంది. కనుక శుశ్రూష అనేది తనలోని అహంకార గర్వాలని మరచి అర్పించుకోవడమే! ఇలా నిష్కల్మష హృదయంతో సేవచేసి సంతృప్తి పడడం రెండోస్థానం!

ఇక... ఏ సంశయాలు, అవసరాలు, ప్రత్యుపకారాలు కోరకుండా దీనజనులకీ, వికలాంగులకీ సేవ చేయడం మూడోస్థానం! అదే మహోన్నత స్థితి.

అనగా బంధుజనం, గురువులు, మునీశ్వరులు - వీరి అందరినీ సేవించడంలో రవ్వంత ప్రతిఫలాపేక్ష గానీ లేదా మనం వారినుండి పొందిన ఉపకారానికి ప్రత్యుపకారం గానీ తొంగి చూస్తుంది. కానీ... ఏవిధమైన సంబంధం లేని దీనుల సేవలో సాక్షాత్తు భగవంతుడికే పూజ చేసిన ఫలితం లభిస్తుంది.

వివేకానందుడు రోగులకి సేవ చేయమని బోధించేరు. మనం నర్సులుంటారు కదా... అనుకోవచ్చును. కానీ, డబ్బు తీసుకుని కాదు - వారానికి ఒక్కసారైనా ఆసుపత్రిలో రోగులకి మనం శుశ్రూష చేయగల్గితే ఎంత బాగుండునూ? వికలాంగులకి చిన్న సహాయం చేయగల్గితే ఎంత తృప్తి? ఎంతసేపూ శరీర సౌందర్యపోషణ కోసం తాపత్రయపడే వారిని చూస్తే జాలివేస్తుంది. పని మనుషుల్ని పెట్టుకుని సకల చర్యలు చేయించుకునే డాంబికులని చూస్తే జుగుప్స కలుగుతుంది. మనిషి ఎంతసేపూ తన సుఖం, తన ఆనందం కోసం ఇతరుల నుంచి సహాయం కోరడం కాదు- మన పనులు మనం చేసుకుంటూ పరులకీ, నిస్సహాయులకీ సేవ చేయగల్గితే మనిషి ఎంత పవిత్రుడౌతాడు?

'శుశ్రూష'లో వున్న సంతృప్తి, ఆనందం అనుభవంలోనే అవగతమవుతుంది. మనలోని కల్మషాలన్నీ కరిగి, స్నిగ్ధంగా, స్వచ్ఛంగా మారుతాడా మనిషి!





# రుగ్మతలు !

ఎవరికైనా, ఎప్పుడైనా, శారీరకంగా అలసిపోవటం, జబ్బు చేయటం తప్పదు. జీవితంలో ఈ రోగాలనేవి మనుషులకే కాదు... పశువులకీ, పక్షులకీ, జంతువులకీ, చెట్లకీ కూడా వస్తుంటాయి.

అంతేగాదు, మానవుడు తయారు చేసుకున్న యంత్రాలు సైతం మరమ్మత్తులు చేస్తుంటే గానీ, పనిచేయవు, అంటే... సృష్టిలో ఈ రోగాలనేవి సర్వసాధారణం అన్నమాట! వీటినే 'రుగ్మతలు' అంటారు.

శారీరకమైన రోగాలే కాదు... మానసికరోగాలు కూడా మనుషులని ఆక్రమించుకుంటాయి. ఉదయం లేచిన దగ్గరనుంచి ఓ పద్ధతి, క్రమం పాటించే వారికి ఈ రుగ్మతలు ఎక్కువ బాధించవు.

రాత్రంతా 'నిద్ర' అనే మత్తులో వుండి ఉదయం లేవగానే సృష్టి అంతా కొత్తగా నూతనంగా వుంటుంది. అంటే... నిన్నటి రోజుకి వీడ్కోలు చెప్పి నేటి రోజులోకి ప్రవేశిస్తారు. అందుకు సూచనగా ముందు ముఖ ప్రక్షాళన, తర్వాత కాలకృత్యాలు తీర్చుకోవటం, స్నానాదికాలు చేయటం, ఆ తర్వాత ఆహారాది పానీయాలు తీసుకోవటంలో మనిషి క్రమబద్ధంగా వున్నట్టు లెక్క! 'యంత్రం' ఉపయోగించే ముందు దుమ్ము దులిపి, నూనె అవసరమైతే పోసి, స్క్రూలు చూసుకుని పని మొదలుపెట్టాం కదా? మానవ శరీరం అంతకన్నా విలువైనది కనుక నిద్రానంతరం దుమ్ము దులపడం (కడుగుకోవటం వగైరా) చాలా అవసరం! వంటావార్పు చేసేటప్పుడు వస్త్రధారణలోనూ జాగ్రత్తలు పాటించేవారికి

ఆరోగ్యం అంత త్వరగా పాడవదు. వృత్తిధర్మం నిర్వహించేముందు నిదానం, కాలం విలువ తెలుసుకుంటే సర్వేంద్రియాలు మన అధీనంలో వుండి, శరీరాన్ని అలసిపోకుండా కాపాడుతాయి.

కొందరు ఎప్పుడూ చిరుతిళ్ళు తింటూ వుంటారు. మరికొందరు తెగ నిరాహారాలు చేసి నీరసపడుతూ వుంటారు. ఈ రెండూ తప్పుడు మార్గాలే! నీరు ఏ పనీ సవ్యంగా చేయలేరు. శరీరావస్థలోని తేడా పాడాలవల్ల జ్ఞానేంద్రియాలకి ప్రమాదం ఏర్పడుతుంది. దానివల్లనే మానసిక రుగ్మతలు వస్తుంటాయి.

భరించలేని దు:ఖంలో మనిషికి మతిపోవచ్చును. ఎడతెగని ఆలోచనల వల్ల నరాలు ఉద్రిక్తత చెంది దీర్ఘవ్యాధులు సంభవిస్తూ వుంటాయి. రక్తపోటు, గుండెజబ్బు, ఉబ్బసం లాంటి వ్యాధులు మనిషిని గ్రహాల్లా పీడించే శాపాలు.

ఇవన్నీ మనిషికి స్వయం కృతాపరాధం వల్ల కొన్నీ, యాదృచ్ఛికంగా మరికొన్నీ సంభవమవుతూ వుంటాయి.

నాగరికత, నేర్చుకున్న మనిషి దేశ,కాల పరిస్థితులని విస్మరిస్తున్నాడు. మనదేశం వేడి గలది. పాశ్చాత్యదేశాలను అనుకరించి ముఖం కడగకుండా పానీయాలు సేవించటం (బెడ్ కాఫీలు) అనారోగ్యం, అసహ్యం! మన ఆహార విషయాలకీ, విదేశీయుల ఆహారాలకీ తేడా వుంది. మనం చలువ చేసేవి తినాలి. నిత్యం స్నానాదికాలు చేయాలి.

ఎవరి గృహాన్ని బట్టి వారు అలంకరించుకుంటారు తప్ప, పక్కవాళ్ళలా మనం చేయాలంటే మన ఇంట్లో ఆ సదుపాయాలు వుండవద్దా? దేశీయతని మరచి అనాలోచితంగా ప్రవర్తించటం చేత శారీరక రోగాలే కాదు- మానసిక జబ్బులు, తద్వారా సమాజ రుగ్మతలు - అంటే... అత్యాచారాలు, అఘాయిత్యాలు విపరీతంగా పెరిగిపోయాయి ఈనాడు.

ఆరోగ్యం బాగుంటే మనిషి మనస్సు బాగుంటుంది. మనస్సు సక్రమంగా ఆలోచిస్తేనే మనిషి సక్రమంగా ప్రవర్తిస్తాడు. సక్రమ మార్గం వల్ల సమాజ శ్రేయస్సు పటిష్టంగా వుంటుంది.

ఆరోగ్యసూత్రం మీద ఇంతటి బరువు ఆధారపడి వుంది. కనుక మనం మనల్ని సంరక్షించుకుంటూ సమాజాన్ని పరిరక్షించాలి.





# కలలు !

పసి పిల్లలు నిద్రలో ఒక్కోసారి ఏడుస్తారు. ఒక్కోసారి నవ్వుతారు. మనం ఏదో అర్థాలు చెప్పుకుంటాం. కానీ, నిజానికి వాళ్ళ స్వప్నావస్థలో వారికి మాత్రమే తెలియగల భావానికి ప్రతిస్పందనే ఆ చర్యలు !! ఆ భావం వాళ్ళు మనకి చెప్పలేరు.

పెద్దవాళ్ళు కూడా ఒక్కోసారి నిద్రలో నవ్వుతూ ఏడుస్తారు. దీనికి కారణం ఏమిటి?

జీవులకి (ఏ ప్రాణికైనా) రెండురకాల అవస్థలు ముఖ్యమైనవి. ఒకటి... జాగ్రదావస్థ. రెండవది... స్వప్నావస్థ.

పగలంతా జీవులు అలసి, మనుగడ కోసం శ్రమించి రాత్రి సమయంలో అలుపు తీర్చుకుందుకు విశ్రాంతి తీసుకోవడమే స్వప్నావస్థ! కళ్ళు మూసుకుని పడుకున్నప్పుడు పగటిపూట జరిగిన దృశ్యాంతరాలకీ మనోభావాలకీ ఒక రూపం దృగ్గోచరమవుతుంది. తాను చేయాలనుకున్నవి, చేయలేకపోతున్నవీ కలగాపులగంగా మనోఫలకం మీద చిత్రాల్లాగ కనిపిస్తాయి. అవే 'కలలు'! మనోభావాలకి ప్రతిబింబాలు!! జాగ్రదావస్థలో మనం కళ్ళు తెరచి వుంటాం కనుక అనేక దృశ్యాలు చూస్తుంటాం. అప్పుడు మనోభావాల్ని చూడలేం. అదే... కళ్ళు మూసుకుని వుంటే ఇతర దృశ్యాలు కనిపించవు గనుక మనోవీధి స్వచ్ఛంగా వుండి మన భావాలు కన్పిస్తాయి. అవే కలలు!

పెద్దవాళ్ళకి భాషాజ్ఞానం వుండటం చేత కలని గురించి చెప్పగల్గుతారు. పసివాళ్ళు చెప్పలేరు. ఆ కలయొక్క ప్రభావం మరీ ఎక్కువగా వున్నప్పుడే నవ్వటం, ఏడ్వటం అనేవి బైటకి తెలుస్తాయి.

అంటే... కల అనేది చిన్నవాళ్ళకి, పెద్దవాళ్ళకి, పశుపక్ష్యాదులకీ కూడా ఎవరి భావానికి తగినట్టు వారికి స్వప్నావస్థలో వస్తూ వుంటాయి. ఎవరి మనస్సు ప్రశాంతంగా వుంటుందో వారికి కలానుభవాలు తక్కువగా వుండవచ్చును.

కొందరు జాగ్రదావస్థలో వుండి నా కలలు పండాలనీ, నాకిన్నాళ్ళకి 'కల' నిజమైందనీ చెప్తూ వుంటారు. అంటే... స్వప్నంలోని కల కాదు. అటువంటప్పుడు వాటిని 'కలలు' అనకూడదు. ఊహాలు, ఆశలు, కోరికలు అనుకోవాలి. మనోభావమే తప్ప రూపాన్ని మనం చూడలేం. అందుచేత అవి కలలు కాదు... పగటి కలలు! నిజమైన కల నిద్రావస్థలోనిదే.

చాలామంది నిజ జీవితంలోని కలల్నీ, నిద్రలోని కలల్నీ కలగాపులగం చేసి చెప్తూంటారు. రచయితలు రాస్తూ వుంటారు. కథంతా రాసి 'కల' అని తేల్చేస్తారు. అది తప్పు! కలలో యధార్థ సంఘటనలు కన్పించవు. దాని అంతరార్థం వేరు. కల ఎప్పుడూ జరిగిన దాన్నీ, జరగబోయేదాన్నీ 'కోడ్' రూపంలో సిగ్నల్స్ (సూచనలు) ఇస్తూంటుంది. ఆ కోడ్ యొక్క అర్థమే ఆధ్యాత్మికం! అందుచేత జాగ్రదావస్థలోనివి కలలు కాదు. అలాగే కలలో యదార్థ సన్నివేశాలు కన్పించవు! అర్థాలు మార్చుకుంటే అనుభవాలు తప్పుదోవ పడ్తాయి. కలని గురించి అర్థం అందరూ చెప్పలేరు. ఆధ్యాత్మికంగా అర్థం చెప్పగల్గితే ఆ కల సత్ఫలితాన్నిస్తుంది. పూర్వం ఒక గృహిణి ఆమె భర్త ఊళ్ళో లేని సమయంలో తనకి వచ్చిన కలని గురించి ఒక పండితుణ్ణి అడిగితే అతను మంచి అర్థం చెప్తాడు. తర్వాత భర్త వచ్చాక, ఆమె ఆ సంగతి చెప్తే 'ఆ పండితుడు కల అర్థం తెల్సినవాడు గనుక బాగా చెప్పాడు. లేకపోతే ఆ రాత్రి నేను దొంగచేతిలో చావబోయి తప్పించుకున్నాను' అంటాడు భర్త.

మహాత్ముల జీవితాల్లో జాగ్రదావస్థలూ, స్వప్నావస్థలూ దివ్యంగా వుంటే సగటు మనుష్యుల జీవితాలూ, నిద్రావస్థలు 'పీడకల'లతో వుంటాయి.






# విచారణ!

ఎవరైనా ఒక తప్పుపని చేస్తే దానిమీద మరొకరు ఫిర్యాదు చేస్తారు. అప్పుడు ఆ తప్పుని గురించి పరిశీలించి వారికి శిక్ష వేస్తారు. ఇలా పరిశీలించటమనేదే విచారణ !!

చిన్న చిన్న పొరపాట్లు చేస్తే ఇంట్లో పెద్దవాళ్ళు ఆ పొరపాటును గురించి తెలియచెప్పి, సరిదిద్ది ఇకమీదట ఇలా చేయకు' అని మందలిస్తారు. కనుక చిన్న పొరపాట్లకి మందలింపే విచారణ. ఇక- విద్యార్థులు తరగతిలో ఒకరిని ఒకరు తిట్టుకోవటం, కొట్టుకోవటం లేదా వస్తువులు లాగేసుకోవటం చేస్తుంటారు. అప్పుడు తరగతి ఉపాధ్యాయుడు ఆ విషయాన్ని పరిశీలించి ఎవరివల్ల తప్పు వుందో, ఎవరికి అన్యాయం జరిగిందో విచారణ చేసి శిక్షిస్తాడు. అలాగే... పల్లెల్లో మనుషులు ఒకరినొకరు పొలాల దగ్గర పేచీలు పడటం, తుదకు గ్రామాధికారి వద్దకి వెళ్ళటం జరుగుతుంది. అప్పుడు గ్రామాధిక రచ్చబండ దగ్గర తీర్పు చెప్పటానికి మొదట ఇద్దరి తగాదాదారుల మాటలు శ్రద్ధగా వింటాడు. బాగా విచారణ చేస్తాడు. అప్పుడు తప్పెవరిది వుందో వారికి శిక్ష వేస్తాడు. ఇక- పెద్ద పెద్ద గొడవలు, కొట్లాటలు అయితే (కోర్టులో) న్యాయస్థానంలో తీర్పుకోసం వెడతారు.

అంటే... ఏ రెండు వర్గాలవారైనా భిన్నాభిప్రాయాలతో తప్పుపని చేస్తే దానిని గురించి ఆలోచించటమే విచారణ !! ఆ తర్వాత విచారణ చేయగల్గే పెద్దమనిషి తీర్పునివ్వగల్గి వుండాలి. అప్పుడే విచారణకి అర్థుడు.

మనం సాధారణంగా 'విచారణ' అనే పదాన్ని బాధ కల్గినప్పుడో : . . . బెంగ లేదా ఏదైనా పోగొట్టుకున్నప్పుడో ... 'విచారించి అని అంటూ వుంటాం. పరీక్ష తప్పినా, డబ్బు పోగొట్టుకున్నా,

మనుషులెవరైనా పోయినా, వస్తువులు పాడైనా... మొత్తానికి ఏదైనా నష్టం కల్గినప్పుడు 'విచారించటం' అనే మాట ఉపయోగిస్తాం. 'విచారించకు'... ఆ ఉద్యోగం పోతేపోయింది. మరొక వుద్యోగం దొరుకుతుందిలే! అని ఓదారుస్తాం.

ఇక్కడ 'విచారించటం' అంటే తనకి తనే జరిగిన నష్టాన్ని గురించి ఆలోచించటం అన్నమాట. ఎవరి దగ్గరికో వెళ్ళి విచారణ జరుపుకోనక్కర్లేని పరిస్థితి.

కొంతమంది అనవసరంగా విచారిస్తూ వుంటారు. 'అయ్యో! నేను అలా చేస్తే బాగుండేది?' 'ఇలాంటి ఇల్లు కట్టుకుంటే బాగుండేది'. 'ఇంకా బ్యాంకులో (ఫిక్స్‌డ్) దాచి పెట్టాల్సింది'. 'కట్నం ఇంకా అడిగి వుండాల్సింది'. ఇలాగ పనికిమాలిన విచారాలు మనసులో పెట్టుకుని బాధపడ్తూ ఉంటారు. నిజానికి - వీటిని విచారాలు అనకూడదు. 'దురాశలు' అనాలి. మరొక సంగతి... విచారణ అనేది జరిగిన దానికే కాదు, జరగబోయే పనులని గురించి ఆలోచించటం కూడా. 'విచారణ'గానే అంటాం. 'భవిష్యత్తులో చేయబోయే కర్తవ్యాలని గురించి విచారించు' అంటారు. అంటే... బాధ పడమని కాదు. ఏం చేయాలన్న నిర్ణయం చేయమని చెప్పటం. ఇలాగ 'విచారణ - విచారించు' అనే పదాలకి అర్థం మంచీ చెడులని బేరీజు వేసి విలువ కట్టడమని తెలుసుకోవాలి. ఇంతటి నిగూఢమైన అర్థం వున్న పదాలని మనం విలువలేకుండా అనవసరమైన వాటికి వినియోగిస్తాం.

నిజంగా విచారించవలసిన విషయం... మనని గురించి మనం తెలుసుకోవటం! 'నేను సక్రమంగా నడుస్తున్నానా? నా ప్రవర్తన బాగుందా? నావల్ల పదిమందికి మేలు జరుగుతోందా, కీడు జరుగుతోందా? ఎవరినయినా బాధిస్తున్నానా?'... ఇలాంటి 'ఆత్మవిచారం' చేసుకోగల్గితే ధన్యులమవుతాం!!





# అచ్చుతప్పులు !

భావాన్ని భాషలో చెప్పగల్గే స్థాయికి, మనిషి ఎదిగి చాలా కాలమైంది. ఆ భాషని అక్షర రూపంలోకి రూపొందించి ఎవరైనా, ఎంతకాలమైనా చదువుకోగల్గే అవకాశం వచ్చి కూడా ఎంతో కాలం గడిచింది.

అక్షరం అంటేనే 'తరగనిది', 'క్షరం లేనిది', 'కలకాలం నిలిచేది' అని అర్థం! అటువంటి అక్షరాలని భావంతో కలిపి, లిఖించి ముద్రించుకోవటం వలన ఒకరి రచనలు గానీ, పాఠ్య అంశాలు గానీ, లలిత కళల విషయం గానీ, ఆధ్యాత్మికం గానీ, పురాణేతిహాసాలు గానీ, అర్థశాస్త్రం, అమర కోశం, రాజకీయ పరిజ్ఞానం, న్యాయశాస్త్రం, వైద్యశాస్త్రం... ఇలాంటి సమస్తమైనవీ కలకాలం అందరూ చదువుకోవటానికీ, విజ్ఞానవంతులు కావటానికీ అవకాశం వుంది.

పూర్వం అచ్చు యంత్రాలు రాకముందు తాళపత్ర గ్రంథాలు (తాటాకుల పుస్తకాలు) ఉపయోగించి ఘంటం ద్వారా రాసేవారు. యంత్రాలు వచ్చాక ముద్రణలో అనేక అవకతవకలు వస్తున్నాయి. దానివలన అచ్చులో తప్పులు పరిపాటి అయిపోయేయి. పుస్తకం పూర్తిగా తయారయ్యాక అందులో గుర్తించిన తప్పులన్నీ చివర పేజీలో సరిచేసి, దాని బదులుగా 'ఇది' చదువుకొండని పాఠకుల సౌలభ్యం కోసం సూచన ఇస్తుంటారు. అందువలన చదువరులు తప్పుల్ని దిద్దుకుని చదువుకునేందుకు వీలుంటుంది.

ఇది పుస్తకాలకీ, అక్షర రూపానికీ సంబంధించిన సవరణ. కానీ, మనిషి జీవితమే ఒక పుస్తకం! ప్రతిరోజూ ప్రతి అనుభవం ఒక పేజీ. ఉదయం లేచింది మొదలు - రాత్రి పడుకోబోయే వరకు చేసే కార్యక్రమాలన్నీ ఒక్కొక్క వాక్యం, పేరా, పేజీలుగా 'కాలం' అనే యంత్రంలో ముద్రించుకు పోతూ వుంటుంది. మాటకీ, వాక్యానికీ మధ్య పెట్టే 'కామాలు( , . . ) 'ఓ మనిషీ ఆలోచించు!' అనే సూచనగా భావించుకోవాలి. ఒక పదాన్ని గానీ, పేరు యొక్క ప్రత్యేకతని గానీ సూచించేటప్పుడు రెండువైపులా పై భాగాన కామాలు పెట్టాం. (' . . . ') ఇవి 'అపాస్ట్రఫీ'లు అంటాం. అదే జీవితంలోకి అనువర్తింప చేసుకుంటే గుర్తుంచుకోదగ్గ మనిషికానీ, అనుభూతి గానీ, సంఘటన గానీ అలాంటి కామాల మధ్య ప్రత్యేకంగా భద్రపరుచుకోవాలన్నమాట. ఆశ్చర్యకరమైన సన్నివేశాలకీ గుర్తులుంటాయి కదా? అలాగే 'సెమికోలన్' అనే గుర్తుని మనం 'ఇంక ఆ విషయం మరిచిపో' అని పాత జ్ఞాపకం చెరిపేసుకోవటంలా భావించాలి. ప్రశ్నగుర్తు (?) అంటే ఆత్మవిమర్శన్నమాట. ఇక సరే... ఫుల్‌స్టాప్ ( - .-) అన్న గుర్తులు అడుగు అడుగు ఆగివేస్తూ జీవితాన్ని అర్థవంతంగా చేసుకోవాలన్న సూచన. ఎక్కడా ఫుల్‌స్టాప్‌లూ, కామాలూ, ఆశ్చర్యకరమైన చిహ్నాలు లేకుండా రాసిన కావ్యం ఎలా వుంటుందీ? గందరగోళ సాహిత్యంలా వుంటుంది. అవునా? అలాగే జీవితంలో ప్రతిక్షణం, ప్రతి అడుగు, ప్రతిరోజూ ఎంతో కొంత విలువ కల్గివుండాలి.

అయితే... అచ్చులో తప్పుల్ని చివర పేజీలో సరిదిద్దుకోవడం పుస్తకాలలోని వ్రాతలప్పుడే సాధ్యం! కానీ, కాలం ముద్రించే జీవిత సన్నివేశాల్లో అది దుస్సాధ్యం. జరిగి పోయినది వెనక్కి తిప్పి సరి చేసుకోలేం. జీవితపు సంధ్యా సమయంలో (చివరి పేజీలో) గడిచిన జీవితానుభవాల్ని 'అయ్యో! అది అలా చేయవలసిందీ, ఇలా జరగవలసిందీ' అని దిద్దుకోగలమా? (తప్పు ఒప్పుల పట్టిక ఇవ్వగలమా?)

అందుకే జీవిత గ్రంథంలో 'అచ్చుతప్పులు' రాకుండా జాగ్రత్త పడాలి. యువతరమా? మీకు హెచ్చరిక అత్యంత అవసరం !!






# సన్మానం - సత్కారం!

ఒక మనిషి మిగతా వారికన్నా పై స్థాయిలో ప్రతిభ కల్గివుంటే అది మిగిలిన వారికి తెలియచేసే విధానమే 'సన్మానం!' ఫలానా వ్యక్తి, ఫలానా రంగంలో మనకన్నా మిన్నగా లేదా మనకి తెలియని ప్రజ్ఞ అతనిలో వుందనీ, కొందరు పూనుకుని గౌరవిస్తే అది సన్మానం! ఆ చేసే విధానం సత్కారం!!

సాధారణంగా కళారంగంలోని వారికీ, సంగీత విద్వాంసులకీ, రచయితలకీ, కవులకీ, సినీ నటులకీ, పండితులకీ సన్మానించటం... తగిన విలువైన వస్తువులతో సత్కరించటం జరుగుతూ వుంటుంది.

పూర్వం రాజ దర్బారులలో ఆస్థాన కవులకీ, నాట్యకత్తెలకీ, విశేష ప్రజ్ఞలు కల మేధావులకీ రాజులు స్వయంగా సన్మానం చేసి సత్కరించేవారు. అలా రాజుల చేత సత్కారం పొంది వారు ఎంతో కీర్తివంతులుగా, ప్రజల్లో ఎంతో గొప్పగా చూడబడేవారు.

రాజరికాలు అంతరించి, ప్రజాస్వామ్య పరిపాలన వచ్చి యాభైనాలుగు వసంతాలు గడిచిపోయాయి. ఇప్పుడు కూడా సన్మానం, సత్కారం జరుగుతున్నాయి. ఈ సన్మానాలకి పరిమితం లేదు. ఫలానా రంగం అని ప్రత్యేక నియమం లేదు. మొన్న 'అతనికి' సన్మానం చేసేరు. అంటే దేనికోసం? అని అడగక్కర్లేదు. నాట్యం నేర్చుకున్న నర్తకికి, ఆరంగేట్రం దగ్గరనుంచి ప్రతి ప్రదర్శనకి సన్మానం చేసినా 'ఓహో' అనుకోవాల్సిందే! ఉద్యోగస్థుడు ప్రమోషన్ వచ్చి బదిలీ అయి వెళుతూ వుంటే సన్మానం...

రిటైర్ అయి వెళుతుంటే సన్మానం! పాటలు వంద పాడితే సన్మానం... పది నాటకాల్లో నటిస్తే సన్మానం! వేదిక మీద ప్రదర్శించినందుకు సన్మానం... జోకులు బాగా చెప్పగల్గే వాడికి సన్మానం! నాల్గు కవితలు రాసినవాడికీ, పది నవలలు రాసినందుకూ సన్మాన సత్కారాలు చేసుకుంటున్నారు.

రాజకీయ నాయకులకి గెలిస్తే సత్కారం. ఓడినా సన్మానం చేస్తున్నారు! ఏనుగు బ్రతికినా విలువే, చచ్చినా విలువే అన్నట్టు! 'ఓటమి' ఒప్పుకోవటం కూడా ప్రతిభలో భాగమే అని ప్రజల నమ్మకం. సినీనటుల సన్మానాలు మరొక రకం. సినిమా బాగా నడిస్తే వాళ్ళకి సన్మాన, సత్కారాలు చేస్తారు. రచయితలకీ, కవులకీ తోచినప్పుడల్లా సన్మానాలే.

ఇటీవల పుంఖానుపుంఖాలుగా, సన్మానసభలు నిర్వహించడానికి కొన్ని సంఘాలు సంస్థలు ఏర్పడ్డాయి. కేవలం వాళ్ళు సత్కార, సన్మానాలు చేయడమే ధ్యేయం గనుక ఎవరికి చెయ్యాలా? అని వెతుకుతూ వుంటారు.

ఇలాంటి సన్మానాలకి ప్రతిభలు, ప్రతిష్టలు వుండాలన్న నియమం ఏమీ లేదు.

నిజంగా సైన్‌టిస్టులు, జీనియస్ అయిన డాక్టర్స్, పనిమంతులైన ఇంజనీర్లు, విద్యని ధారపోసే గురువు వీరెవ్వరికీ నిజమైన సత్కారాలు జరగటమే లేదు.

అసలు సన్మానం చేసేవాడినీ, ఆ సన్మానం పొందగల అదృష్టవంతుడినీ మెచ్చుకోవాల్సిందే! కానీ... ఈనాటి సమాజంలో 'ప్రతభ'తో పని లేదు.

ప్రతిభావంతులు సన్మానాల కోసం సత్కారాల కోసం, తలవంచి పూల దండలు మెడలో వేసుకోరు. అసలైన సన్మానం, సత్కారం... ఆ నమ్రత, ఆ మంచితనమే! అసలు సన్మాన సత్కారాలు పొందటమంటే - బాధ్యత పెరిగి ఆ స్థాయిని, గౌరవాన్ని కలకాలం నిలుపుకోగల్గాలి. అటువంటివారే అర్హులు. !!





# వృత్తి ధర్మం!

జీవనోపాధి ఏదైనా మనిషి బ్రతకటానికి ముఖ్యం. ప్రతివారు ఒకేపని చేయలేరు. నాగరికత నేర్చుకోని ఆదిమవాసులు ఎప్పటికప్పుడు దొరికిన కాయా, పండు, మాంసాదులను తిని తాత్కాలికంగా ఆకలి చల్లార్చుకునేవారు.

కానీ, నాగరికత సంతరించుకున్న మానవుడు ఈ తాత్కాలిక ఆరాటం మాని జీవిత పోరాటానికి శాశ్వత పద్ధతి ఏర్పాటు చేసుకున్నాడు. దానికే 'వృత్తి' అనీ, 'ఉద్యోగం' అనీ మనం పేర్లు పెట్టుకున్నాం. ప్రతి వృత్తికి కొన్ని విధులు, నియమాలు వుంటాయి గదా? వృత్తిని బట్టే దాని నియమ నిష్టలు వుంటాయి. అదే వృత్తిధర్మం.

మనసుకి ఇష్టం వున్నా, లేకున్నా చేస్తున్న వృత్తిని బట్టి ప్రతివాడూ కొన్ని ధర్మాలకి కట్టుబ వుండాల్సి వుంటుంది. ఒక్కొక్కసారి ఈ వృత్తిధర్మం మానసికంగా బాధించనూ వచ్చును.

నీతి, నిజాయితీని నమ్ముకున్నవాడు వ్యాపారం చేయలేడు! జాలి, కరుణ గలవాడు రక్షక వృత్తి (పోలీసు డిపార్టుమెంటులో) నిలువలేడు. ఆపద్ధర్మంగానైనా అబద్ధం చెప్పలేనివాడు న్యాయ వాదిగా వాదించలేడు. తనకి వచ్చిన విద్య దాచుకోకుండా చెప్పగలవాడే ఉపాధ్యాయుడిగా రాణించ గలడు.

అలాగే... ప్రతి వృత్తికి వేష భూషణ, భాషాదులలో తేడా వుంటుంది. కోర్టుకు వెళ్ళేవాడు పంచ కట్టుకుని లాల్చీ వేసుకుని వెళ్ళి వాదిస్తానంటే ఒప్పుకోరు. పోలీసువాడు నీటుగా 'టక్' చేసుకుని బుష్‌కోట్లు,

రంగురంగుల చొక్కాలో వేసుకుంటానంటే వీలుకాదు. ఇలా ప్రతి ఒక్క ఉద్యోగం లేదా వృత్తికి కొన్ని నియమాలు, పద్ధతులు వుంటాయి. ఆ వృత్తి చేస్తున్నంతసేపు ఆ వ్యక్తి దానికి సంబంధించిన వృత్తిధర్మం పాటించవలసిందే.

ఒక్కొక్కప్పుడు ఆ ధర్మం లేదా నియమం ఇతరులకి విరుద్ధంగానూ, అధర్మంగానూ కనిపించవచ్చును. అయినా ఆ దోషం ఆ వృత్తిలో వున్నవాడికి తగలదు!

ధర్మవ్యాధుడనే బోయవాడు మాంసపు అంగడిలో కూర్చుని అమ్ముతూ మునీశ్వరుణ్ణి ఆగమనీ, తన వృత్తి పూర్తిచేసుకుని తల్లితండ్రులని సేవించుకుని ఆ తర్వాత 'ఫలానావారు పంపగా వచ్చారా?' అని కుశలప్రశ్నలు వేస్తాడు. ఆ పై పతివ్రతగా పేరువడసిన ఒకానొక మహాసాధ్వి దగ్గరికి వెళ్తే ఆమె తన పతి సేవానంతరం మునీశ్వరుణ్ణి ఆహ్వానిస్తుంది. పైగా - ధర్మవ్యాధుడు పంపితే వచ్చారా స్వామీ?' అని కూడా అడుగుతుంది. ఆ మునీశ్వరుడు ఆశ్చర్యచకితుడై వారివద్ద కొన్ని ధర్మాలు తెలుసుకుంటాడనీ, అందులో వృత్తిధర్మం కూడా ఒకటని మనకి ఇతిహాసాలలో ద్యోతకమవుతుంది.

అందుచేత 'వృత్తి' అనేది చిన్న, పెద్ద, చీదరించుకోవటం, పొగడటం లాంటివి అతీతంగా వుండి అందులో ఆ వృత్తిపట్ల గల దీక్ష, నియమం, శ్రద్ధే ముఖ్యంగా చూడాలి.

ప్రొద్దున్నే ఇనుప సామాన్లవాడు వస్తే 'శుక్రవారం పూట ఇదేం గోల?' అని మనం అనుకోవచ్చును. కానీ, వాడు వాడి జీవనోపాధి కొరకే బయల్దేరుతాడు గదా? చెప్పుల దుకాణం దగ్గరనుంచి, బంగారు నగల కొట్టు వరకు అన్నీ వృత్తులే.

కనుక ప్రతివారినీ వృత్తిరీత్యా కాక మనసు, గుణం తెలిసి గౌరవించటం మనిషిగా మన

కాటికాపరి అయినా, కలెక్టర్ అయినా వృత్తి వృత్తే! ఒకడి ధర్మం మరొకడికి నచ్చకపోవటం

మ్చును. కానీ, వాళ్ళ వృత్తిరీత్యా ఆ ధర్మం వాళ్ళకి రక్షే !!






# సూచనలు !

ఎదురుగా జరుగుతున్నది, జరిగినది మనకి తెలుస్తూనే వుంటుంది. కానీ, జరగబోయేది తెలియదు. మంచో, చెడో తెలుసుకోలేం. అయితే... ఇలా జరగబోయే విషయాల గురించి కొద్దిగానైనా తెలియచేయటాన్ని 'సూచన' అని మనం వ్యవహరిస్తాం.

ఈ సూచనలు మానవులకి సంబంధించి కావచ్చును. వాతావరణానికి సంబంధించి కావచ్చును. మంచివి కావచ్చును. చెడువి కావచ్చును. మొత్తానికి జరుగనున్నది మనకి కొద్దిగా తెలియజేయటం జరుగుతుంది. దీనినే 'సూచనప్రాయంగా' అని అంటూ వుంటాం. వాతావరణ సూచనకి కొన్ని యంత్రాలుంటాయి. వర్షం రాబోయే విషయం సూచించే యంత్రాన్ని (వాతావరణ సూచికని) 'భారమితి' అని అంటాం. అలాగే... భూకంపాలనీ, తుఫాన్ హెచ్చరికలకి కూడా సూచిక యంత్రాలు వుంటాయి.

ఓడల మీద ప్రయాణించేటప్పుడు 'దిక్సూచి' అనే యంత్రం ద్వారా దారిని గురించి ప్రమాదాలు తెలిపి సూచనలు ఇస్తూ వుంటుంది. ఈ విధంగా వాహనాలకి కూడా కొన్ని సూచికా యంత్రాలు వుంటాయి. ఇవన్నీ కూడా ముందు జరుగబోయే విషయాన్ని సూచిస్తూ సారధిని (డ్రైవర్ని) హెచ్చరిస్తూ వుంటాయి.

ఇక - మనుషుల్లో ఈ సూచనలు ఎన్నో రకాలుగా వుంటాయి. శారీరకమైనవి, మానసికమైనవి కూడా వుంటాయి. ఏదైనా ఒక రుగ్మత కలుగబోయే ముందు ఒళ్ళు వేడిగా వుండటం, కళ్ళు మంటలు, తలనొప్పి, కాళ్ళు లాగటం లాంటివన్నీ మనకి కల్గుతూ వుంటాయి. 'జ్వరం వస్తుంది లేదా వచ్చేలా

వుంది' అనుకుంటాం. ఈ అనుభూతిని కల్గించటమే సూచన! అలాగే... ఏదైనా పని చేయాలనుకున్నప్పుడు అందుకు సంబంధించి మనకి ఒక్కొక్కసారి భయం, ఆనందం, విచారం కల్గుతూ వుంటాయి. ఇవి మానసిక సూచనలు. కొన్నిసార్లు కలల రూపంలో కూడా మనకి మంచో, చెడో సూచనలు అందుతూ వుంటాయి. జ్యోతిష శాస్త్రంలోనూ, శకునాలలోనూ మనవాళ్ళు ఈ సూచనల్ని గమనిస్తూ వుంటారు. కొన్నిసార్లు మనకి కన్ను అదరటం, పెదవులు అదరటం లాంటివి జరిగితే దానికి ఫలితం ఏదో జరుగబోతున్నట్టుగా మనం ఊహిస్తాం. అంటే... అది కూడా సూచనే! ఇక... మనం కనుసైగలతో, అవయవాలతో ఎదుటివారికి సూచనలు ఇస్తూ వుంటాం. ఎదుటివారికి తెలియకుండా చేయవలసిన పనిని గురించి మనం సూచనలన్నీ సైగల ద్వారా మూకాభినయం ద్వారా వెల్లడిస్తామన్నమాట.

ఈ విధంగా యంత్రాలు, మానవ శరీరాలు, మనస్సు కూడా రాబోయే ఫలితాన్ని ముందుగా తెలియజేయడాన్నే 'సూచనలు' అని చెప్పుకోవాలి.

చేయిచూసి, చక్రంవేసి, మన జీవితంలో ముందు ముందు జరుగబోయే విషయాలు చెప్తారు. శుభాశుభాలేవైనప్పటికీ సూచనద్వారా తెలుసుకుంటూనే వుంటాం.

'విషయ సూచిక' అని పుస్తకాల్లో మొదట వ్రాయటం మనకి తెలుసు. లోపల వుండే విషయాలని కొద్దిగా తెలియపరచటమే ఈ విషయసూచిక అర్థం.

ఇవన్నీ అలా వుంచి మానవుడు తన జీవనగతికి సంబంధించి కొన్ని సూచనలు గ్రహిస్తూ వుంటాడు. అదే ఆత్మసాక్షి!! 'ఒరే అలా చేయకూడదు. తప్పు సుమా! నువ్వు చేసిందేమిటి?' అని మనసులో నుండి అంతర్‌సాక్షి వినిపించటమే నిజమైన సూచిక !!





# సత్యసంధులు !

మనుగడ సాగించటానికి ఉదయం లేచింది మొదలు, రాత్రి నిద్రించేవరకు ఎన్నో రకాల కుయుక్తులూ, తాపత్రయాలు పడుతూ వుంటారు మనుషులు. అలా చెయ్యకపోతే బ్రతకటం కష్టమనీ అంటారు. అసత్యాలని అతి మామూలుగా వాడేస్తూ వుంటారు. ఒక్కొక్కప్పుడు వాళ్ళు చెప్పే నిజాలని కూడా అబద్ధాలుగా నమ్మాల్సి వస్తుంది.

కానీ, పొరపాటున కూడ అబద్ధం చెప్పకుండా యదార్థమే చెప్పేవారుంటారు. వాళ్ళే 'సత్య సంధులు' అని పిలవబడ్తారు. తమకి లాభం కల్గుతుందని గానీ, సంపద చేకూర్తుందని గానీ వారు ఆశపడరు. సాధారణంగా ఇలా నిజం చెప్పేవాళ్ళు కష్టపడ్తారని, అందుకు మన పురాణేతిహాసాల్లో సాక్ష్యముందానీ భావించేవారూ వున్నారు.

కానీ, కష్టం అనేది సుఖం కోరే వాడికి తెలుస్తుంది. అసలు కష్టం,సుఖం అనే భేదం లేనివాళ్ళకి బాధేలేదు. అయినా... 'సత్యసంధులు' ఎప్పుడూ కష్టపడరు. వారి సత్యవాక్కే వారికి రక్ష.

'సత్యం' అనే ధర్మంతో వారు 'సంధి' చేస్తుంటారు గనుక వారికి 'ధర్మం' ఎప్పుడూ తోడై నిలుస్తుందని పెద్దలవాక్కు.

మునులు, ఋషులు కోపించి శాపం ఇచ్చేవారని మనకి తెలుసు. ఆ శాపానికి తిరుగు లేదని తెలుసు. తపస్సంపన్నుల వెనుక శిరోభాగాన వెలుగు పుంజాలని మనం చిత్రపటాల్లో చూస్తుంటాం. అంటే... అతనిలోని జ్ఞానేంద్రియాలన్నీ ఒకే వరుసలో వుండి శక్తిమంత మవుతున్నా యని అర్థం. ఐక్యత చెందటంలో ఇంతటి శక్తి వుంది.

ఎందువల్ల? మునులవాక్కు సత్యమైనది. వారు అసత్యం చెప్పరు గనుక వాక్కు ద్వారా వెలువడిన పనులు జరిగి తీరుతాయి. దీనినే 'వాక్‌శుద్ధి' అంటారు.

సూర్యుని వెలుగులో నుంచుని లేదా సూర్యకిరణాలు పడేచోట ఒక కాగితం పెట్టి, పైన భూతద్దంతో చూసినప్పుడు కొంచం సేపటికి కాగితం కాలిపోతుంది. ఎందుకనీ? సూర్యకిరణాలు ఒకేచోట కేంద్రీకరించి వేడిమి పుడ్తుంది గనుక! ఇది మనకి విజ్ఞాన శాస్త్రం నేర్పిన తెలివి. అలాగే... మనిషి తన ఇంద్రియ శక్తులన్నింటిని ఏకాగ్రత చేసినప్పుడు 'తేజస్సు' లేక 'ప్రకాశం' వెలువడుతంది. అలాంటి ఏకాగ్రతలోని ఒక కిరణమే 'సత్యం' అనేది.

సామాన్యులు ప్రాపంచిక వ్యామోహాలలో తలమునకలై నిముషానికో అబద్ధం లేదా అబద్ధాలతోనే బ్రతుకుతూ వుంటారు. దీనివల్ల లభించే సుఖసౌఖ్యాలు కేవలం తాత్కాలికం. అందుకే ఏదైనా ఆపద కానీ, చిక్కు పరిస్థితి గానీ వచ్చినప్పుడు భగవంతుడికి మొక్కుకోవటం, పెద్దలని ఆశ్రయించటం జరుగుతుంది. అంటే... తమ గండం తాము దాటలేరు. కానీ, సత్యవాక్కు పరిపాలించేవారు మనస్సులో ఈ అపాయం నాకు రాకూడదని నమ్మితే అది దాటిపోతుంది. వారి ప్రతిభ స్వయం ప్రకాశమైనది.

అందుకే - పండితులు, నిష్టాపరులు, జ్యోతిష శాస్త్రవేత్తలు దీవిస్తే... వాళ్ళు సత్యసంధులే అయితే ఆ దీవెన ఫలిస్తుంది. రోజంతా అనేక వ్యాపకాలతో, అసత్యవాదాలతో బ్రతికేవారు... కల్మషాలతో నిండిన వాతావరణం లాంటివారు! పొరపాటున కూడా అసత్యమాడని సత్యవాదులు... పచ్చని పైరుగాలి లాంటి వారు! మనకి తెలియకుండా మనం చేసే ప్రతిపని యొక్క ఫలితం మనకి చుట్టుకుంటుంది. అంటే (రియాక్షన్) ఇస్తుంది. పుష్టికరమైన ఆహారం తీసుకుంటే ఆరోగ్యం గుంటుంది. అదే కల్మషమైన తిండి తింటే కడుపులో తిప్పి బయటికి వచ్చేస్తుంది. అందుకే... త్యసంధులు వారి సత్యపాలనతో శక్తి సంపాదించుకుంటారు. అసత్యవాదులు వున్న విలువ ీగొట్టుకుంటారు.






# తూకమంటే ?

మనం బ్రతుకుబాటలో అనేక అవసరాలు తీర్చుకుంటూ వుంటాం. కేవలం డబ్బు సంపాదిస్తే జీవితం సాగదు కదా? ఆ డబ్బును కొన్ని అవసరాలుగా మార్చుకుని మన ఆహారం, గృహం, వస్త్రం ఇంకా వినోద, విలాస వస్తువులు సమకూర్చుకుంటాం.

అంటే... ఇక్కడ డబ్బు ముడి పదార్థమే తప్ప వస్తురూపం కాదు. కాబట్టి ఒక వస్తువు మనకి కావాలన్నప్పుడు దాని ఖరీదు కట్టి తీసుకోవాలి గదా? ఎంత వస్తువుకని ఖరీదు కట్టగలం?

అందుకే - వస్తువు అమ్మేవాళ్ళు కొంత వస్తు సముదాయాన్ని ఒక కొలతగా పెట్టుకుంటారు 'వస్తువు' అనేసరికి ఘన, ద్రవపదార్థాలు ఏవైనా వుంటాయి గనుక అన్నిటికీ పనికివచ్చే విధంగా ఒక గుర్తు, ఒక కొలమానం పెట్టుకుంటాం. దీనినే 'తూకం' అని చెప్తాం.

కొలవాలంటే లేదా దాని బరువు తెలియాలన్నా సరిగ్గా అంత ప్రమాణం గల రాయో, మరొక పదార్థమో త్రాసులో వేసి చూస్తే మనకి గుప్పెట్లో వున్న పదార్థం యొక్క బరువు ఎంతో తెలుస్తుంది.

అంటే... ఒక వస్తువు యొక్క పరిమాణం మరొక వస్తువుతో పోల్చి తెలుసుకోవటమే తూకం! రెండు వస్తువుల్ని గానీ, పదార్థాలని గానీ సమానపరచటమన్నమాట. మనిషి నిత్యజీవితంలో ఎన్నో వస్తువులు తిండికి గానీ, కట్టుకుందుకు గానీ, నివసించటానికి గానీ, అనుభవించటానికి గానీ అవసరమవుతాయి. ఇష్టం వచ్చినట్లు గుప్పెళ్ళతోటి, దోసిళ్ళతోటీ తీసుకోలేం. అలాగే... పదార్థం

ఉపయోగించేటప్పుడు ఎంత వేయాలీ అనేది ఒక కొలతో, తూకమో వుండాలి. ముఖ్యంగా... వంటకాలలో ఉప్పు, కారం మొదలైన రుచులు తూకం ప్రకారం (ఒక కొలత ప్రకారం) వుండాలి తప్ప ఇష్టం వచ్చినట్టు వేయరు.

మనిషికీ, మనిషికీ మధ్య ఇచ్చిపుచ్చుకోవటానికి ఈ తూకం అత్యంత అవసరం! డబ్బు విలువ తెలియని రోజుల్లో కూడా- అంటే... ధనం ఇచ్చి కొనుక్కోలేనప్పుడు కూడా ఒక పదార్థాన్ని దానికి సమానమైన మరొక పదార్థంతో తూకం వేసుకుని తీసుకునేవారు. ఇప్పటికీ కొందరు అలాంటివి చేస్తూనే వుంటారు.

నిజానికి- జీవితంలో ప్రతీదీ తూకంతోటే నడుస్తుంది. రెండువైపులా బండికి కట్టే ఎద్దుల సమానబరువు గల్గి వుంటేనే బండి సరిగా నడుస్తుంది. ఒక ఎద్దు బలహీనమో, లేక పొట్టిగానో వుంటే బండి ఒరిగిపోయి పడిపోతుంది. ఇద్దరి స్నేహితుల మధ్య సమానమైన ఆత్మీయత, నిష్కల్మషం వుంటేనే ఆ స్నేహం చాలాకాలం పటిష్టంగా వుంటుంది. అలాగే... సమాన వియ్యం, సమాన కయ్యం అని పెద్దలు చెప్తూవుంటారు. రెండువైపులా సమానత వున్నప్పుడు అది బలంగా నిలబడుతుంది.

కేవలం త్రాసులో పదార్థాలని తూకంరాళ్ళతో కొలిచి, దానికి ఖరీదుకట్టి తీసుకోవటం మనం దానినే తూకంగా భావిస్తాం. కానీ ఇక్కడ 'తూకం' అనగానే బలాబలాలు, సామర్థ్యాలు, సిరి సంపదలు, గుణసంపత్తి... ఇలాంటివన్నీ జీవితంలో మనకి అనుభవంలోకి వచ్చే తూకాలుగా గ్రహించాలి.

తప్పుడు తూకం వేసి మోసం చేసే వ్యాపారస్థులు ఎంతటి శిక్షార్హులో.., జీవితంలో కూడా తమ స్థాయి, అంతస్తు తెలుసుకోకుండా ఇతరులతో డాంబికాలు పలికి, వారితో సమానమవుదామని తాపత్రయపడేవాళ్ళూ అంతటి శిక్షార్హులే!

పండితులు, మహాత్ములైనవారిని, పామరుడు, పాపాత్ముడు తనతో సమానంగానో, లేక తను వారంతటి వాడిననో బేరీజు వేసుకోవడం మహానేరం !!






# సభ్యత !

జీవ రాసులన్నిటిలో ఉత్కృష్టమైనది మానవజన్మ. నోరులేని మూగజీవులు, క్రూర జంతువుల కంటే ఉన్నతుడిగా, విలువైనదిగా గుర్తించబడుతున్నదీ మనిషి జీవితం!

జీవికలన్నిటా చైతన్యం వున్నా పరిపూర్ణత సంతరించుకున్న స్థాయికి చేరుకున్నదే మానవ జీవితం. ఇంతటి ఉన్నత స్థితికి చేరిన మనిషి జీవన ప్రమాణం ఎంతో పటిష్టంగా, క్రమబద్ధంగా వున్నప్పుడే ఆ జన్మ సఫలమవుతుంది. అప్పుడు అతని (లేదా ఆమె) చుట్టూరా వున్న బంధు మిత్రులు సమాజం కూడా సుఖశాంతులతో వర్ధిల్లగల్గుతారు.

ఈ ‘క్రమబద్ధం’ అన్న పదంలోనే జీవన ప్రమాణికాలు నిర్దేశింపబడ్డాయి. సమాజ వ్యవస్థని సన్మార్గంలో నడిపించేవి అవే.

ఏ మనిషీ ఒంటరిగా జీవితం సాగించలేడన్న సత్యం అందరికీ తెలుసు. నల్గురితో కల్సి బ్రతికే మనిషి అవతలి వాళ్ళతో ప్రవర్తించే విధానంలో నిబిడీకృతమై వున్నదే ఈ ‘సభ్యత’!

దేశాన్ని పరిపాలించే నేతలు, సంస్థల్ని నడిపించే అధిపతులు, ఆఫీసును చూసుకునే బాస్, బ్యాంక్‌లో మేనేజర్, నగర పరిరక్షణ చేసే ‘మేయర్’... వీరంతా కొన్ని రూల్స్‌కి కట్టుబడి వున్నట్టే మనిషి ‘సభ్యత’ అనే ఒక మంచి నియమానికి కట్టుబడి నడవాలి.

ఇల్లు వెతుక్కుంటున్న పెద్దమనిషి ‘ఏమండీ ఇళ్ళేమైనా ఖాళీగా వున్నాయా?’ అని అడిగేడనుకోండి. ‘ఏమో... మాకు తెలియదు. వాళ్లనే అడగండి!’ అంటూ దభేల్న తలుపు మూసుకున్నారంటే ఏమనుకుంటాడు? ‘బొత్తిగా సభ్యత లేని మనుష్యుల్లా వున్నారే...’ అని కదూ?

రద్దీగా వున్న బజార్లలో కాపురం వుంటున్న గృహస్థులు గబగబా చెత్తబుట్టలు పట్టుకొచ్చి వీధిలో దిమ్మరించేస్తూ వుంటారు. పక్కన బస్సుకోసమో, ఆటో కోసమో, మరి ఎవరి కోసమో ఎదురు చూస్తున్న మనుషులు గబుక్కున ముక్కుకి కర్చీఫ్ అడ్డుపెట్టుకోవాల్సి వస్తుంది. ఈ అనుభవాలు చాలామందికి జరుగుతుంటాయి. తమ ఇంట్లో ఆ చెత్త వుంచుకోలేకనే బయట పారబోస్తున్నప్పుడు ఆ బయటి మనుషులకి అసహ్యం కల్గించకుండా జాగ్రత్తగా వొంచాలనుకోడమే సభ్యత.

కొందరు ఏదో మాట్లాడుకుంటూ మనం అక్కడికి వెళ్ళగానే రక్కున ఆ సంభాషణ మానేస్తారు. దీని అర్థం ఏమిటి? అలాగే అంతవరకు ఏ కిటికీ తలుపు దగ్గరో నుంచుని బయటికి చూస్తున్నవాళ్ళు ఎదురింటి వాళ్ళని చూసి ఆ తలుపు మూసేస్తారు? పదేపదే ఒకరివైపు చూసి గుస గుసలు చెప్పుకోవటం, నవ్వుకోవటం సభ్యతనిపించుకోదు.

విందు భోజనాల దగ్గర, సహపంక్తిలో ముందుగా లేచి వెళ్ళిపోతుంటారు కొందరు. అలా సభ్యత కాదంటే 'బాగుంది... ఎంతసేపు అలా చెయ్యి పెట్టుకుని కూర్చుంటాం?' అనేవారూ వున్నారు. కానీ... మనిషి మనుగడకి కొన్ని విధానాలున్నాయి అని తెల్సుకోవాలి. అందుకే కొన్ని గురు కులాల్లోనూ, కాన్వెంట్ స్కూళ్ళలో చిన్నప్పుడే పిల్లలకి జీవన సరళిలోని ప్రధాన అంశాల్ని విడమరచి చెప్తుంటారు. ఎంతసేపూ పుస్తకాలు కొనడం, డ్రస్సులు కుట్టించటం, నీటుగా వుంచటం కాదు... పిల్లలకి సభ్యతని గురించి మనం చెప్తుండాలి.

పక్కింటి ఆంటీ రాగానే 'అమ్మా... నాకు అన్నం పెట్టవే' అనో, వచ్చినావిడ మీద ఏదో జోకులు వేసి వెక్కిరించటమో, ఆవిడ కూర్చున్న కుర్చీ తోసెయ్యటమో... ఇలాంటి వెర్రి పనులు చాలామంది చేస్తుంటారు. మళ్ళీ వాళ్ళింటికి వెళ్ళబుద్ధి పుట్టదు.

చిన్నపిల్లల సంగతి వదిలి పెద్దల్లో కూడా చిన్నవాళ్ళ కన్నా హీనంగా ప్రవర్తించే వాళ్ళుంటారు. పిక్‌నిక్‌లలో, ఎక్స్‌కర్షన్‌లలో, డిన్నర్లలో పక్కవాళ్ళకి రోత కల్గించేలా లొట్టలు వేసుకుంటూ తినటం, దగ్గడం, తుమ్మటం, అవి పక్కవాళ్ళ మీద చిందినా చూడనట్టు ఊరుకోవటం... ఇవన్నీ అసభ్యతా లక్షణాలు కదూ?

పేరంటాలలో, వేడుకలలో కొందరు అనేక అవకతవకలు చేసి అసభ్యంగా ప్రవర్తిస్తుంటారు. 'వేదిక అలంకరించిన పెద్దలకీ, సభాసదులకీ, నమస్కారం!' అంటూ ప్రారంభించేదే సభా సభ్యత. ఇష్టం వున్నా, లేకున్నా ముందు వరుసలోకూర్చున్నవారు సభా మధ్యలో లేచి వెళ్లకపోవటం సభ్యత.

అతి చిన్న చర్యనుంచి పెద్దపనుల వరకు ఈ 'సభ్యత' మనిషికి చాలా అవసరం. పశు పక్ష్యాదుల కన్నా పైస్థాయిలో వున్నా మనం ఇష్టం వచ్చినట్టు కాకుండా సమాజంలో వున్నామని గుర్తుంచుకుని సభ్యతగా ప్రవర్తిద్దాం !!

82

# మొహమాటం . . . !

ప్రతివాళ్ళ అనుభవంలో ఎదురయ్యే కొన్ని సంఘటనలు సర్వ సామాన్యమైనవిగా వుంటాయి.

ఇష్టం వున్నా, లేకున్నా కొన్ని పనులు మనం తప్పనిసరిగా చేయాల్సి వుంటుంది. మనసులో విసుక్కుంటాం. అయినా చేస్తాం. పోనీ, 'ఇష్టం లేనప్పుడు మానేయవచ్చును కదా!' అని మనల్ని అడుగుతారు మనకి సంబంధించినవాళ్ళు! కానీ 'ఏం చేయనూ? తప్పదులెండి' అంటాం.

ఇలా తప్పనిసరిగా చేసే పనులు మనకోసం కాక, ఇతరుల నిమిత్తం చేయాల్సి వచ్చే ఆ పరిస్థితినే 'మొహమాటం' అని చెప్తాం.

జీవితం అన్నాక ప్రతిరోజు ఎంతమందితోటో ఎన్నో విషయాలకి సంబంధించి బాంధవ్యాలు పెంచుకోవాల్సి వస్తుంది. అదే పరస్పర సహకారం అవుతుంది. మనకి సాధ్యపడని పనులు కొన్ని స్నేహితుల వలన, బంధువుల వలన, వారి సహాయంతో చేసుకోవలసి వస్తుంది. ఆ తర్వాత తిరిగి వాళ్ళకి అవసరమైతే మనం సహాయం చేయాలి గదా? ఉపకారం పొందేక మళ్ళీ ప్రత్యుపకారం చేయాలన్నది మానవ ధర్మం. కనుక తిరిగి మనం వాళ్ళకి ఉపకారం లేదా సహాయం చేయాల్సినప్పుడు మనకి ఇష్టం వున్నా, లేకున్నా బదులు తీర్చుకుంటూ ' మొహమాటం వలన చేయాల్సి వస్తోంది.'

ప్రత్యుపకారంలోను, బదులు తీర్చుకోవడంలోనూ కొంత వ్యత్యాసముంది. మొదటి క్రియలో ఇష్టపూర్వకంగా చేయగల్గుతారు. కానీ, ఈ బదులు తీర్చుకోవడం - అంటే... కేవలం ఆ పని జరగాలి గనుకనే తప్ప మనస్సు ఇష్టపడి చేయకపోవచ్చును.

ఈ సందర్భాలు చాలా చిత్రంగా వుంటాయి! మనం ఎవరినైనా సహాయం అడిగితే వాళ్లు చేయడం కాకుండా ఒక్కోసారి వాళ్ళంతట వాళ్ళే మనకి ఉపకారం చేసే వాళ్ళుంటారు. వాళ్ళవల్ల మనకి అవసరం లేకపోయినా ఒక విధంగా బలవంతం చేసి మనకి వస్తువులో, డబ్బో, పని సహాయమో చేస్తారు. ఆ తర్వాత ఎప్పుడో వాళ్ళకి ఏదో అవసరమై మనకి గుర్తు చేయటమో లేదా మననుంచి ఆశించటమో జరుగుతుంది. దీనివల్ల మనకి చిరాకు, ఒళ్ళుమంట కల్గేమాట వాస్తవమే. కానీ, వాళ్లకి తిరిగి మన సహాయం అందించవలసే వుంటుంది. ఈ మొహమాటమే వ్యక్తుల మధ్య బలవంత బంధనంలా తయారవుతుంది.

మరోరకం మొహమాటం వుంది.

భోజనాల దగ్గర, సదుపాయాల దగ్గర ఎవర్నైనా 'మొహమాట పడకండి. మీకు కావల్సినవి అడిగి వేయించుకోం'డనీ, 'తీసుకోం'డనీ చెప్తుంటాం. అంతేకాదు... 'ఆయనకి చాలా మొహమాటమండీ! దగ్గర వుండి మీరు అన్నీ చూసుకోండి!' అని అతిథి అభ్యాగతుల విషయంలోను, కొత్తల్లుళ్ళనీ, బంధుమిత్రులనీ ఉద్దేశించి చెప్తూవుంటాం. ఇక్కడ మొహమాటం అనేది ఇచ్చిపుచ్చు కోవటాలకి వర్తించదు. కేవలం తన కోసం తీసుకోవటమే అవుతుంది.

ఉమ్మడి వాటాల్లో వున్నవారికీ, సంఘ సేవా కార్యక్రమాల వాళ్ళకీ, ఆఫీసు పనులు చక్క బెట్టేవారికీ, వ్యాపారస్తులకీ మొహమాటాలు తప్పవు. ఒకప్పుడు ఒకరి దగ్గర పొందిన ఉపకారానికి ప్రత్యుపకారం చేయాల్సివస్తుంది.

కానీ, నిజమైన వ్యక్తిత్వం వున్న మనిషి 'మొహమాటం' అన్న పదానికి దూరంగా వుండాలి. ఒకరి దగ్గర నుంచి తీసుకోవడంలో గానీ, ఒకరికి ఇవ్వటంలో గానీ మొహమాటం తగదు. మనస్ఫూర్తిగా ఏదైనా చెయ్యగల్గేవాడు నిర్మొహమాటస్థుడు. అతను కఠినంగా కనిపించినా నిజాయితీకి నిలబడగల్గేవాడు మనస్సు ఒప్పుకున్నదే చేస్తాడు. ఒకరిని యాచించడు. ఒకరికి తల వంచడు. వాడే సమాజానికి కావల్సినవాడు.






# చర్విత చర్వణం !

'అబ్బబ్బ! ఎన్నిసార్లు చెప్తావ్ ఆ మాట? చాలు... ఇక ఊరుకో!' అని మనం ఈ వాక్యాన్ని చాలాసార్లే వాడుతూ వుంటాం!

అంటే... పదే పదే చెప్పే విషయాలనీ లేదా చేసే పనులని 'చర్విత చర్వణం' అంటాం.

ఈ విధంగా ఒకసారి మనం విన్నదాన్ని గానీ, చూసినదాన్ని గాని తిరిగి వినాలన్నా, చూడాలన్నా విసుగు వస్తుంది. అందుకే... ఎవరైనా మనకి తెలిసున్న సంగతి చెప్పబోతే 'చాలుబాబు మళ్ళీ రికార్డ్ పెట్టకు' అంటాం. (గ్రాంఫోన్ రికార్డు) క్యాసెట్‌లో ఒకసారి ముద్రించుకున్న మాట, పాట మళ్ళీ మళ్ళీ వినాలనే మనం జాగ్రత్త చేసుకుంటాం. కానీ, విసుగు పుట్టేటట్టు పెడ్తే భరించలేం కదా?

నిత్యం మనం కొన్నివందల మాటలు, చప్పుళ్ళు, ధ్వనులు, రాగాలు, దృశ్యాలు అభినయం, మాట్లాడటం, వినటం, చూడటం జరుగుతుంది. నిజానికి ఇవన్నీ చర్విత చర్వణాలే. కానీ, అలా మళ్ళీ మళ్ళీ చర్విత చర్వణం చేయకపోతే జీవించలేం.

జన్మించినది మొదలు మరణ పర్యంతం మనిషికి గానీ, మరే ప్రాణికి గానీ ఈ చర్విత చర్వణం అనేది ఎన్నో విషయాలలో అనుభవమే.

అయితే... పనికిమాలినవి, ఉపయోగం లేనివీ పదే పదే వినటం వలన, చూడడం వలన మనిషిలోని మెదడు బలహీనమవుతుంది. అందువల్లనే మనకి విసుగు జనిస్తుంది. ఒకవేళ ఉపయోగమైనదీ, ఉత్సాహం కల్గించేదీ అయితే మనం విసుక్కోం. ఎన్నిసార్లైనా వింటాం. చూస్తాం.

యుగాలు మారినా రామాయణ, భారత, భాగవతాలు మనం వింటున్నాం. ఆ చిత్రాలు చూస్తున్నాం, ఆనందిస్తున్నాం ( విసుగు చూపే వాళ్ళు వుంటే వాళ్ళ సంఖ్య చాలా తక్కువ) అందులో వున్న గొప్పతనం నిత్యనూతనం. అందుకే 'చర్వితచర్వణం' అనుకోము.

త్యాగరాజస్వామివారి కీర్తనలు ఎన్నివేలసార్లు విన్నా మళ్ళీ వింటాం. వినాలనే కోరుతాం. అందులోని భక్తిభావం రసస్వాదన మనల్ని ఉత్తేజపరచి ఆసక్తి కల్గిస్తుంది.

నిత్యం సూర్యోదయం చూస్తున్నా ఏరోజూ పాతగా భావించలేం. అలాగే పగలు, రాత్రి, ఎండలు, వానలు, ఋతువులు, పండగలు... ఇవన్నీ కాలచక్రంలో తిరుగుతూనే వున్నాయి. అందునా మనం అనుభవిస్తూనే వున్నాం గదా? అమ్మ జోలపాట ఎన్నిసార్లు పాడినా బిడ్డకి విసుగురాదు. కనుక జీవితంలో సారం గల ఏ పనిపాటకైనా ఎన్నిసార్లు జరిగినా 'అబ్బ చర్వితచర్వణం... చాలు!' అనుకోలేం.

మరెప్పుడు ఈ పదం ఉపయోగిస్తాం? ఒకరిని గురించి నేరాలు చెప్తూ ఎన్నిసార్లైనా అవే మాటలు చెప్తూన్నప్పుడు 'చర్వితచర్వణం... చాలు' అంటాం. పరీక్షలు ఫేలై పోతూ మళ్ళీ ఆ తరగతే చదవాలంటే మళ్ళీ చర్వితచర్వణం అనుకుంటాం. ఒక కార్యక్రమానికి అంతా సిద్ధం చేసుకుని అది జరగకపోతే మళ్ళీ ఆ తంతు చేయాలనుకున్నప్పుడు 'చర్వితచర్వణం' అనే పదం ఉపయోగిస్తాం.

హరికథ ప్రారంభించేక ఊళ్ళో పెద్దమనిషి వచ్చారనీ, మళ్ళీ మొదలెట్టమన్నారట కార్యక్రమ కర్తలు. మళ్ళీ మొదలై మరొక పెద్దమనిషి వస్తే మళ్ళీ ప్రారంభం నుంచి చెప్పమన్నారట.

ఇదీ చర్విత చర్వణం. ఎన్నిసార్లు అయినా ముందుకు సాగదు. చెప్పిందే చెప్పటం జరుగుతుంది. అందుకే మనకి ఆసక్తి తగ్గిపోతుంది.

ఇతరులకి విసుగు కల్గించనివీ, మనతోపాటు పదిమందికి మేలు జరిగేవీ, చర్విత చరణమైనా అవి నిత్యనూతనాలై వర్ధిల్లుతాయి.






# ప్రపత్తి !

ప్రపత్తి... అంటే మనం ఎవర్ని నమ్ముతామో వారిపైన దృఢవిశ్వాసం, నమ్మకం పెంచుకుని వారినే మన సర్వ రక్షకులుగా భావించటం!

ఈ ప్రపత్తి పెంచుకునేటప్పుడు జాగ్రత్తగా సమర్థుడైన వారినే ఎంచుకోవాలి. తనకన్నా అల్పుడు, దీన దశయందు వున్న వాడిని శరణు లేదా వాడిమీద ప్రపత్తి పెంచుకుంటే లాభం వుండదు.

దరిద్రుడైనవాణ్ణి నమ్ముకుని ఆశ్రయిస్తే ఏమి జరుగుతుంది? అలాగే - బలహీనుడైనవాడిని ఆసరా కోరితే నిలబడలేరు. శక్తిలోనూ, స్థోమతలోనూ తనకన్నా అధికంగా వున్నవారిని రక్షణ కోరితే ఉపయోగం వుంటుంది. అలాగే - సర్వం తెల్సినవార్నే గురువుగా భావించాలి. ఆశ్రయించాలి. రాజు! బలసామర్థ్యాలుంటేనే ప్రజల్ని కాపాడగలడు. శత్రుభయం లేకుండా చేయగలడు. కానీ, అసమర్థుడైన రాజుని ప్రజలు నమ్ముకుంటే అవస్థలపాలు కాక తప్పదు.

ఎప్పుడూ మన ప్రపత్తి అనుకూల్య సంకల్పంతోనూ, ప్రాతికూల్య వర్జనంతోనూ వుండాలి. అనగా విభీషణుడు రావణాసురుడి తమ్ముడైనా ఎప్పుడైతే అన్న సీతాపహరణం చేసేడో, తాను ఎన్ని విధాల చెప్పినా వినలేదో అప్పుడు నాశనం తప్పదనుకుని తెలుసుకుని శ్రీరామచంద్రుని ప్రపత్తి చేసేడు. సర్వభూతహితాన్ని కోరడమే అనుకూల్య సంకల్పం.

సీతాదేవిని అపహరించటం తప్పు-అని, శ్రీరామునికి ఒప్పగించవలసిందని చెప్పిన విభీషణుడు సర్వహితాన్ని కోరేవాడు. కనుక అతడు శ్రీరాముణ్ణి ఆశ్రయించేడు. అన్నని వదిలేయటం ప్రాతికూల్య వర్జనము.

బలవంతుడైన విభీషణుడు అన్నను ఎదిరించగలడు. కానీ, శ్రీరామునే ప్రపత్తిగా ఎంచుకున్నప్పుడు ఆ భారం ఆయనకే వదిలి తాను మిన్నకున్నాడు. అదేవిధంగా సీతాదేవి రావణ సంహారం రామునికే వదిలింది.

ఎవరికైతే రక్షణ కావాలో వారికి సమయాలు, సందర్భాలు, స్త్రీ, పురుష భేదం లేకుండా మహా విశ్వాసంతో భగవంతుని వేడవచ్చునని తెలుస్తోంది.

నిండుసభలో ఏకవస్త్ర అయిన ద్రౌపది శ్రీకృష్ణుణ్ణి ప్రపత్తి కోరింది. విభీషణుడు యుద్ధభూమిలో వేడుకున్నాడు. గజరాజు చెరువులో వుండి శరణు వేడేడు. యజ్ఞాలకు, క్రతువులకి నియమం, ధర్మానుష్టానం వుంది గానీ, శరణు వేడుకునేవారికి ఏ ఆటంకాలూ వుండవు. వారికుండవలసిందల్లా విశ్వాసం ఒక్కటే. అలాగే కులమతాలు, వర్గభేదాలు కూడా లేవు.

శబరి శూద్రురాలు... గజేంద్రుడు జంతువు... జటాయువు పక్షి!. అయినా- వీరంతా వారికుండే ప్రపత్తుల వల్ల ముక్తి పొందేరు.

కొందరు 'కర్మాధీనం జగత్సర్వం' అన్న వాక్యాన్ని దృష్టిలో వుంచుకుని కర్మను చేయకుండా శుష్క వేదాంతాన్ని ఉపన్యసిస్తూ వుంటారు. ఇది చాలా తప్పు. కార్యదీక్షులైన వార్ని ప్రోత్సహించాలి. ఉదాసీనుల్ని ఉత్తేజపరచాలి. జయాపజయాలందు నిరాపేక్షగా వుండగల్గాలి. అట్టివాడే ధీరోవంతుడు. నకన్నా బలమైన శక్తి వుందని నమ్మినా తన కర్తవ్యం తాను చేయగల మానవుడే సర్వహితాన్ని కోరి మాజానికి శ్రేయస్సు చేకూర్చగలడు.






# అస్పృశ్యత !

ఒక్కోసారి హఠాత్తుగా అసంకల్పిత చర్యగా దూరం జరుగుతాం. అంటే... మనం నిల్చున్న ప్రదేశమో, పదార్థమో తాకరానిదై వుంటుందన్న మాట! ఇలా తాకటానికి పనికిరాని దానికే 'అస్పృశ్యత' అంటాం. శుభ్రత లేనిచోటు అనారోగ్యానికి మూలహేతువు గనుక అటువంటి ప్రదేశం నుండి దూరవంగా జరగటం ఆరోగ్యప్రదం.

అలాగే చెడిపోయిన వస్తువు, పండ్లుగానీ, పానీయాలు గానీ, తినుబండారాలు గానీ ముట్టుకున్నా, తిన్నా అనారోగ్య కారణమే గనుక స్పృజించకూడదు. ఇంతకుమించి 'అస్పృశ్య అన్నది మరెక్కడా వుండకూడదు. ఏదైనా అంటువ్యాధి సంబంధమైతే తప్ప మనుష్యుల దగ్గర అస్పృశ్య అన్న పదం మానవతకే మచ్చ.

దురదృష్టవశాత్తు పూర్వంలో ఈ అస్పృశ్యత అనేది కుల, మత, జాతులలో చూపించేవారు. ఆనాడు వృత్తి ధర్మాలు పాటించేవారు. అలాంటి పరిస్థితుల్లో వృత్తిరీత్యా దూరంగా నిలువ వలసిన అవసరాలు వుండేవి. అంతేకాకుండా అలసిపోయిన శ్రామికజాతి శ్రమ మరచిపోయే నిమిత్తం మత్త పదార్థాలైన మధు, మాంసాలు సేవించేవారు. దానివలన దుర్వాసనతో అభ్యంతకర ప్రవర్తన తప్పనిసరి ప్రదర్శించేవారు. ఆ కారణంగా వారు అస్పృశ్యులుగా చూడబడేవారు. అంటే... చేసే పనిని బట్టి ప్రవర్తన బట్టీ అస్పృశ్యత చూపబడేది. ఈ విషయంలో జాతినీ, మతాన్నీ ప్రత్యేకించి చూడవలసిం లేదు. ఎవరు దుష్ప్రవర్తనతో ప్రవర్తించినా అస్పృశ్యులే.

కానీ... సమాజంలో మధ్యకాలంలో కొందరు స్వార్థం చేత ఈ 'అస్పృశ్యత'ని భయంకరంగా సృష్టించి మనుష్యులని పావులుగా ఉపయోగించుకున్నారు. వారి జీవితాలని అణిచివేశారు. ఇది మానవతా వాదానికే తీరని కళంకం. గత కొద్దికాలంగా మనుషుల మధ్య మహమ్మారిగా మారి బాధించిన ఈ 'అస్పృశ్యత' అనే భయంకర వ్యాధి కొద్దిగా తగ్గుముఖం పట్టింది. వృత్తి విద్యలు తగ్గి ఉద్యోగావకాశాలు వచ్చిన తరువాత 'అస్పృశ్యత' అదృశ్యమైపోవాలి.

మనిషికి మనిషికి మధ్య దూరం మానవుడే సృష్టించుకుని తనకు తానుగా అధికుణ్ణి అనుకునే ఈ 'అహం' చాలా అనర్థం. జీవరాసులన్నిటి కన్నా ఎదిగిన మానవుడు మళ్ళీ దిగజారుతున్నాడు.

యదార్థంగా ఆలోచిస్తే... తప్పు చేసినవాడు అస్పృశ్యుడు. దొంగతనం, హత్యలు, పరకాంత వ్యామోహం లాంటి సంఘ విద్రోహక చర్యలు చేసినవారు అంటరానివారు.

ఆరోగ్యరీత్యా పాటించవలసిన అస్పృశ్యతని మానవ కులాలకి ఆపాదించి ఆ తరువాత దానిని స్వార్థానికి వినయోగించుకోవటం నేరం.

జగద్గురు శంకరాచార్యులవారు ఛండాలుడైన వాని ప్రశ్నలకి జ్ఞానజ్యోతిని కనుగొన్నారు. ఎవరు అంటరానివారో అట్టి మహానుభావులు ప్రజలకి బోధ చేసేరు. ఆధ్యాత్మికం వదలి వ్యవహారికం లోనైనా మహాత్మాగాంధీ ప్రబోధలో అస్పృశ్యతని నిరసించేరు.

మనం వివేకంతో సజ్జనుల భావం అర్థం చేసుకుని ప్రభావితులమవాలి !!






# వారధి

రెండు దారులు విడివిడిగా వుంటే మధ్యలో ఏదో అడ్డు వున్నట్టే కదా? ఆ అడ్డు నీళ్ళు కావచ్చు, అఘాతం (లోయ) కావచ్చు. మనకి రెండవదారిపై వెళ్ళటానికి అభ్యంతరం కల్గిస్తుందన్న మాట. అప్పుడు ఆ రెండు మార్గాలని కల్పుకునే ప్రయత్నం చేస్తాం కదా? ఏదైనా ఏర్పాటు చేసుకుంటాం. అదే వారధి. లేదా వంతెన.

ఒక నదీ ప్రవాహం ప్రక్కగా, రెండు వైపులా రెండు రోడ్లు వుంటే ఇవతలి మనుష్యులు అవతలివైపుకు సునాయాసంగా వెళ్ళగల్గే మార్గం వంతెన. ఒక్కోసారి జనసమర్థం ఎక్కువైనప్పుడు మామూలు రోడ్డుమీద కూడా ఎత్తుగా వంతెన కడ్తారు(ఓవర్ బ్రిడ్జి) ఏదైనా సరే... మార్గాలని కల్పేది గమనానికి వీలుగా వుండేది 'వంతెన' అని వ్యవహరిస్తాం.

మనిషి తన మేధా సంపత్తితో జీవిత గమనానికి కావల్సిన సదుపాయాలు సమకూర్చుకుని బ్రతుకుని సుఖవంతం చేసుకోగల్గుతున్నాడు. పెద్ద పెద్ద నదీనదాలు, పర్వత శ్రేణుల మధ్య ఎంతో నైపుణ్యంతో వారధులు నిర్మించి సాహసోపేతుడు కాగల్గుతున్నాడు.

మనకి బాగా తెలిసున్న పురాణ గాథ రామాయణం. రాముడు సీతని తీసుకుని రావటం కొరకు లంకకి వెళ్ళవలసి వచ్చింది. అప్పుడు సముద్రం మీద వారధి నిర్మించవలసి వచ్చింది. వానర

సైన్యంతో పాటు బాహు బలాఢ్యులైన జాంబవంతాదులు సైతం కృషి చేసేరు. చివరికి ఉడత సైతం యధావిధి తనవంతు శక్తి అందించిందని మనకి తెలుసు. దీనిలో పరమార్థం మనం గ్రహించాలి.

'సీత' అనే 'ప్రకృతి'ని 'రావణాసురుడ'నే దుష్టశక్తి కబళించాలని చూస్తే 'పురుషశక్తి' అనే 'రాముడు' ఎదుర్కొని దండెత్తేడు. అందుకు తోడుగా సైన్యమనే 'ధర్మశక్తి' తోడై నిల్చింది.

దుష్టత్వాన్ని సంహరించడానికి చైతన్యంతో పాటు ధర్మశక్తి కూడా తోడై ప్రకృతీ పురుషుల్ని కల్పేది వారధి. ఆ వారధి వల్లే తనకి తాను వంటరిగా విసిరి వేసినట్టు వుండే లంక భారతదేశంలో అనుసంధించబడింది. 'సంతానం' అనే సృష్టి ధర్మం కలుపుతుంది. ఇంట్లో పిల్లలు వారధిలాంటి వారు. వృద్ధులై ఒకతరం వెనుక వుండి ఆచార వ్యవహారాలతో వుండే అత్తమామలకి యవ్వనంలో వుండే ముందుతరానికి పరుగులెత్తే కొడుకులు, కూతుళ్ళకీ సమన్వయ పరచగల్గే ఇంటి ఇల్లాలు వారధి లాంటిది.

'వంతెన' అనగానే కేవలం రోడ్లని కల్పి గమనానికి తోడ్పడేదే కాదు. జీవితపు ప్రతి రెండు విభిన్న తత్వాలకి కుదిర్చే సమన్వయ భావమే వారధి. ఎన్నో సాహసోపేతమైన కార్యాలు చేసే మానవులు పెద్ద పెద్ద వంతెనలు నిర్మించి, ఆనకట్టలు కట్టి, పంటలకి జన సముదాయానికి ఉపయుక్తంగా ఏర్పాటు చేసుకుంటున్నారు. కానీ... వంతెనల్ని కూలదోసేవారు, వినాశనం తలపెట్టేవారూ వున్నారు. మంచి ప్రక్కన చెడూ, వెలుగు తర్వాత చీకటి, జ్ఞానం ప్రక్కనే అజ్ఞానం... ఇలా ఈ జగత్తు అంతా రెండు విభిన్న మార్గాలలో వుంది. ఈ రెంటినీ సంధి కుదిర్చే సన్మార్గుడి ఓర్మే ఈ జగత్తులో నిజమైన వారధి! ద్రోహాలు అరికట్టగల్గి జాతి సమైక్యతా వారధి నిర్మిద్దాం.






# గాయం అంటే?

సాఫీగా వున్నచోట అభ్యంతరం ఏర్పడి రెండుగా విడిపోతే దానిని మనం 'గాటు' అంటాం. తిరిగి ఆ రెండు భాగాలు కలసినా మొదట వున్నట్టుగా ఆ ప్రదేశం సాఫీగా, నున్నగా వుండదు. ఆ ప్రదేశం శరీరానికి సంబంధించినదైనా, పశుపాదులకైనా, చెట్టుకైనా సరే...! ఈ అభ్యంతరం అనేది మరొక కొనదేలిన వస్తువుతో ఏర్పడవచ్చును. అంటే కొయ్యడం, లేదా గీరటం ద్వారా జరుగుతుంది. ఈ కొయ్యటం అనేదే బాగా లోతుగా జరిగితే అది 'గాయం' అవుతుంది.

గాయం చాలా బాధిస్తుంది. రక్తం కారుతుంది. లోపలి కండరాలు, మాంసం బయటికి రావచ్చును. మందులు వేసి, కుట్లు కుట్టి, గాయం నయం చేయవచ్చును. కానీ... ఆ గాయం తాలూకు మచ్చ మాత్రం పోదు.

బ్లేడు కోసుకుని వేళ్ళకి గాయాలు చేసుకుంటారు పిల్లలు. తేలిగ్గా కోసుకుంటే గాయం చిన్నదిగా వుండి త్వరగా తగ్గిపోతుంది. అదే బాగా లోతుగా కోసుకుంటే బాధ ఎక్కువ. త్వరగా తగ్గదు. కూరలు తరిగే మహిళలకు చేతి బొటనవ్రేలుకి గాట్లు పడివుంటాయి. పొరపాటుగా వున్నా ఏమరుపాటుగా వున్నా 'కస్సున' తెగి గాయం అవుతుంది. ఒక్కొక్కసారి కాళ్ళకి రేకుముక్కలు, కత్తులు తగిలి గాయమవుతాయి. చెట్లెక్కే వాళ్ళకి ఆ చెట్టు కొమ్మలు గీసుకుని కూడా గాయమవుతుంది. మేకులు సూదులు లాంటి వస్తువులు గుచ్చుకుంటే రక్తం కారినా దానిని గాయం అనం. గుచ్చుకోవటం ఆ మాత్రమే అని అనుకుంటాం. ముల్లు దిగినా అంతే!

అంటే... గాయం అనేది శరీరభాగాన్ని రెండుగా చీల్చి, లోపలినుండి రక్తం స్రవిస్తే దానిని గాయం అనాలి. దెబ్బలు తగులుతాయి. రాళ్ళు గుచ్చుకుంటుంటాయి. రక్తం కారుతుంది. అయినా... గాయాలు అని చెప్పం. దెబ్బలనే అంటాం.

అలాగే... చెట్లకి అంట్లు గట్టడానికి జిగుర్లు, రసాలు తీయటానికి గాట్లు పెడతారు. వాటిని గాయాలనరు. పశువులకి దెబ్బలు తగిలి గాయాలవుతూ వుంటాయి. అందుచేత 'గాయం' అనేది ప్రతి దెబ్బకీ, పుండుకీ, రక్తం కారే ప్రతి చర్యకీ ఉపయోగించం. శరీర భాగాన్ని కోసి చర్మాన్ని రెండుగా విడదీసుకుపోతే అది 'గాయం' అని పిలువబడుతుంది.

ప్రమాదాలు జరిగి గాయాలు అవుతూ వుంటాయి. రక్తం చాలా బయటికి వచ్చేస్తుంది. చాలా ప్రాణాపాయ స్థితి కల్గుతుంది. హంటర్ తోటీ, బెల్ట్ తోటి, కర్రతోటీ దెబ్బలు కొడ్తే దద్దుర్లు తేలి వాతలు పడి, శరీరం కమిలిపోతుంది. రక్తం కూడా కారవచ్చును. అయితే... విపరీతమైన దెబ్బలు అనే అంటాం. అదే తెగిపోయి రక్తం కారితే గాయం అనేస్తాం.

ఇదంతా శరీరానికి సంబంధించి మనం చెప్పుకునే పరిభాష. కానీ... మనస్సు కంటికి కనిపించదు. చెవులకి వినిపించదు. కానీ, మనస్సు కూడా గాయపడుతుంది. కనిపించని, వినిపించని ఆ అనూహ్యమైన ఇంద్రియానికి గాయమైతే మందు వేసుకోలేం. శస్త్రచికిత్స చేయలేం. ఈ గాయానికి కాలమే ఔషధం! ఆత్మీయులని పోగొట్టుకున్నప్పుడు, అపనిందలు భరించినప్పుడు, నిరుత్సాహం కల్గినప్పుడు, అనుకున్నది సాధించలేకపోతే అవమానపాలైనప్పుడు, అన్యాయంగా మనల్ని దోషుల్ని చేసినప్పుడు మన మనస్సు రెండుగా చీలి గాయమవుతుంది. ఆవేదన, రక్తంలా కారుతుంది. ఎవరైనా ఓదారిస్తే, కొంత మనశ్శాంతి పొందగలం. కానీ, గాయం పూర్తిగా తగ్గదు. సున్నితమైన మనస్సు గలవారు త్వరగా బాధపడతారు. శారీరకమైన బాధని మనస్సు తట్టుకోగలదు కానీ, మానసికమైన గాయాన్ని శరీరం కూడా భరించలేదు. యజమాని లేని ఇల్లులా మనస్సు మూగపోతే శరీరం శుష్కించిపోతుంది. కనుక మానసిక గాయమే బలమైనది.






# వర్ణన!

ఊహాతీతాలు అనేకం. ప్రతి మనిషికి మేధకి అందని అనేక చిత్ర విచిత్రాలు ఈ సృష్టిలో ఎన్నో వున్నాయి. భావానికి ఓ రూపుదిద్ది, సమాజంలో మానవ జీవితానికి అర్ధం కల్పించేది భాష. ఆ భాష మరికాస్త మెరుపులు దిద్దుకుని ఉన్నత సోపానాలు ఎక్కగల్గితే ఊహాతీతాల్ని కూడా రమ్యంగ కన్నుల ముందు కనిపించే తీరుగా చెప్పవచ్చును. ఆ విధానానికే 'వర్ణన' అని మనం వ్యవహరిస్తాం.

ప్రతిమనిషి తన భావాన్ని వెల్లడి చేయలేడు. కొందరు ఏదైనా చూస్తే నిర్లిప్తంగా వుంటారు. కొందరు మనసులో ఆనందించి ఊరుకుంటారు. ఇంకా కొందరు 'ఎంత బాగుందో!' అని పైకి అనేస్తారు. మరికొందరు అదెంత బాగుందో వర్ణించి చెప్తారు. ఈ వర్ణన వలన సాటి మనిషిలో కూడా భావ తరంగాలు కదలుతాయి. 'ఉపమా కాళిదాసస్య!' అన్నారు.

కాళిదాసు వర్ణనలో పోలికలు గొప్పగా వుంటాయి. మరే కవిలోనూ కనిపించవు ఆ పోలికలు. అద్భుతంగా వర్ణించగల కాళిదాసు కావ్యాలు అంధులకి కూడా ప్రకృతి చూసినంత అనుభూతి కల్గుతుంది. వరపుత్రుడు, కాళీప్రసాదుడు అయిన కాళిదాసుకే సాధ్యమైంది ఉపమానాలు చెప్పటం!

కవి గానీ, రచయిత గానీ, సామాన్యుడు గానీ... తన భావం పరిపూర్ణంగా నింపుకుని భాషలోకి మలచగల్గితే ఆ వర్ణన గొప్పగా వుంటుంది తప్ప- లేకుంటే పేలవంగా వుంటుంది. కొంతమంది తాము

చూసివచ్చిన చిత్రంగానీ, దృశ్యంగాని సన్నివేశం గాని చెప్తారు. అది వినేవాళ్ళకి ఏమీ అనిపించదు. 'ఎందుకింతలా చెప్తున్నారు?' అనిపిస్తుంది తప్ప వాళ్ళ అనుభూతి వీళ్ళేం పంచుకోలేరు.

కొంతమంది మనసులో ఎంతో చెప్పాలని వుంటుంది. కానీ... భాష, అనుభవం చాలక వాళ్ళు చెప్పేది చప్పగా తయారవుతుంది. చిన్నపిల్లలకి కథలు చెప్తుంటారు కొందరు. ఆ చెప్పే విధానంలో వర్ణన మాటలు పిల్లలని ఎంత ఆకట్టుకుంటాయంటే... వాళ్ళు కళ్ళింతింత చేసుకుని 'ఇంకా చెప్పు ఇంకా చెప్పు' అంటారు. అదే కొందరు కథలు చెప్పినా, కబుర్లు చెప్పినా పిల్లలు ఆవలించుకుంటూ బుర్ర గోక్కుంటూ అనాసక్తిగా కనిపిస్తారు.

కొందరు కళాత్మక హృదయం గలవారు ఒక సున్నితభావాన్ని వర్ణిస్తే, ప్రపంచపు చివరి అంచులవరకు మనం వెళ్ళిపోతాం. ఒక గొప్ప ఊహాచిత్రం, మన మనస్సులో ముద్రించుకుపోతుంది. హృదయ తంత్రుల్ని లాగి వదిలితే 'ఝుంఝుం' అనే శబ్దం ఎలా అలలు అలలుగా ప్రతిధ్వనిస్తుందో మనసు భావపరంపరలతో ఆ విధంగా కదలిపోతుంది.

అదే కొందరు ఒక బీభత్సాన్ని వర్ణిస్తారు. గుండె ఆగిపోతుందేమో... అనేంత భయం కల్గి జీవితం నిండా భయాన్నే నింపుకుంటాం.

అందుకే వర్ణించటం అందరికీ చేతకాదు. భావం పరిపుష్టి చెందినవాడే వర్ణించగలడు. భాష వచ్చినవాడే అందంగా మలచగలడు. గులకరాళ్ళు డబ్బాలో పోసి గలగల లాడించటానికీ సంతూర్ మీద సున్నితంగా వాయించటానికీ ఎంత తేడా వుంది? జలపాతాలు ఉవ్వెత్తున పడుతున్న ధ్వని సంతూర్ వాయిద్యంలో వినిపిస్తుంది. అది గొప్ప వర్ణనే.

'అమ్మ' పిలుపులో, లేగదూడ అరుపులో, ఉషోదయ కాంతిలో, మంచు బిందువులో, పసిపాప కన్నీటిబొట్లలో, పండిన వృద్ధుడి కనుచూపులో, అమాయకుడి నవ్వులో అర్థాలు డిక్షనరీలలో దొరకవు.

భావకుడి హృదయరాగం మీద ఆలపిస్తాయి. ఆ ఆలాపనే వర్ణనగా మార్చి సమాజానికి అందిస్తాడు. కొత్త ప్రపంచాన్ని చూపిస్తాడు.

అందరూ త్యాగరాజసాములు కాలేరు, ఘంటసాలలూ కాలేరు. వర్ణించగలవారు, మనసుకి హత్తుకునేలా చెప్పగల్గేవారు... భగవత్ అంశ గలవారు! ఈ సత్యం తెలుసుకుంటే మనం పనికి మాలిన పనులు మానేసి మనకి చేతనైన వాటినే చేసి తృప్తి పడగలం.






# ఆకించన్యం !

ఆంజలి ఘటించి నమ్రతగా తలవంచితే ఆ వ్యక్తిని మరేమీ ప్రశ్నించటానికి గానీ, శిక్షించటానికి గానీ ఆస్కారం లేదు.

అనగా రెండు చేతులూ జోడించటంలో తనలోని దోషాలన్నీ కడిగేసుకుని మాలిన్యం లేకుండా వున్నాడని తెలుసుకోవాలి.

అదే ఆకించన్యం.

అనగా... ఆకించన్యం సూచించటం! 'కించన్యం' అంటే నీచం లేదా తక్కువ స్థితి. అ‹ లేకుండా చేసుకోవటమే ఆకించన్యం !!

మానవులంతా తెలిసో, తెలియకో కించన్యం ప్రకటిస్తూనే వుంటారు. కానీ, చాలా అలవాటై పద్ధతిలో చేసేస్తారు. అర్ధవంతమైన పనికి ఫలితం వుంటుంది. కానీ, అర్థం లేని పనులకి ఫలిత శూన్యం అని గ్రహించాలి.

చిన్న పిల్లలకి పాఠశాలలో ఎన్నో సుబోధలు చేస్తారు. కానీ, ఎంతమంది ఆ బోధల్ని సక్రమం ఆచరణలో పెడ్తున్నారు? నిజంగా తరగతిలో పిల్లలంతా ఉపాధ్యాయుడి పాఠం బోధలో సరిగ్గా అర్థ చేసుకుంటే సమాజంలో ఇన్ని అరిష్టకాలు, అత్యాచారాలు జరుగుతాయా? వాళ్ళు దోషులవుతార విద్యావంతులు, విషయ పరిజ్ఞానం వున్నవాళ్ళు కూడా ఎన్నో తప్పులు, పొరపాట్లు చేస్తున్నారు.

అలాగే... పెద్దలు కూడా అన్నీ తెలిసివుండి పొరపాట్లు చేస్తూనే వున్నారు. నిందితులు అవుతూనే వున్నారు.

భగవంతుడు సర్వత్రా వున్నాడనీ, సర్వజనులు, జీవులు భగవత్ స్వరూపాలేనని తెలిసి కూడా మనసులో ద్వేషం, కావేషం పెంచుకుని విబేధాలు సృష్టిస్తున్నారు. సర్వవ్యాప్తి అయిన ఆ దేవుడ్ని పరిమితం చేయాలనుకునేవారూ, 'నీ దేవుడూ, నా దేవుడూ' అని విభజించుకోవటం ఆధ్యాత్మికంగా తప్పుచేటయమే. దోషం, నీచం కూడా.

కరుణామయుడూ, జగద్రక్షకుడూ అయిన పరమేశ్వర తత్వంలో విబేధం అనేది లేదు. పరమేశ్వరుణ్ణి తలుచుకుంటున్నారు, కొలుస్తున్నారు, ఆరాధిస్తున్నారు. కానీ... అతని (థియరీ) విషయాన్ని అనగా తత్వాన్ని అర్థం చేసుకోలేకపోతున్నారు. ఇదే దోషం. దీనివల్ల భగవంతుణ్ణే కించపరచినట్టు అవుతుంది.

దేవాలయంలో అంతా దేవుని ఆరాధకులే!

అటువంటప్పుడు ఒకరి ఆరాధనని మరొకరు విమర్శించటం, తప్పు చూడటం ఆ ఆలయ విధానానికే కళంకం.

ఇలా తత్వాన్ని లేదా మూలభావాన్ని అర్థం చేసుకోకుండా ప్రవర్తించటం మానవులు చేస్తున్న పెద్ద పొరపాట్లు. అందువల్లే మనిషి మనిషికీ మధ్య అనేక అవాంతరాలు, సమాజంలో అల్లకల్లోలాలు ఉత్పన్నమవుతున్నాయి. పాఠశాలలు మొదలుకొని ప్రతిరంగంలో మూలమైన దానిని వదలి బాహ్యాన్ని పైపై ఆకర్షణలని అనుసరిస్తున్న ఈ ధోరణే ఆకించన్యం.

"నకశ్చిన్నాపరాధ్యతి?" ని సీతాదేవి హనుమంతుణ్ణి ప్రశ్నించి 'హనుమా... తప్పు చేయని వారెవరుంటారూ? కనుక రాక్షస స్త్రీలని చంపకు' అని వారిస్తుందిట. అంటే -తప్పు చేయటం సహజమని, క్షమించటమే విజ్ఞుల లక్షణమని బోధిస్తుంది. దాన్ని అనుసరించి విజ్ఞులైన పెద్దలంతా మనం కూడా తప్పులు చేస్తామని, అందువల్ల ఇతరుల తప్పిదాలని క్షమించాలని గ్రహిస్తే భగవంతుడ్ని సేవించినట్టే.

ఆ విధంగా మనకి మనం ఆకించన్యం ప్రకటించుకోవాలి !!





# అంకితం!

ప్రాపంచికమైనవీ, భౌతికమైనవీ కాక, మానసికమైనవీ, కళాత్మకమైనవీ తను వదలుకుని మరొకరికి శాశ్వతంగా ఇవ్వటం 'అంకితం!' అని అంటాం.

' నా జీవితం నీకే అంకితం' అని కవులు పాటలు వ్రాస్తారు. రచనలు, కావ్యాలు, గ్రంథాలు మరొకరికి అంకితం ఇస్తారు. 'మనసు' అంకితమని కూడా అంటారు. ఇవన్నీ కళాత్మకంగానూ మానసికంగానూ అర్పించుకోవటం.

అయితే... స్థిరాస్తులు ఇతరుల పేరు మీద గానీ, దేవాలయాలకి గానీ, బీదలకి గానీ ఇస్తే 'దానం' అనే చెప్తారు గానీ అంకితం అని చెప్పరు. అలాగే ఇల్లు, భూములు, తోటలు వస్తువులు... ఇలాగ ఏదైనా వస్తురూపంలోనివి ఇతరులకి ఇస్తే అంకితం అవరాదు.

సాధారణంగా కళాకారులు, రచయితలు, కవులు తమ రచనలనీ, విద్యని అంకితం చేస్తూంటారు. ఇలా అంకితం చేసినప్పుడు ఆ గ్రంథం యొక్క సర్వహక్కులు అంకితం ఇచ్చినవారికే చెందాలి. అప్పుడే అది 'అంకితం' అనిపించుకుంటుంది. అంతేగాని, వేదికమీద లాంఛనప్రాయంగా అంకిత కార్యక్రమం జరిపించి ఆ తరువాత గ్రంథం యొక్కు మూల్యం రచయిత తీసుకోవటం జరుగుతోంది. అది అంకితం కాదు. ఈనాటి అంకిత కార్యక్రమాలన్నీ ఇలాగే సూత్ర ప్రాయంగా జరుగుతున్నాయి.

నిజానికి అంకితమంటే 'కన్యాదానం' లాంటిది. ఒకసారి మనస్ఫూర్తిగా ఒకరికిచ్చిన రచనగానీ, కళగానీ తిరిగి కైవశం చేసుకోకపోవటమే అంకితం యొక్క పరమార్థం. అది బహుమతి గానీ, జ్ఞాపికగానీ కాదు. మనస్ఫూర్తిగా తన కళని లేదా కళాత్మక హృదయంలో నుంచి వెలువడిన విద్యని... అది పాటగానీ, రచనగానీ, గేయంగానీ ఏదైనా సరే...ఆ విద్యని ఇతరులకి ధారాదత్తం చేయటాన్ని 'అంకితం' అనే పవిత్ర నామంతో పిలవాలి.

ఒకసారి అంకితమిచ్చిన దాన్ని ఎట్టి సందర్భంలోనూ తిరిగి దానిమీద హక్కు మనం తీసుకోనప్పుడే అది సఫలమవుతుంది. చాలామంది పూజ్యులైన గురువులకి, తల్లిదండ్రులకీ, పెద్దలకీ, స్నేహితులకీ అంకితం ఇస్తారు. ఇంకా సమాజంలోని ఆర్తులకీ, శ్రమజీవులకీ అని 'అంకితం' అంటారు. అటువంటప్పుడు ఆ గ్రంథరూపంగా లభించే ద్రవ్యం వారికే వినియోగించాలి.

త్యాగమనే పదం, దాని ఫలితం ఎంత నిష్కామమైనవో 'అంకితం' అనే పదం దానీ ఫలితం అంతే గొప్పవి! మనం ఒక్కోసారి బాధలో, కష్టంలో కూడా 'అంకితం' అనే పదం ఉపయోగిస్తూ వుంటాం. 'ఆవిడ రాదులెండి. ఆమె ఆ ఇంటికి 'అంకితం' అయిపోయింది. భర్త, పిల్లలు, అత్త మామలు తప్ప మరో ప్రపంచం చూడటానికి ఆమెకి తీరదు' అంటారు.

అంటే... బాహ్య ప్రపంచాన్ని చూడలేనంతగా ఆమె ఆ ఇంటి పనులలో మునిగి వుంటుందని చెప్పటమే కదా? అలాగే ప్రేమించినవాడికే తన మనస్సు, జీవితం అంకితం అయిపోయాయని చెప్తారు. ఇవన్నీ ఇతరులని కాక ఒకరిపైనే దృష్టి నిలపటమన్న మాట.

భక్తులైనవారు తమ సర్వం భగవంతునికే అంకితం చేస్తారు. త్యాగం కన్నా గొప్పదైన 'అంకితం' మనం అర్థం గ్రహించి చేస్తే అంతకన్నా పరమార్థం లేదు.





# తనకు మాలిన ధర్మం !

మొదలు చెడిన బేరం... అని నానుడి. ఏదైనా ధర్మం - అంటే... మంచి పని చేయాలనుకోవడం మెచ్చుకోదగ్గదే! కానీ, తనకున్న అవసరాలు మానుకుని జీవన మనుగడకి ఆటంకం ఏర్పడే ధర్మ కార్యాలు చేయమని ఎక్కడా, ఎవ్వరూ బోధించరు.

ముఖ్యంగా... గృహస్థులైనవారు తమకి కావల్సిన సదుపాయాలు అవసరాలు చూసుకుని ఇతరులకి సేవ చేయాలి. సంతానానికీ, భార్యకి (భర్తకి) చూడవలసినవి, చేయదగ్గవి చేయకుండా ప్రజాసేవ చేయడం హర్షణీయం కాదు. ఇంట్లోవారిని సంతోషపరిచి, వారి ఆమోద ముద్ర పొందేక బయట విషయాలు చూడటం శ్రేయస్కరం. దీనినే 'ఇంట గెలిచి రచ్చ గెలవడం' అంటాం.

అయితే... ఇంట్లో వారు ఆమోదించటమనేది కొన్నిచోట్ల లభ్యం కాదు. కొందరికి ఎంత చేసినా ఇంకా ఇంటిని కనిపెట్టమనో, ఇంకా సౌఖ్యాలు కావాలనో, డబ్బూ, నగలు, ఆస్తి, ఇళ్ళూ, వాహనాలు మరిన్ని కోరుకుంటూ తృప్తి, హద్దూ అనేది లేకుండా ప్రవాహంలో కొట్టుకుపోతున్న కర్రదుంగలా వెళ్ళిపోతూనే వుంటారు.

ఆ సందర్భంలో సమృద్ధి గల దానగుణం గలవారు కొంత తేరుకుని ఎక్కడో ఒకచోట ఆనకట్ట వేసుకోగల్గాలి. అమ్మాయికి వివాహం చేసి అత్తవారింటికి పంపించి, అక్కడ ఆమె సుఖంగా వున్నదని తెలిసేక ఇక ఆమె కోసం తాపత్రయపడనక్కర్లేదు. ఆ శ్రమని మరొకవైపుకి మళ్ళించుకుని సమాజపరమైన

అభివృద్ధి కార్యక్రమాలు చేయవచ్చును. అలాగే అబ్బాయి చదువు పూర్తి అయి, ఉద్యోగం దొరికి వివాహం అయాక, ఇంకా వాళ్ళ కోసం తాపత్రయ పడడం, వాళ్ళవెంట తిరగడం కాకుండా తను వేరే పరోపకారమైన కార్యక్రమాల వైపు దృష్టి మళ్ళించుకోవాలి.

ఇక కొందరు ఇల్లూ సంసారం పట్టకుండా సంపాద, ఆస్తి అంతా ఎప్పటికప్పుడు ఖర్చు చేస్తూ చందాలు ఇచ్చి సంస్థలకి రాసిచ్చి, దాయాదులకి పెట్టి, పార్టీలకిచ్చి అతిథి అభ్యాగతులకి, అనాథ శరణాలయాలకి దానం చేస్తూ కన్నవారికి, కట్టుకున్న వారికి, తల్లిదండ్రులకీ, చివరికి తనకి గూడా నిలువ నీడ లేకుండా చేసుకుని కష్టపడతారు. ఈ రకమైన దానగుణం ఎవరూ మెచ్చరు. అంతేకాదు... భగవంతుడు కూడా సంతోషించడు. నీకూ, నీపై ఆధారపడిన వారికి కొంత ఉంచుకుని మిగతాది సత్కార్యాలకి ఉపయోగించమనేది శాస్త్ర సమ్మతం.

నీ స్వజనం దు:ఖిస్తున్నా, ఆవేదన పడుతున్నా నువ్వు చేసిన 'మంచికి' విలువ వుండదు. అయితే... తృప్తి లేని స్వజనం మాట చెప్పనవసరం లేదు. అందుచేత తనకి మించిన బరువులు గాని, తన ఆదాయాన్ని మించిన ఖర్చులు గానీ, తమ అవసరాలు గానీ చూసుకోకుండా చేసే ధర్మాలు శాస్త్ర విరుద్ధం.

ఇదంతా ప్రాపంచిక విషయాల విషయం. ఇక అధ్యాత్మ యోగంలో తనకుమాలిన ధర్మం అంటే... ఎప్పటికీ భౌతిక విషయాలలో పడకుండా మానసికంగా, నైతికంగా భగవద్భక్తి కల్గి జపతపాలు, ధ్యానం, చేసుకుని నిన్ను నీవు రక్షించుకో... అని భగవానుని ఉవాచ.



92

# కోడ్..!

ఒక విషయాన్ని రహస్యంగా వుంచాలనుకున్నప్పుడు ఎవరికీ చెప్పకుండా ఊరుకుంటాం. ఒకవేళ మరొకరికి, మనకి అతి ముఖ్యమైన వాళ్ళకి చెప్పాలనుకుంటే చాటుగానో, చెవిలోనో చెప్తాం.

అయితే... ఈ పద్ధతి దగ్గరగా వున్నప్పుడు మాత్రమే సాధ్యమవుతుంది. మనం ఎవరికైతే వార్త అందించాలనుకుంటున్నామో, వాళ్ళు మనకి దూరంగా లేదా పదిమందిలో వుంటే రహస్యం చెప్పడానికి వీలు కాదు. అటువంటి సమయంలో సౌంజ్ఞలు చేసి చెప్తుంటాం. అయితే... ఈ సౌంజ్ఞ కూడా చాలామందికి అర్థమయ్యే అవకాశం వుంది.

అదీగాక.., దగ్గరగా వుండనప్పుడు సౌంజ్ఞలు కూడా చేయలేము. మరి మనం చెప్పదలచిన విషయం ఇతరులకి తెలియకుండా వారికీ, మనకీ మధ్య అవగాహన చేసుకోగల మరొక భాష లేదా భావం కావాలి. దానివలన విషయమేమిటో మన మధ్య తప్ప ఇతరులకి అర్థమయ్యే అవకాశం కలగదు.

అటువంటి భాషనే 'కోడ్' అని చెప్తాం.

ఒక్క రహస్యమే కాదు. అతి తక్కువ సమయంలో ఎక్కువ పదాల అర్థాన్ని తెలియచేయటం కూడా 'కోడ్' యొక్క గొప్పతనం.

షార్ట్‌హాండ్ . . . అలాంటిదే! ఉపన్యాసాలు . . . ఇంటర్వ్యూలు . . . రిపోర్టులు. ఉత్తరాలు తాఖీదులు, పంపాలంటే, ప్రతిపదం రాసుకుంటూ . . . సమయాన్ని వృధా చేయకుండా షార్ట్‌హాం

రాసుకుని తర్వాత వివరంగా రాసుకుంటారు స్టెనోగ్రాఫర్లు! షార్ట్‌హాండ్ యొక్క సౌలభ్యం వలన ఎంత విషయమైనా అతి తక్కువ వ్యవధిలో వ్రాయగలరు.

అలాగే 'కోడ్' అంటే కొన్ని గుర్తులు, సంకేతాలతో కొందరు తమకి మాత్రమే అర్థమయ్యే కొన్ని రహస్యాలని తయారు చేసుకుంటారు... దొంగలు, స్మగ్లర్స్ పెద్ద పెద్ద వ్యాపారవేత్తలు!

ఇలాంటి కోడ్ భాషని కల్పించుకుని బాహాటంగా ఉత్తరాలలో వ్రాసుకున్నా ఇతరులకి అర్థం కాదు. 'కోడ్'లని కొత్త కొత్తగా కనిపెట్టుకుంటున్నారు.

కొందరు మర్మగర్భంగా మాట్లాడుతారు. కొందరు అసలు పదాలకి మారు పదాలని ఉపయోగించి మాట్లాడుకుంటారు. కొందరు చేతులతో సౌంజ్ఞలు ఇతరులకి బోధపడని రీతిలో చేసుకుంటారు. ఇవన్నీ 'కోడ్' క్రింద లెక్క.

నిధులు, రాజకీయ ఉదంతాలు, గూఢచార్ల సేకరణలు కొన్ని రకాల 'కోడ్'లలో రహస్యంగా వుంటాయి.

చిన్నపిల్లలు గానీ, చదువుకునే విద్యార్థులు గానీ 'క' భాష అనీ, 'ర' భాష అని మాట్లాడటం మనం వింటూనే వుంటాం. ఇది తమాషాగా వున్నా ఇదోరకం కోడ్‌లాగా ఉపయోగించుకుంటారు.

నిజానికి మన లెక్కల్లో నేర్చుకునే సూత్రాలు ట్రిగనామెట్రీల్లాంటివి మరి గణిత శాస్త్రానికి కోడ్‌లాంటివే (వికలాంగులకీ) మూగవారికీ, గ్రుడ్డివారికీ నేర్పించే వీలుగా, సుఖంగా వుండటానికి సృష్టించుకున్న 'కోడ్'లు!

కానీ... వేద వేదాంత గ్రంథాల్లో, ఉపనిషత్తులలో, ఆధ్యాత్మ యోగంలో మనకి అర్థం గాని 'కోడ్'లు ఎన్నో వున్నాయి.

'ఓంకారమే' ఓ పెద్ద కోడ్!

జనం, పూజ, నియమం, నిష్ఠ, ధ్యానం, రాగాలాపన, నాట్యం, లలితకళలు, విద్య, పురాణేతిహాసాలు... ఇవన్నీ సామాన్యులకి అర్థం కాని అంతరార్థంతో కూడిన ఆధ్యాత్మిక కోడ్‌లు!! ఆ కోడ్ తెలుసుకోవాలంటే నైతిక క్రమశిక్షణ, విలువలు తెలుసుకోవటం మొదటి మెట్టు. ఆ తర్వాత సత్ గురు బోధతో సమస్తం తెలుసుకోగలరు.






# ఆశ్రయం అంటే!

సాధారణంగా - బ్రతుకు భారమై మనుగడ గడవనప్పుడు మరొకరి నీడన జీవితం సాగించవలసి వుంటుంది. అలా ఇంకొకరి సహాయంతో జీవించడమే ఆశ్రయం పొందామంటాం! అలా చేయూత నిచ్చిన ప్రదేశాన్ని 'ఆశ్రయం' అని పిలుస్తాం!

జీవితంలో - కష్టాలు పడినవారూ, 'నా' అనే బంధువులు గానీ, మిత్రులు గానీ - లేనివారూ - నిస్సహాయ, నిరాధారులంతా, ఆశ్రమంలో - తల దాచుకుంటారు!

దయార్ద్ర హృదయులు - పరోపకార బుద్ధితో ఆశ్రమాలు నిర్మిస్తూ వుంటారు. అంతశక్తి లేప్పుడు సమైక్యతగా, కొన్ని సంఘాలుగానీ, సంస్థలు గానీ కలసి ఆశ్రమాలు నెలకొల్పుతూ వుంటారు!

తనలాంటి పదిమందిని చూసినప్పుడు ఎంతటి దీనులకైనా మనోధైర్యం కలుగుతుంది! బ్రతుకుమీద ఆశ పుడుతుంది. క్రమంగా నల్గురితో కలసి, కష్టించి పనిచేసి, ఫలితాన్ని అందరూ, అనుభవించే సమతాదృష్టి ఏర్పడుతుంది! అంటే... తను బ్రతుకుతూ, తోటివారికి కూడా తోడై నిలిచే - మమతాభావం నింపుకోగల్గుతారు.

కేవలం నిరాధారంగా వున్నవాళ్ళు, దిక్కులేనివాళ్ళ కోసమే ఆశ్రమాలు - వుండడం కాదు. వికలాంగులు, వృద్ధులు కూడా ఆశ్రమంలో వుంటారు. అంటే... తనకు తానుగా జీవించటం కష్టమయిన చోట వాళ్ళకోసం మరొకరు ఆశ్రయం కల్పించట మన్నమాట!

నిజానికి ఆశ్రమాల ధ్యేయం - దీనజనరక్షణ, ఆర్తుల ఆదరణే ! కానీ... కొందరు స్వార్థంతో ఆశ్రమాలకి పంపిస్తూ వుంటారు తమ పెద్దల్ని ! అలాగే వికాలాంగులైన వారిని సంరక్షించలేక (ఇష్టంలేక) ఆశ్రమాలకి అప్పగిస్తూ వుంటారు. విధివశాత్తు అనాథలైన వారు కాక, సమాజంలో ఏదో పొరపాటు చేసి, ఆ తర్వాత బ్రతుకు దుర్భరమనిపించి, ఆశ్రమం చేరేవారూ వున్నారు! ఆశ్రమాలని స్వార్థానికి ఉపయోగించుకోవటం క్షంతవ్యం కాదు !

ఏది ఏమైనా... ఆశ్రమం అనేది ఒక దేవాలయం లాంటిది ! భగవంతునికి ఎలాగైతే సర్వజీవుల యందు ఒకేవిధమైన ప్రేమభావం వుంటుందో - అలాగే ఆశ్రమంలో వుండేవారంతా ఒకే తల్లి పిల్లల్లాగా మమతానుబంధాలతో కలసి వుంటారు (చాలావరకు). జాతి, వర్గభేదం లేకుండా, భోజనాది నిద్రావిషయాలకి అందరూ సమాన స్థానాల్లోనే వుంటారు! నియమం ప్రకారం ఎవరి పనులు వాళ్ళు చేసుకుంటూ సత్కాలక్షేపాలు కూడా చేస్తుంటారు. ఆనందమైనా, దు:ఖమైనా సమంగా పంచుకుంటారు. జబ్బుచేస్తే అందరి ఆదరణ లభిస్తుంది! ప్రార్థన, సద్గ్రంథ పఠనం, చేతిపనులు లాంటివన్నీ - కూటమిగా చేయటంలో కూరిమి, ఓరిమి కల్గి భేదాలు మర్చిపోతారు. అందుకే ఆశ్రమం 'శివాలయం' లాంటిది!

అలాగే - సాధూ ఆశ్రమాలు, ధార్మికాశ్రమాలు, ఆధ్యాత్మిక చింతన ఆశ్రమాలు, గురుకుల ఆశ్రమాలు చాలా వుంటాయి. ఒక్కొక్క ఆశ్రమానికి ఒక్కో ధ్యేయం మూలమై వుంటుంది. ఏదైనా సరే... మార్గాలు వేరు కావచ్చును కానీ గమ్యం ఒకటే! అనాథ ఆశ్రమం అయితే - అందరూ కలిసి సమతాభావానికి అంకితమవటం! ఇక... వృద్ధాశ్రమంలో పండిన ఆకులన్నీ కలబోసినట్టు జీవిత నౌకలో తుది మజిలీలో అంతా ఏకమై మనోధైర్యం పొందుతారు. సన్యాసులూ, ధార్మికులూ, ఆధ్మాత్మిక చింతనాపరులూ, దైవ సాక్షాత్కారం కోసం ఒకే మార్గాన పోయే బాటసారుల్లా ఏకత్వం పొందుతారు!

మానవులంతా ఒకటే! రంగులు, దారులు, రుచులు వేరైనా అందరూ దివ్యధవళకాంతి వైపుకే చేరుకుంటారు ! ఈ సత్యం జీర్ణించుకుంటే - ఆశ్రమాల దాతలు వారి కృషి ఫలించినదని సంతోషించవచ్చును. స్వార్థపరులు ఆ శ్వేత పద్మాలను మలిన పరచకుందుగాక ! పోతే... 'ఆశ్రమం' ఎక్కడో కాక మన మనస్సే,ఇల్లే అందుకు నిలయంగా వుండాలి! ఆ వివరం మరోసారి తెల్సుకుందాం!



# 94

# రంగులు-అభిరుచులు!

ఒక్కొక్కరికి ఒక్కోరకమైన అభిరుచి వుంటుంది! రంగుల్లో కూడా అంతే! కొందరికి ముదురు రంగులు - కొందరికి లేతరంగులు - ఇంకా కొందరికి కలగలుపు రంగులు - ఇష్టమవుతూ వుంటాయి!

అసలు ప్రకృతిలో వున్నవి ఏడురంగులే! ఈ సప్తవర్ణాలవల్లే సృష్టి యావత్తు శోభాయమానంగా - ఆహ్లాదంగా కనిపిస్తుంది! వైలెట్, ముదురు నీలం, ఆకాశవర్ణం, ఆకుపచ్చ, పసుపురంగు, ఆరెంజ్. ఎరుపు - ఈ రంగు మూలమైనవి! వీటినుంచి అనేక రంగులు మనం తయారు చేసుకుంటున్నాం.

ఒక్కొక్క రంగుకి ఒక్కొక్క ఫలితం - అర్థం వుంటుందని పురాణ గ్రంథాల్లో ఉద్ఘాటించేరు. సమయాన్ని బట్టీ - సందర్భాన్ని బట్టీ ఆయా రంగులు ఉపయోగిస్తే సత్ఫలితాలిస్తాయి. పండుగ దినాల్లో గడపలకి పసుపు, గుమ్మాలకి తోరణాలు, ఇంట్లో రంగవల్లులు దిద్దుకుంటాం. వివాహాది శుభకార్యాలలోనూ, సంతోష సమయాలలోనూ, నిండైన రంగులున్న దుస్తులు ధరిస్తాం. అలా ధరించటం వలన శోభస్కరమే కాక, ఆ రంగుల అధిపతులు (విజ్ఞానపరంగా చెప్పాలంటే - వాటి ఎఫెక్ట్) ఆశీర్వదిస్తారు.

అసలు రంగులన్నీ వెలుగులోనే వున్నాయి. పంచభూతాలలో అవి మనకి కనిపిస్తూ వుంటాయి. ఇకపోతే ప్రకృతిలోని చెట్టు, నీరు, భూమి, కొండలు, సూర్యాస్తమయం, సూర్యోదయం - ఇవన్నీ రంగుల బారులే! అలాగే... ప్రపంచం అంతా రంగులమయమే! ప్రతివస్తువు - అంటే... తినే ఆహారం దగ్గరనుంచి,

దుస్తులు, వస్తువులు, అన్నీ రంగురంగుల కలయిక వల్లనే మనం సవ్యంగా జీవించగల్గుతున్నాం !! ఇందులో ఆశ్చర్యం ఏమీలేదు.

ఒకవేళ ఏదైనా ఒకేరంగు సర్వత్రా నిండివుంటే ఆ రంగుయొక్క ఫలితం (రియాక్షన్) మన మీద ప్రభావితమవుతుంది. అంతేకాదు - సమయాన్ని బట్టీ, సందర్భాన్ని బట్టీ కూడా దాని శాతం మనమీద పడుతుంది. ఎర్రని ఎండలో, ఎరుపురంగు దుస్తులు ధరిస్తే, మన కళ్ళు మిరుమిట్లు గొలిపి పిచ్చెక్కినట్టు అవుతుంది. అలాగే ఇల్లంతా వైలెటో, ఆరంజో, రంగుగల వస్తువులతో నింపితే మనం ఎక్కువ కాలం ఇంట్లో వుండలేం.

· అంటే... ఆ రంగుయొక్క ప్రభావం మనమీద సూటిగా పడి ఎక్కువగా మనల్ని ఆకట్టుకుంటుంది. అలాకాక రకరకాల రంగుల్లో అలంకరించుకుంటే అన్ని రంగుల ప్రభావం మనల్ని సమానంగా ఆకర్షించడం వలన మనం మన శక్తిని కోల్పోకుండా మనగల్గుతాం.

ఇలా ప్రకృతిలోని సప్తవర్ణాలు, ప్రతిక్షణం, మన ఆహార పదార్థాల మీద, మన దుస్తుల మీద పడి మనకి అనుభూతమవుతూనే వుంటాయి! వాటికి తగిన విధంగా మనం వస్త్రాలంకరణ, మిగతా విషయాల్లో వుండగల్గాలి.

అన్ని రంగులు అన్ని వేళల్లో కనిపించక కలిసిపోయి స్వచ్ఛమైన ధవళ వర్ణమే కనిపిస్తుంది. అది పరమాత్మ తత్త్వం !! ఆ శ్వేతవర్ణం ఎవరికీ ఏవిధమైన హానిచేయదు! ప్రత్యేకించి శుభమూ కల్గించదు. ఏకత్వమై మనసుకి నిర్మలంగా, ప్రశాంతంగా వుంటుంది. అందుకే వివాహంలో వధూవరులకి మధుపర్కాలు - తెల్లవే కట్టిస్తారు. సేవాభావంగల నర్సులు శ్వేత వస్త్రాలే ధరిస్తారు. చివరకి - తుది ప్రయాణంలో తెల్లబట్టలే ఉపయోగిస్తారు. దీనిలోని సత్యం ఒకటే. మంచికైనా, చెడుకైనా ధవళత్వం పవిత్రమై పరమాత్మని చేరుకోవటం. శుభాశుభాలు, మానవుడి భావాలు. రంగులన్నీ విడిపోతే ప్రకృతి! మళ్ళీ రంగులన్నీ కలసిపోతే - పరమాత్మ. దీని అర్థం గ్రహించగల్గితే మనం, మన అభిరుచులు, రంగుల్లోని తత్వాన్ని గ్రహించి ధన్యులం కాగలం!!






# ప్రయాణాలు !

ఒక్కొక్కరు సంవత్సరాల తరబడి ఉన్న ఊరు కానీ, ఇల్లుకానీ, వదిలి బయటికి వెళ్ళరు! మరికొందరు అస్తమానం ఊళ్ళకి వెళ్ళి వస్తూనే వుంటారు. ఇలా ఉన్నచోట నుంచి మరొక ప్రదేశానికి వెళ్ళే మధ్యకాలమే 'ప్రయాణం' అని అంటాం. ఇక్కడ సమయంతో పాటు మనం మరొక చోటుకి చేరటం కూడా జరుగుతుంది.

అంటే... 'ప్రయాణం' అనే చర్యలో కాలం గడచిపోతూ, మనం మరొక ప్రదేశానికి మారటం - ఈ రెండూ వుంటాయి.

ఆ తర్వాత ప్రతినిత్యం మనం ఎన్నో చోట్లకి తిరుగుతూ, వస్తూ వుంటాం. మార్కెటుకీ, షాపింగుకీ, ఆఫీసుకీ, ఇరుగు పొరుగు ఇళ్ళకీ! ఇలా వెళ్ళి వచ్చే ప్రతీసారీ 'ప్రయాణం' అవదు.

అవసరాలకోసం కొందరూ, సరదా కోసం కొందరూ ప్రయాణాలు చేస్తారు. బంధువుల ఇళ్ళకి వెళ్ళేవారు వారికి కావల్సినవన్నీ అక్కడ తీసుకోగలరు. ఏ ఆఫీసు పనిమీదో, మరొకరి పనిమీదో ఊరికి వెళ్ళాల్సి వుంటుంది. అప్పుడు వారికి కావాల్సిన వస్తువులు అన్నీ వెంట తీసుకెళ్ళవలసి వుంటుంది. అందుకే ప్రయాణ వస్తువులు - అంటే... పెట్టెలు (సూట్‌కేసులు) బెడ్డింగ్‌లు, నీళ్ళ చెంబులు, ఫ్లాస్కులు, బుట్టలు, సంచులు, హేండ్ బ్యాగులు - ఇలాంటివన్నీ వస్తు సముదాయాన్ని పెట్టుకుందుకు ఉపయోగిస్తారు. ఆ పైన దూరాన్ని బట్టి విమానం, ఓడ, రైలు, బస్సు, కార్లు, ఆటోలు, స్కూటర్లు -

ప్రయాణ సాధనాలుగా ఎన్నుకుంటారు. అంటే... ప్రయాణం కోసం వాహనాలు, వస్తువులు, సామాన్లు అవసరం అవుతాయి.

ఈ ప్రయాణాల్లో కొందరు తిండికోసం ఎంతో ఆరాటపడతారు. టిఫిన్ కారియర్ల నిండా తినుబండారాలు. బుట్టల్నిండా పళ్ళూ, బిస్కట్లూ వగైరాలు - ఫ్లాస్కులో కాఫీలో . : . చిన్న పిల్లలుంటే . . . రకరకాలైన పానీయాలు . . . ఇలా సామాన్లు మోపెడు చేసుకుంటారు. దారి పొడుగునా . . . తింటూనే వుండి- కొంటూనే వుండి సామాన్లు లెక్క పెట్టుకోవటంతోనే సరిపోతుంది. మరికొందరు - పుస్తకాలు, పత్రికలు కొని చదువుతూ వుంటారు. ఇంకొందరు కిటికీల దగ్గర, గుమ్మాల వద్ద (ఎంట్రెన్స్ వద్ద) నిలబడి ప్రకృతి చూస్తూనే వుంటారు. ఇక కొందరు పక్కవాళ్ళతో తెగ కబుర్లు చెప్తూ ప్రయాణం పొడుగునా ఎన్నో విషయాలు చెప్తారు. ఇక, మౌనంగా కూర్చుని అందర్నీ గమనిస్తూ కూర్చునే వారు కొందరు.

ఎన్నో విధాలైన మనుషులూ, మనస్తత్వాలూ ప్రయాణాల్లో చూస్తూ వుంటాం. స్టేషన్లో (బస్సుహాల్ట్) వచ్చినపుడు దిగేవారు కొందరూ, ఎక్కేవారు కొందరూ, చివరికి వాహనంలో మిగిలేవారు ఎవరూ వుండరు. కాని, వారు ప్రోది చేసుకున్న అనుభవాలు . . . సరదాలు వారికి మిగిలి, వారు చేసిన నానా కంగాళీ . . . గంద్రగోళం, చెత్తాచెదారాలు వాహనాల నిండా మిగులుతాయి.

ఈ ప్రయాణాలు కేవలం ఈ ప్రపంచంలోని ఊళ్ళు, దేశాలు, ఖండాలు. . . తిరిగేవి! కానీ... మానవజన్మే ఒక ప్రయాణం. ఎక్కడినుంచి వస్తామో . . . మళ్ళీ అక్కడికే వెళ్తాం. మన ఆయు: ప్రమాణమే . . . ప్రయాణ కాలం. మనం పడే తాపత్రయాలన్నీ చివరగా వదలివెళ్ళే గందరగోళాలు!! చేసిన పనులు . . . అనుభూతులైనా (సంచితాలే) వెంటవస్తాయి. తెచ్చుకున్న సామాన్లు (ప్రారబ్దాలు) ప్రయాణం పొడుగునా (జీవితమంతా) ఖర్చు అవుతాయి. మన మనఃస్థితిని బట్టే జీవితంలో ఏ పనైనా చేస్తుంటాం. జిజ్ఞాసువులు . . కూర్చుని ప్రయాణాన్ని గురించి, మనుషుల్నీ ఆలోచించి అర్థం చేసుకోవాలనుకుంటారు!

ప్రయాణాలంటే . . . మన జీవితాలే అని గ్రహించగల్గితే . . అదే తరింపు !! ప్రయాణం సుఖంగా జరిగినట్టే !!!





# చిద్విలాసం !

అర్ధ నిమీలిత నేత్రాలతో, విడీవిడని పెదవులతో, ప్రశాంతంగా వుండే ఈశ్వరరూపం చూడగానే రెండు చేతుతూ జోడించి నమస్కారం చేస్తాం! (నూటికి తొంభైమంది)

ఎందుకనీ?

ఆ రూపం అటువంటిది! ఆ భంగిమలోని ఆకర్షణ అలాంటిది !! అదే... చిద్విలాసం!!!

అంటే... ఏ విధమైన కలతలు - ఆలోచనలు లేని ప్రశాంతతే చిద్విలాసం ! చిత్తమందు విలాసం తప్ప విషాదం లేని రూపమే చిద్విలాస రూపం. ఇక్కడ చిత్తమందు అన్నప్పుడు - ప్రాపంచికమైన అని భావించుకోవాలి. ఎందుకంటే... భగవంతునికి ప్రపంచ చింతలుండవు కదా? బాధలు బెంగలు ఉండవు కదా? అసలు చిత్తం ఎప్పుడూ, నిర్వికారం గానే వుంటుంది. కనుక ఆ స్థితి- 'చిద్విలాసం' అనాలి!

సాధారణంగా మనం ఎవరైనా ఆనందంగా, హాయిగా వుంటే - 'ఏమిటీ... ఆ చిద్విలాసం?' అంటాం. అలాగే విలాస పురుషుల్ని (స్త్రీలని) కులాసా రాయుళ్ళని చూసి -'చిద్విలాస పురుషులు వాళ్ళకేం? చింతా- చీకా?' అంటాం!

కానీ... ఇది సరికాదు!

'చిద్విలాసం' అనేది కష్టాలు లేని సమయంలో వుండే ఆనందానికి చిహ్నం కాదు! బాధ్యతలు తీరేక పొందే తృప్తి కాదు! ఒకప్పుడు బాధ, మరొకప్పుడు ఆనందం పొందే మానవుణ్ణి, అతడి స్థితినీ - చిద్విలాసం అనకూడదు.

మరి ఏమిటి?

పసిపిల్లలు నవ్వుతారు - అమాయకంగా చూస్తారు . . . . కులాసాగా ఆడుకుంటారు. అదిగో, అదీ . . . చిద్విలాసం !!

ఇంట్లో కొండంత దు:ఖం వున్నా, బోలెడు సంతోషం జరుగుతున్నా వాళ్ళకి తెలియదు. శరీరం మీద విలువైన దుస్తులున్నా, ఆభరణాలు వున్నా వాళ్ళకి అక్కర్లేదు. వాటి అనుభూతి వాళ్ళకి పట్టదు. నోట్లకట్ట చేతిలో పెట్టినా అవి లాగేసి చిళ్ళపెంకులు పెట్టినా, బోసినవ్వే నవ్వుతారు..

అదే! అదే! చిద్విలాసం!!

చిత్తానికి ఏమీ పట్టని, పట్టించుకోని బ్రహ్మానంద స్థితిని 'చిద్విలాసం' అనాలి!

వ్యాపారంలో బోలెడు లాభం కల్గిందని తెగ సంబరపడిపోతూ పార్టీలు చేసుకోవడం చిద్విలాసం కాదు. రిటైర్ అయి, యాత్రలు చేసుకుని, 'హమ్మయ్యా... బాధ్యతలు తీరే'యన్న తృప్తిలో ఊపిరి తీసుకోవడం చిద్విలాసమా?

మరి ఎవరూ చిద్విలాసులు కాదా?... అన్న సందేహం కల్గుతుంది! నిజమే! వున్నారు. ఎవ్వరైతే కష్టాల్లో సైతం క్రుంగిపోకుండా చిత్తానికి పట్టించుకోకుండా తామరాకు మీద నీటి బిందువులా వుండగల్గుతారో వారే చిద్విలాసం చిందించగలరు.

గళమందు గరళం నిండివున్నా - ముఖమందు అమృతం (మృతిలేని) చిందుతూ వుండే ఆ ఈశుడు, మానవుడి బోధ చేసే సత్యమే, చిద్విలాసానికి నిర్వచనం !

మరొక విషయం ఏమంటే - ఆత్మానందం పొందేవాళ్ళు కులాసాగా నవ్వుముఖంతోనే వుంటారు. కానీ ఆ ఆత్మానందం తన సుఖం తను చూసుకోవడంలో కాకూడదు. ఏదో మత్తు పదార్థాలు సేవించి, తప్పతాగి, బాధ్యతలు మరచి పోవాలనుకునే వారు వుంటారు. అలాంటి 'ముసుగులు' చిద్విలాసం అవదు.

జన్మించిన ప్రతిప్రాణి ఏదో కర్మ అనుభవించాల్సే వుంటుంది. కనుక ఆ సత్యం గుర్తుంచుకొని అద్దంలో ప్రతిబింబం ఎలా మనిషి రూపానికి సాక్ష్యంగా నిలబడి వుంటుందో - ఆ విధంగా మానవుడు సుఖ దు:ఖాలకి అతీతుడైనప్పుడు 'చిద్విలాసం' చిందించగలడు!



97

# సంగీతసారం!

నిశ్శబ్దంగా వున్న సమయంలో ఎక్కడి నుండైనా ఒక శబ్దం వినిపిస్తే - మనం వెంటనే అటువైపుగా దృష్టి సారించి చెవులు నిక్కబొడిచి వింటాం! నిర్జన ప్రదేశంలో మనిషి ఒంటరిగా వుండలేడు. మరొక తోడు లేదా శబ్దం - ధ్వని కోసం వెతుకులాడుతాడు !

ఈ ధ్వని లేదా శబ్దం- శ్రుతి లయలతో, అర్థవంతమైన రాగంగా వుంటే మనిషి మరింత శ్రద్ధగా, సంతోషంగా వింటాడు. సాధారణంగా సంగీతం ఇష్టపడని మానవులు వుండరు. మనిషే కాదు, పాములు, గోవులు, పక్షులు, ఇతరత్రా జంతువులు కూడా గానం విని పరవశిస్తూ వుంటాయి.

జీవులకీ, గానానికీ అవినాభావ సంబంధం వుంది! అంతేకాదు-ఆ గానం అపశ్రుతి కాకుండా వుండాలి. పసిపిల్లలు లాలి పాట వింటూ ఏడుపు, ఆకలి మరచిపోతారు. నిద్రపోతారు. ఒకవేళ పాట వరస బాగులేక అపశ్రుతితో పాడితే వాళ్ళు ఏడుస్తూనే వుంటారు. సరిగా వినరు.

అలాగే, పాములు కూడా నాగస్వరం లయబద్ధంగా వుంటేనే పడగ విప్పి ఆడతాయి; లేకపోతే మధ్యలో బుసకొట్టి, కాటువేస్తాయి.

పక్షులు, జంతువులు మూగవే అయినా తమ ఆనందాన్ని గొంతువిప్పి అరుపుల ద్వారా (ధ్వని ద్వారా) వ్యక్తం చేస్తాయి.

ఇక - మానవజాతికి సంగీతం అనేక విధాల ఉపయోగపడుతుంది. ప్రతి కార్యక్రమం సంగీతంతో కూడుకునే వుంటుంది. మొదటి దినచర్యలో దైవ ప్రార్థన, తర్వాత పేరంటాలలో ప్రార్థన

గీతం - సభా కార్యక్రమాలలో ప్రారంభ గీతం, శుభ కార్యక్రమాలలో మంగళ హారతులు, ఆశీస్సులు, వ్రతాలు, నోములు, పూజాది కార్యక్రమాలలో భజన కీర్తనలు, దైవకృతులు... ఇలాగ మనిషికి సంగీతం నిత్య జీవితంలో ఎన్నో విధాల అనుసంధించబడి వుంది!

మనం విచారంగా వున్నా, దు:ఖంలో వున్నా పాట వింటున్నప్పుడు - కొంత బాధ మరచి పోతాం! ఏకాంతంలో వుండి సంగీత సాధన చేస్తే - చిత్తశుద్ధి కల్గుతుంది. కొన్ని కొన్ని రోగాలకి సంగీతం ద్వారా నివారణ కూడా జరుగుతుంది.

అంతేకాదు, కొన్ని రకాల చెట్లు సంగీతం వింటూవుంటే బాగా ఎదుగుతాయని పరిశోధకులు చెప్తున్నారు ! మన ఇళ్ళలో దూరదర్శన్, ఆకాశవాణిలో పాటలు వస్తుంటాయి. వాటి ప్రక్కగా (మనీప్లాంట్) తీగలత వుంటే బాగా పెరుగుతుందని అనుభవంతో చెప్తున్నవారూ వున్నారు.

అంటే - చెట్టుకు కూడా సంగీతం ఇష్టమే... అని తెలుస్తోంది. భజన కార్యక్రమాలలో - భక్తులు చాలామంది తన్మయావస్థకి లోనవుతుంటారు. ఏక కాలమందు అనేకుల్ని ఒకే స్థితికి చేర్చగల మహత్తర శక్తి సంగీతానికే వుంది!

భక్తులు సంగీతం ద్వారా పరమార్థం పొందేరని మనకి ప్రత్యక్ష నిదర్శనాల వల్ల తెలుస్తుంది. త్యాగరాజు, అన్నమాచార్య, రామదాసు, కబీర్, మీరా - మొదలైన భక్తాగ్రేసరులకి సంగీతం ఒక మహాప్రసాదం. తద్వారా వారు లోకాన్ని కూడా తరింపజేశారు.

భక్తునికీ, భగవంతునికీ మధ్య వారధి సంగీతం !

"త్రివర్గ ఫలదాస్సర్వే దాన యజ్ఞ జపాదయః

ఏకం సంగీత విజ్ఞానం చతుర్వర్గ ఫలప్రదం" అని శాస్త్రం చెపుతుంది.

దానము, యజ్ఞము, జపము మొదలగునవి ధర్మము, అర్థము (ధనం), కామము అనే మూడు పురుషార్థములని మాత్రమే సాధించగలవు. కానీ, సంగీతం వలన నాల్గవ పురుషార్థమైన 'మోక్షం' కూడా సాధ్యమని తాత్పర్యం!

సంగీతం! మానవునికి పవిత్రతని, తేజస్సును కలుగజేస్తుంది!! అందుచేత సంగీతాన్ని ఎప్పుడూ సద్వినియోగానికే ఉపయోగించాలి !!



# 98

## కృత్రిమం !!

సృష్టిలో కొన్ని ఎవరి ప్రమేయం లేకుండా స్వయంగా ప్రకాశించే శక్తులు... వస్తువులు... వుంటాయి. అవి ఒక్కోసారి మానవుడికి అందుబాటులో లేనప్పుడు మనిషి తాత్కాలికమైన ఏర్పాటు చేసుకుని, అవసరాన్ని గడుపుకుంటాడు. అంటే- సహజంగా లేనప్పుడు అవసరం కోసం వేరే ఏర్పాటు చేసుకునే విధానం వుంటుంది. అదే 'కృత్రిమం'.

మనిషికి జన్మించింది మొదలు చివరి దశ వరకు అనేక అవసరాలూ, అలవాట్లూ, అనుభవాలూ జరుగుతూనే వుంటాయి. అందులో ఎప్పుడైనా, ఏదైనా సహజత్వం లోపించినట్లైతే మనిషి వెంటనే మరొక ఏర్పాటు చేసుకునైనా ఆ అవసరం లేదా అలవాటు పూర్తి చేసుకుంటాడు.

కళ్ళు కనిపించక పోతే కళ్ళకి అద్దాలు పెట్టుకుంటాం. చెవులు వినిపించక పోతే (హియరింగ్ ఎయిడ్) యంత్రం ఉపయోగించుకుంటున్నాం. నోటిలో పళ్ళు (పల్లు) ఊడిపోతే కట్టుడు పళ్ళు పెట్టుకుంటాం! తల వెంట్రుకలు నెరిస్తే (తెల్లబడితే) రంగువేసుకుని నల్లగా వుండేలా చూసుకుంటున్నాం. అలాగే అంగవైకల్యం కలిగితే ... శస్త్రచికిత్సలు (ఆపరేషన్లు), మార్పిడి పద్ధతులు - చేసుకుంటున్నాం. ఇవన్నీ కృత్రిమాలే!

చల్లని గాలి వీచకపోతే - ఫ్యాన్లు ఉపయోగించుకుంటాం! పగటి పూట వుండే వెలుగు రాత్రిపూట వుండదు గనుక లైట్లు వెలిగించుకుంటాం!

వాస్తవానికి బదులుగా మనం అనేక కృత్రిమ ఏర్పాట్లు చేసుకుంటూ జీవితానికి అంతరాయం ఏర్పడకుండా మనుగడ సాగిస్తున్నాం. అంతవరకు మనిషి అభినందనీయుడు.

కానీ, బాహ్యానికి మించి అంతర్గతంగా వుండే గుణ సంపత్తిని కూడా మానవుడు కృత్రిమంగా చేసేసుకుంటున్నాడు. ఇది చాలా దురదృష్టం. నాటకాలలో, చిత్రసీమలో నటించి మెప్పు పొందటంలో కొంత అర్థం వుంది. ఆ నటన ప్రజా రంజితం చేస్తుంది. కనుక ఒక ప్రయోజనం సిద్ధించుకుంటుంది. కానీ, నిజజీవితంలో ఎదుట బాగా మాట్లాడి, వెనుక గోతులు త్రవ్వే రకాలూ... మాట ఇచ్చి మోసం చేసేవాళ్ళూ ... తిన్న ఇంట్లోనే, హాని తలపెట్టేవాళ్ళూ... కృత్రిమంలో మునిగిపోతున్న రకాలు!

నర్సులు రోగికి సేవ చేస్తూ, ఎంతో ప్రేమని, దయని చూపిస్తూ- 'ఇంక రోగం తగ్గిపోతుం'దన్నట్టుగా ధైర్యం చెప్తూ వుంటారు. దీనివల్ల రోగి త్వరగా కోలుకునేందుకు వీలు కల్గుతుంది. అంటే- ఈ నటనలో (నిజంగా వాళ్ళకి దయాగుణం వుంటే మంచిదే) పరోపకారగుణం వుంది గనుక అది పరమార్థమే! కానీ, చెడుపు చేసే ఉద్దేశ్యంతో చేసే నటనలు కృత్రిమంలో కూడా నీచమైనవి. స్వార్థంతో మనిషి చేసే కృత్రిమ అలంకరణలో కొంత నేరం వుంది!

గాజుతొట్లలో (ఎక్వేరియం) చేపలు పెంచి ఆనందిస్తాం!! కానీ, ఈ కృత్రిమ పోషణలో చేపలు సహజత్వం కోల్పోయి వేదనపడుతాయి! ఆవుల్నీ, గేదెల్ని మోసం చేయడం కోసం గడ్డితో దూడని చేసి (చాటపెయ్య) దాని ఎదుట పెట్టి, పాలు తీసుకుంటాం. మనం చేసే ఈ కృత్రిమంలో మోసం వుంది.

ఈనాడు సగటు మనిషి - సహజత్వం తానే కోల్పోయి, కృత్రిమ జీవనానికి అలవాటు పడిపోతున్నాడు. ఇంటా, బయటా, మనసులో కూడా ఈ కృత్రిమం నిండిపోయి, వాతావరణం యావత్తు కృత్రిమమే అయిపోతున్న రోజులివి!

వాస్తవానికి దూరంగా బ్రతుకుతున్న మనం - చీకట్లో నడుస్తున్న వాళ్ళతో సమానం. ఎంత త్వరగా వెలుగువైపు రాగల్గితే - అంత మంచిది! అందుకు ప్రయత్నించాలి !!





# శరణాగతి ? !

రక్షణ కోరి రావడమే శరణాగతి!

తనకు అసాధ్యమైనది లేదా లభ్యంకానిది కోరటం, ఒక రకమైన శరణు! అపాయాలలోనూ, ఆపదలోనూ సహాయం కోరటం మరొక రకమైన శరణు! సాధారణంగా ఈ రెండు విషయాల్లో కూడా శరణు కోరే వాడు తనకన్నా పై స్థాయిలో వున్నవాడినే- అనగా... తనకి రక్షణ ఇవ్వగల సామర్థ్యం వున్నవాడినే శరణు కోరుతాడు.

ఒక వేళ సామర్థ్యం లేని వాణ్ణి రక్షణ కోరినా... లేక - అభయం ఇస్తానన్నవాడు రక్షించలేక పోయినా... కోరినవాడూ, ఇచ్చేవాడూ ఇద్దరూ కర్తవ్యహీనులే అవుతారు!

ఏ మనిషైనా కోరుకున్నది జరగాలంటే కొంత వాడి పూర్వజన్మ ఫలకృతం కూడా వుండాలి. నమ్మినా, నమ్మకపోయినా - ప్రతివాళ్ళకి కొన్ని మాత్రమే జరుగుతూ వుంటాయి. అందుచేత జరగ[illegible] వాటి మీదే మనిషికి మోజు ఎక్కువ! ఆకాంక్ష ఎక్కువ! అందుకని మనిషి ఎప్పుడూ తనకి కావా[illegible] కున్నది ఇతరుల ద్వారా పొందాలని చూస్తాడు. అతడే శరణాగతుడు.

అయితే - మనుషుల్ని శరణుకోరే కన్నా, జన్మకారకుడైన భగవంతుని శరణు వేడితే మన యోగ క్షేమాలన్నీ అతడే చూసుకుంటాడు. ఈ విధమైన శరణాగతునికి అసాధ్యమైనదే వుండదు. నిశ్చింత!

తల్లి చంకలో బిడ్డకి బాధేమిటి? ఎంతదూరమైనా నిశ్చింతగా వెళ్ళగలదు!

రైలు పెట్టెలో కూర్చున్న వాడికి ఎంతదూరం ప్రయాణించినా, ఎంత బరువు తీసుకు వెళ్ళినా అలసట వుంటుందా? అలాగే- భగవంతుని శరణాగతి కోరేవాడికి ప్రాపంచిక చింతలు, బాధలు వుండవు. అయితే - పూర్తిగా నమ్మాలి. తను ఎవరి మీద భరోసా వుంచుతున్నాడో - వారియందు పూర్తి నమ్మకం వుంటేనే నిశ్చింతగా వుండగలడు!

పనిమీద బయటికి వెళ్ళే తల్లి - ఇంటి కాపలా వుంచి వెళ్ళిందనుకోండి. అప్పుడు మనకి ఇంటిమీదే ధ్యాస వుంటుంది. తిరిగి తల్లి వచ్చేస్తే ఇక మనకి ఎంత బరువు తగ్గిపోయినట్లో అనిపిస్తుంది కదా? ఇక ఇంటి సంగతే పట్టించుకోము! 'అంతా అమ్మే చూసుకుంటుందిలే' అనుకుంటాం!

ఆ విధమైన దృఢనమ్మకం మనకి భగవంతుని యందు కల్గి శరణాగతి పొందితే ఇక మనము చూసుకోవలసిందేమీ వుండదని భక్తులు - యోగులు - మునివర్యులు - తమ అనుభవంతో వక్కాణించేరు. ప్రహ్లాదుడి నమ్మకమే - స్తంభం నుంచి లక్ష్మీనరసింహ స్వామిని ఆవిర్భవింపజేసింది.

దీనినే భక్తి ప్రపత్తులు అంటారు. అంతటి భక్తి వుంటే సర్వం జయించగలరు. పనికి మాలిన సామాన్య మానవుణ్ణి కాక - సర్వ సమర్థుడైన భగవంతుని వేడుకోవటమే మానవుడి ధర్మం.

ఇటువంటి శరణార్తికి రెండు రకాల ఫలితాలు ప్రాప్తమవుతాయి. ఒకటి... ఐహికమైనవి ద్ధించడం, రెండవది... మోక్షప్రాప్తి!

ఒక దరిద్రుడు రాజుగార్ని ధనం అడుగుదామని వెళ్ళాడు. ఆ రాజుగారు తనకింకా రాజ్యం, సకల సంపదలు కావాలని భగవంతుని గూర్చి తపస్సు చేస్తూ వుంటాడుట. అది చూసి దరిద్రుడు 'రాజుగారే - యాచన చేస్తున్నాడు. నేను ఇక ఆయన్ని కోరటమేమి'టని తిరిగి వెళ్ళి తను కూడా ఆ భగవంతుణ్ణే వేడుకుంటాడు. కనుక శరణాగతుడు - తగినవాణ్ణి చూసుకోవాలి. ఎన్ని కోరికలు తీరినా ఇంకా మిగిలే వుంటాయి గనుక - అన్ని కోరికలు తీర్చగలవాడు ఆ పరాత్పరుడే -అని నమ్మి అతనిని వరణు వేడినవాడు -

"ఆయురారోగ్య మర్థాంశ్చ భోగం శ్చైవానుషంగికాన్

దదాతి ధ్యాయతాం నిత్యమపవర్గ ప్రదోహరి:" - అని ఆర్యోక్తి !

ప్రసన్నుని యోగక్షేమాలన్నీ ప్రత్యేకించి అడగక్కర్లేకుండా దేవుడే సమకూర్చుతాడని సారాంశం!!





# నిముషం - యుగం!

మనకి కాలమానం తెలియాలంటే గడియారం చూసుకుంటాం! పగటికి, రాత్రికి పనులు నిర్ణయించుకుని ఆ పనులకి కాలం ప్రత్యేకించుకుని బ్రతుకుతున్నాం! కనుకనే (టైం) సమయం చాలదని పరుగులు పెడ్తుంటాం!

చిన్నతనం, నడివయస్సు, వృద్ధాప్యం అనే దశలు జీవితంలో ఎలా వున్నాయో అలాగే కాలమానానికి సెకండ్లు, నిముషాలు, గంటలు, రోజులు, వారాలు, మాసాలు, సంవత్సరాలు, దశాబ్దాలు, పుష్కరాలు, అర్ధశతాబ్ది, శతాబ్ది... ఇంకా ఇంకా ముందుకు వెళ్ళి 'యుగం' అంటాం! దీనిని బట్టి నిముషం- యుగం మధ్య ఎంత దూరం వుందో అర్థం అవుతుంది మనకి!

నిజానికి- సెకండు నిముషం కన్నా చిన్నది. అయినా మనం వాడుకలో నిముషం అనే ఎక్కు ఉపయోగిస్తాం. 'లిప్తకాలం' అంటే... కనురెప్ప ఒకసారి మూసి తెరిచినంత సమయం. ఒక సెకండు! దానిని 'క్షణం' అని కూడా అంటాం! క్షణం లేదా నిముషం అనే పదాలు మనం తరచుగా ఉపయోగిస్తూ వుంటాము.

'ఇదిగో! ఇప్పుడే క్షణంలో వస్తా' అని చెప్తారు. నిజానికి- వెళ్లిరావడమనేది క్షణంలో అవదు కానీ... తొందరగా వస్తానని చెప్పే సంకేతం 'క్షణం'. అలాగే 'నిముషంలో చేయాలి!' అంటాం!

ఈ విధంగా త్వరగా చేయవలసిన పనులకి క్షణాలు, నిముషాలు ఉపయోగించిన ఆలస్యమయ్యే పనులకి 'అబ్బ... గంటలు గంటలు చేస్తావేం?' అనో, 'అమ్మో నీతో పెట్టుకుం యుగాలు దాటిపోతాయి' అనో అంటాం.

యుగం అంటే మాటలా? ఎన్ని జన్మలు, ఎన్ని అవతారాలు, వంశాలు దాటిపోతాయో? అందుకని - చాలా ఆలస్యమవుతుందని చెప్పటానికి 'యుగం' ఉపయోగిస్తాం.

మనం కష్టంలో వున్నా, ఏదైనా బాధ అనుభవిస్తున్నా ఆ సమయం చాలా దీర్ఘంగా సాగుతున్నట్టూ, ఎప్పటికీ పూర్తి అవదన్నట్టూ భావిస్తాం! అలాగే, సంతోషం, సుఖం కల్గినప్పుడు ఆ కాలం చాలా త్వరగా గడిచిపోయినట్టు తలుస్తాం.

ప్రేమికులకి సమయం చాలా త్వరగా గడిచిపోతుంది. అదే- విరహం అనుభవించేటప్పుడు కాలం ఆగిపోయిందేమో... అనుకున్నంత బాధ పడుతారు. నిజానికి- కాలం ఎప్పుడూ ఒకలాగే వుంటుంది. మానవులు తయారుచేసుకున్న గడియారం సరిగా నడవక పోవచ్చునేమో గానీ, సూర్యుని ప్రయాణం ఒక 'లిప్త' కూడా ఆగదు. ప్రపంచానికి అంతా పెద్ద గడియారం అతను.

మరి- ఈ భేదం మనకి ఎందుకు వస్తోంది? అంటే... మనోభావాలకీ, కాలమానానికీ మధ్య వున్న భేదం అది. మనస్సు మీద ఆధారపడ్డ సుఖదు:ఖాలు కాలమానాన్ని తప్పుగా కొలుస్తుంటాయి.

'ఐన్‌స్టీన్' 'రిలెటివిటీ' సిద్ధాంతం వర్ణిస్తున్నప్పుడు సంతోషానికి, బాధకి తేడా వర్ణించి ఇలా చెప్తాడు

'ఒక అందమైన అమ్మాయి నీ వొడిలో ఒక గంట వుంటే అది కేవలం ఒక నిముషం లాగ అనిపిస్తుంది. అదే నీవు మండుతున్న స్టవ్‌మీద ఒక్క నిముషం కూర్చుంటే (ఒకవేళ చేయి పెడ్తే) ఒక గంటలాగ అనిపిస్తుంది!'

మనం కూడా బస్టాండులో నిల్చున్నప్పుడు ఏదైనా బంధువుల గురించిన వార్త వినాలనే ఆత్రుతతో వున్నప్పుడు నిముషం యుగంలాగ అనిపిస్తుంది. పరీక్షలు ప్యాసైనప్పుడూ, పార్టీలలో ఆనందించేటప్పుడు గంటలైనా నిముషంలాగ గడిచిపోతాయి.

అందుకే - దేవతలు ఎప్పుడూ సుఖపడతారు గనుక వారు యుగయుగాలు వుంటారన్న మాట. మానవుడు, ఇతర జీవరాసులు అల్పులు గనుక వీరికి కొన్ని సంవత్సరాలే పరిమితి వుంటుంది.

కానీ- మెరుపు, కాంతి, జ్యోతి, శబ్దంలాంటి దైవశక్తులు తక్కువ సమయంలో ఎక్కువ నిలుస్తాయి. మానవుడు ఆ సత్యం తెలుసుకుని కాలం సద్వినియోగం చేసుకోవాలి.



**SPANDANA by VEDULA SHAKUNTALA**

# వేదుల శకుంతల



తూర్పుగోదావరి జిల్లా ద్రాక్షారామంలో సాహితీ తరగల గోదావరి పరవడి నవ్వడిగా జన్మించిన **శ్రీమతి వేదుల శకుంతల** గారి విద్యాభ్యాసం తెలంగాణా లోని ఖమ్మం, వరంగల్‌లలో పూర్తయింది. అనన్య ప్రతిభతో సాహిత్యాశ్రమంలో అడుగిడిన శకుంతల గారి రచనలు 1964 నుండి ప్రచురింపబడుతున్నాయి.

'సాహిత్య వ్యవసాయి' గా తన కలాన్ని హాలంగా చేసి ముప్ఫై ఏడు సంవత్సరాలుగా సాహిత్యాభిమానులకు శకుంతల గారు అందించిన సారస్వత ఫలాల వివరాలు :

100 కి పైగా కథలు, 20 నవలలు, 10 నాటకాలు (వినాయక చవితి, పందిరి పిచ్చుకలు, రెండిళ్ళు - నాలుగు వాకిళ్ళు, వికసిత కుసుమాలు మొ॥వి 'ఆకాశవాణి' ద్వారా - ఉదయకిరణాలు, మేలుకొలుపు, కనువిప్పు మొ॥వి 'అమృతవాణి' ద్వారా 'మనీలా' స్టేషన్‌లో ప్రసారమయ్యాయి) 700 వ్యాసాలు (కృష్ణాపత్రికలో మహిళా పేజీ నిర్వాహకురాలిగా 'స్పందన' శీర్షికకి 360, 'కృష్ణాతరంగిణి' శీర్షికకి 300కి పైగా, 'సాహిత్యంలో స్త్రీ' శీర్షికకి మరెన్నో వ్యాసాలు ప్రచురింపబడ్డాయి.)

స్త్రీ హృదయానుగత భావాల్ని, వారి జీవితాల్ని, సమాజ స్థితిగతుల్ని లోతుగా పరిశీలించి తన రచనల్లో అద్భుతంగా ఆవిష్కరించగల శ్రీమతి వేదుల శకుంతల గారి రచనా మేధ, సాహితీ కృషి ఎన్నటికీ అలుపు ఎరుగదు.

'ఆర్తి, ఆస్ట్రేల్ ఆడది, పునాది రాళ్ళు, శారద రాత్రులు, వెలుగు వాకిలి' నవలలు శకుంతల గారి కలం నుండి జాలువారిన అక్షర వెన్నెల కిరణాలు. వీటిలో 'ఆర్తి, అరుంధతి, శారదరాత్రులు, వెలుగు వాకిలి' నవలలు కన్నడభాషలోకి అనువదించబడ్డాయి.

ఇలా శకుంతల గారి వైవిధ్యభరిత రచనా ప్రతిభకి ముగ్ధత పొంది ఆమె దగ్గరికి పరుగులు తీస్తూ వచ్చిన అవార్డులు -

[illegible]రెడ్డి రంగనాయకమ్మ అవార్డు ('సాహిత్య అకాడెమీ' ద్వారా ఉత్తమ రచయిత్రిగా)

[illegible]టూరి వెంకటసుబ్బారావు అవార్డు ('మనసెప్పుడూ గుప్పెడే' కథా సంపుటికి)

[illegible] స్మారక అవార్డు ([illegible] కథకి)

నవ్యసాహితీ అవార్డు ('మంచు కురిసిన వేళ మమత నవ్వింది' కథకి ఉత్తమ రచయిత్రిగా)

[illegible] సెంట్రల్ యూనివర్సిటీ [illegible]

